శ్రీ శంకరాచార్య కృత

# గణేశ పంచరత్నమ్

**1. ముదా కరాత్తమోదకం సదా విముక్తి సాధకం**
**కళాధరావతంసకం విలాసి లోకరక్షకమ్**
**అనాయకైకనాయకం వినాశి తేభ దైత్యకం**
**నతాశుభాశునాశకం నమామి తం వినాయకమ్.**

ఆనందముతో హస్తమందు మోదకమును ధరించిన వాడును, ఎల్లప్పుడు విముక్తి సాధకుడును, చంద్రుని ఆభరణముగా శిరస్సున ధరించిన వాడును, విలాసి లోకమునకు రక్షకుడును, సర్వ లోకమునకు మరి యొక ప్రభువు లేని ఏకైక నాయకుడను, గజాసురుని నాశనము చేసిన వాడును, నమస్కరించు వారల అశుభములను శీఘ్రముగా నశింప చేయు వాడును నగు వినాయకుని నమస్కరింతును.

**2. నతేత రాతి భీకరం నవోదితార్కభాస్వరం**
**నమత్సురారి నిర్జరం నతాధికాప దుద్ధరమ్**
**సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం**
**మహేశ్వరం త మాశ్రయే పరాత్పరం నిరన్తరమ్.**

తనకు నమస్కరించని వారలకు అత్యంత భయంకరుడును, నూతనముగా ఉదయించిన సూర్యునివలె ప్రకాశించుచున్న వాడును, నమస్కరించు సురాసురులు గలవాడును, నమస్కరించు వారల అధికమైన ఆపత్తులను పోగొట్టు వాడును, సురేశ్వరుడును, నిధీశ్వరుడును, గజేశ్వరుడును, ప్రమధ గణేశ్వరుడును, మహా ప్రభువును పరాత్పరుడును నగు, ఆ వినాయకుని నిరంతరము ఆశ్రయింతును.

**3. సమస్తలోక శంకరం నిరస్తదైత్యకుంజరం**
**దరేతరోదరం వరం వరేభవక్త్ర మక్షరమ్**
**కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం**
**మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్.**

సమస్త లోకమునకు సుఖమును కలుగ చేయువాడును, నశింపచేసిన రాక్షస శ్రేష్ఠులు గలవాడును, పెద్ద పొట్ట గలవాడును, శ్రేష్ఠుడును, శ్రేష్ఠమైన గజవక్త్రము గలవాడును, నాశరహితుడును, కృపకు క్షమకు సంతోషమునకు నిలయమైనవాడును, నమస్కరించు వారలకు చక్కని మనస్సును కలుగ చేయు వాడును, ప్రకాశించు ఆ వినాయకుని నమస్కరింతును.

4. అకించనార్తి మార్జనం చిరంతనోక్తి భాజనం
పురారి పూర్వనందనం సురారిగర్వచర్వణమ్
ప్రపంచనాశభీషణం ధనంజయాదిభూషణం
కపోలదానవారణం భజే పురాణవారణమ్.

దరిద్రుల ఆర్తిని పోగొట్టువాడును, వేదములకు నిలయమైనవాడును, పరమేశ్వరుని పెద్ద కుమారుడును, రాక్షస గర్వ భంజకుడును, ప్రపంచనాశమందు భయంకరమైనవాడును, అగ్ని మున్నగు దేవతలకు అలంకారమైనవాడును, గండ స్థల మందు స్రవించు మద జలమును నివారించుచున్న వాడును నగు అనాదిసిద్ధ గజమును (వినాయకుని) సేవించెదను.

5. నితాన్తకాన్త దన్తకాన్తి మన్త కాన్త కాత్మజమ్
అచిన్త్యరూప మన్తహీన మన్తరాయకృన్తనమ్
హృదన్తరే నిరన్తరం వసన్తమేవ యోగినాం
త మేకదన్త మేవ తం విచిన్తయామి సంతతమ్.

అత్యన్త మనోహరమైన దన్తకాన్తి గలవాడును, మృత్యుంజయుని పుత్రుడును, వాఙ్మనసాతీతమైన రూపముగల వాడును, నాశరహితుడును, సర్వ ప్రతిబంధక నాశకుడును, యోగుల హృదయ పుండరీకములందు నిరన్తరము వసించు వాడును నగు ఆ యేకదంతునే నిరన్తరము స్మరించుదును.

6. మహాగణేశపంచరత్న మాదరేణ యోఽన్వహం
ప్రజల్పతి ప్రభాతకే హృది స్మర న్గణేశ్వరమ్
అరోగతా మదోషతాం సుసాహితీం సుపుత్రతాం
సమాహితాయు రష్టభూతి మభ్యుపైతి సోఽచిరాత్.

ఎవడు ఈ మహాగణేశ పంచరత్నమును ఆదరముతో ప్రతి నిత్యము గణేశ్వరుని హృదయమున స్మరించుచు ప్రాతః కాలమున పఠించునో అతడు ఆరోగ్యమును పాప రాహిత్యమును, యోగ్యమైన సాహిత్యమును, యోగ్య సన్తతిని, పూర్ణాయువును అష్టైశ్వర్యములను శీఘ్రముగా పొందును.

*శ్రీ శంకర భగవత్పాద కృతమగు, గణేశ పంచరత్నము సంపూర్ణమ్.*

## గణేశ భుజంగప్రయాత స్తోత్రమ్

1. రణత్ క్షుద్ర ఘంటా నినాదాభిరామం
చలత్తాండ వోద్దండ పత్పద్మ తాళమ్
లస త్తుందిలాంగోపరి వ్యాలహారం
గణాధీశ మీశానసూనుం త మీడే.

చిఱుగంటలు గల్లుగల్లని మ్రోయుచుండ పాద పద్మములు తాళము వేయగా నృత్యము చేయుచు సర్పహారము తన దొడ్డశరీరమున మిసమిసలాడుచు వింత గూర్పగా నొప్పు శివుని కుమారుని గణాధీశుని నుతించెదను.

2. ధ్వనిధ్వంస వీణాలయోల్లాసి వక్త్రం
స్ఫుర చ్ఛుండ దండోల్లస ద్బీజపూరమ్
గళ ద్దర్ప సౌగంధ్య లోలాళిమాలం
గణాధీశ మీశానసూనుం త మీడే.

నిరుపమాన వీణాతాళముల కుల్లాసపడు ముద్దు మొగముతో, తొండముతో బంతివలె మాదీఫలమునుదాల్చి, స్రవించుచున్న మదజల సౌగంధ్యమును మరగిన తుమ్మెదలు బారులుతీరి ఝుంకారములు చేయుచుండ నొప్పు శివపుత్రుని గణాధీశుని వినుతించెదను.

3. ప్రకాశ జ్జపారక్త రత్న ప్రసూన
ప్రవాళ ప్రభాతారుణ జ్యోతి రేకమ్
ప్రలంబోదరం వక్రతుండై క దంతం
గణాధీశ మీశానసూనుం త మీడే.

జారుచున్న యుదరముతో, వక్రతుండముతో, ఏకదంతముతో, రాశిబోసిన మందారపువ్వులో, రత్నములో, పగడములో లేక ఉదయించుచున్న సూర్యుడో అన్నట్లు ఎఱ్ఱని జ్యోతిరూపుడై వెలుంగు ఈశాన పుత్రుని గణాధీశుని వినుతించెదను.

4. విచిత్ర స్ఫుర ద్రత్నమాలా కిరీటం
కిరీటోల్లస చ్చంద్రరేఖా విభూషం
విభూషైక భూషం భవధ్వంస హేతుం
గణాధీశ మీశానసూనుం త మీడే.

వివిధ రత్న విచిత్ర కిరణమాలికలతో కిరీటము, కిరీటముపై చంద్రరేఖా విభూషణము కలిగి విభూషణములకు విభూషణమై మోక్షప్రదుడైన పరమేశ్వర కుమారుని గణాధీశుని స్తుతించెదను.

**5. ఉదంచ ద్భుజావల్లరీ దృశ్య మూలో**
**చ్చల ద్భ్రూలతా విభ్రమ భ్రాజ దక్షమ్**
**మరుత్సుందరీ చామరైః సేవ్యమానం**
**గణాధీశ మీశానసూనుం త మీడే.**

నృత్యము చేయునప్పుడు పైకెత్తిన కరములందలి పుష్పగుచ్ఛములతో బాటు చూడముచ్చటగా చలించుచున్న కనుబొమల విలాస దీప్తులకు దిట్టయై అమరీ చామర సేవ కానందించు శివకుమారుని సేవించెదను.

**6. స్ఫుర న్నిష్ఠురాలోల పింగాక్షి తారం**
**కృపా కోమలోదార లీలావతారమ్**
**కళాబిందుగం నీయతే యోగివర్యైః**
**గణాధీశ మీశానసూనుం త మీడే.**

కొంచెము నిష్ఠురములై కదలుచున్న గోరోచనపు వన్నెగల నయన తారకలు వెలుంగుచుండ, యోగివర్యులు హృదయమున కళాబిందు మధ్యమున నిల్పి కీర్తించుచుండ కరుణాకోమల లీలావతార మూర్తియగు శివకుమారుని గణనాథుని వినుతించెదను.

**7. య మేకాక్షరం నిర్మలం నిర్వికల్పం**
**గుణాతీత మానంద మాకారశూన్యమ్**
**పరం పారమోంకారమామ్నాయ గర్భం**
**వదంతి ప్రగల్భం పురాణం త మీడే.**

గుణాతీతమగుటచే నానందమై, ఆకార శూన్యమగుటచే నిర్వికల్పమై, సంసార సాగరమున కావల సమస్త వేదములను గర్భమున దాల్చిన నిర్మల ప్రణవాక్షర మూర్తియై, పురాణపురుషుడని చెప్పబడు శివకుమారుని గణనాథుని ప్రశంసించెదను.

**8. చిదానంద సాంద్రాయ శాంతాయ తుభ్యం**
**నమో విశ్వకర్త్రే చ హర్త్రే చ తుభ్యమ్**
**నమోఽనన్త లీలాయ కైవల్యభాసే**
**నమో విశ్వబీజ! ప్రసీద దేవసూనో!.**

విశ్వమునకు బీజము, కర్తయు, పితయు, హర్తయు నగుచు విశ్వమునందలి అనంత లీలలకు ఏకైక శాంతప్రభాకందమై సత్యజ్ఞానానంద ఘన మూర్తి వగు నో శివపుత్రా! నీకు నమశ్శతములు.

**9. ఇమం సుస్తవం ప్రాత రుత్థాయ భక్త్యా**
**పఠే ద్యస్తు మర్త్యో లభే త్సర్వకామాన్**
**గణేశ ప్రసాదేన సిద్ధ్యంతి వాచో**
**గణేశే విభౌ దుర్లభం కిం ప్రసన్నే?.**

ఈ స్తవమును ప్రాతః కాలమున భక్తితో పఠించిన మనుష్యుడు సర్వకామములను వాఙ్మాధుర్యమును కైవసము చేసికొనును. శ్రీ గణేశ్వరుడే ప్రసన్నుడైనచో సిద్ధింపని దేముండును ? గణేశ్వరుని ప్రసన్నముచే సర్వము సిద్ధించునని భావము.

***ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం గణేశ భుజంగ ప్రయాత స్తోత్రం సంపూర్ణమ్.***

## శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమ్ స్తవరాజమ్

**1. ఉపాసకానాం యదుపాసనీయ**
**ముపాత్తవాసం వటశాఖిమూలే**
**తద్ధామ దాక్షిణ్యజుషాస్వమూర్త్యా**
**జాగర్తు చిత్తే మమ బోధరూపమ్.**

ఉపాసనా మార్గమునందున్న వారికి సేవింపదగినదై వట వృక్షమూలమున నివసించు నే తేజస్సుగలదో, దాక్షిణ్యము (ప్రేమ) తో నొప్పు రూపముగల యా తేజస్సు జ్ఞానరూపమై నా మనస్సునందు నిలిచియున్నది.

**2. అద్రాక్ష మక్షీణ దయానిధాన**
**మాచార్య మాద్యం వటమూలభాగే**
**మౌనేన మందస్మిత భూషి తేన**
**మహర్షి లోకస్య తమో నుదన్తమ్.**

వట వృక్ష మూలమునందు అపారమైన దయకు నిలయమై చిఱునగవుచే నలంకరింపబడిన మౌనభావముచే మహర్షి సముదాయము యొక్క అజ్ఞానమును పారద్రోలుచున్న ఆది గురువును చూడగంటిని.

**3. విద్రావితాశేష తమోగణేన**
**ముద్రావిశేషేణ ముహుర్మునీనామ్**
**నరస్య మాయాం దయయా విధత్తే**
**దేవో మహాం స్తత్వ మసీతి బోధమ్.**

ఆ మహాదేవుడు దయచే సమస్త జ్ఞాన సముదాయమును పారద్రోలు నట్టి జ్ఞానముద్రచే మాటిమాటికి మహర్షులకు మాయను పోగొట్టి, "ఆపరతత్త్వము నీవేయై యుంటివి" అనునట్టి జ్ఞానమును కలుగజేయుచున్నాడు.

**4. అపార కారుణ్య సుధాతరంగై**
**రపాఙ్గపాతై రవలోకయ న్తమ్**
**కఠోర సంసార నిదాఘ తప్తాన్**
**న్మునీ నహం నౌమి గురుం గురూణామ్.**

తీవ్రమైన సంసార మనెడి గ్రీష్మముచే తపింపజేయబడిన మహర్షులను అంతములేని కరుణామృత లహరులైన క్రీగంటి ప్రసారములతో చూచుచున్నట్టి గురువులకు కూడ గురువగు ఆ దక్షిణామూర్తి స్వామిని నేను స్తుతించుచున్నాను.

**5. మమాద్య దేవో వటమూలవాసీ**
**కృపావిశేషాత్కృత సన్నిధానః**
**ఓంకారరూపా ముపదిశ్య విద్యా**
**మావిద్యక ధ్వాన్త మపాకరోతు.**

వట వృక్షమూలమున నివసించువాడును, దయా విశేషముచే సన్నిధానము నొసంగు వాడును నగు ఆది దేవుడగు దక్షిణామూర్తి నా కిపుడు ఓంకారరూపమగు బ్రహ్మ విద్య నుపదేశించి అజ్ఞానాంధకారమును పారద్రోలు గాక !

**6. కలాభి రిన్దో రివ కల్పితాఙ్గం**
**ముక్తాకలాపై రివ బద్ధమూర్తిమ్**
**ఆలోకయే దేశిక మప్రమేయ**
**మనాద్యవిద్యా తిమిరప్రభాతమ్.**

చంద్ర కళల చేతనుగాని లేక ముత్యముల సముదాయముల చేతనుగాని యేర్పరుపబడిన శరీరము గలవాడువలె నొప్పువాడును, అనాదిగ నేర్పడిన అజ్ఞానమనెడి యంధకారమును పారద్రోలువాడును, సాటిలేని గురు రూపుడును నగు దక్షిణా మూర్తిని చూచుచుంటిని.

**7. స్వదక్ష జానుస్థిత వామపాదం**
**పాదోదరాలంకృత యోగపట్టమ్**
**అపస్మృతే రాహిత పాద మఙ్గే**
**ప్రణౌమి దేవం ప్రణిధానవన్తమ్.**

తన కుడి మోకాలునందు వామపాదమును చేర్చి పాదములందు, నడుమునందు అలంకరింపబడిన యోగపట్టము గలవాడును, స్మృతిలేని వాని (అంధకాసురుని) శరీరము నందుంచబడిన పాదము గలవాడును సమాధియందున్న శ్రీ దక్షిణామూర్తి దేవుని స్తుతింతును.

**8. తత్త్వార్థ మన్తే వసతా మృషీణాం**
**యువాపి యస్సన్ను పదేష్టు మీష్టే**
**ప్రణౌమి తం ప్రాక్తనపుణ్యజాలై**
**రాచార్య మాశ్చర్యగుణాధివాసమ్.**

ఏ దేవుడు తాను పిన్నవయసు నందున్నను తనను సమీపించిన ఋషులకు ఆత్మతత్త్వము నుపదేశింప సమర్థుడో, అశ్చర్యకరములైన గుణములకు నిలయుడైన యట్టి గురురూపుడగు దక్షిణామూర్తి దేవుని జన్మాంతర పుణ్య సముదాయముచేత స్తుతింతును.

**9. ఏకేన ముద్రాం పరశుం కరేణ**
**కరేణ చాన్యేన మృగం దధానః ।**
**స్వజాను విన్యస్తకరః పురస్తా**
**దాచార్య చూడామణి రావిరస్తు.**

ఒక చేతితో పరశు (జ్ఞాన) ముద్రను, మరియొక చేతితో లేడిని ధరించి తన మోకాళ్ళయందుంచబడిన చేతులు గల గురుశిరోమణియగు శ్రీ దక్షిణామూర్తి నాయెదుట సాక్షాత్కరించు గాక!

**10. ఆలేపవన్తం మదనాఙ్గభూత్యా**
**శార్దూలకృత్యా పరిధానవన్తమ్**
**ఆలోకయే కఞ్చనదేశికేన్ద్ర**
**మజ్ఞానవారా కర బాడబాగ్నిమ్.**

మన్మథుని చితాభస్మమును శరీరమునందుపూసికొని వ్యాఘ్రచర్మాంబర ధారియై అజ్ఞాన మనెడి సముద్రమునకు బడబానలము (నాశకుడు) అగు నొకానొక గురు రాజును (దక్షిణామూర్తిని) చూడగంటిని.

**11. చారుస్మితం సోమకళావతంసం**
**వీణాధరం వ్యక్తజటాకలాపం**
**ఉపాసతే కేచన యోగిన స్త్వాం**
**ముపాత్త నాదానుభవ ప్రమోదమ్.**

చంద్రకళను శిరోభూషణముగ ధరించి, యందముగ నున్నవాడును, ప్రకాశించుచున్న జడలు గలిగినవాడును, వీణను ధరించి నాదానుభవముచే మహానందము ననుభవించుచున్న దక్షిణామూర్తిని అదృష్టవంతులు ఉపాసింతురు.

**12. ఉపాసతే యం మునయ శ్శుకాద్యా**
**నిరాశిషో నిర్మమతాధివాసాః**
**తం దక్షిణామూర్తి తనుం మహేశ**
**ముపాస్మహే మోహమహార్తి శాన్త్యై.**

మమకారమును వాంఛలను వీడిన శుకాది మునులు సేవించునట్టి దక్షిణామూర్తి రూపుడగు మహేశ్వరుని అజ్ఞానమనెడి మహా ఆపద శమించుటకై సేవింతును.

**13. కాన్త్యా నిందిత కుంద కందల వపుర్న్య గ్రోధమూలే వస**
**క్కారుణ్యామృత వారిభి ర్మునిజనం సంభావయ న్వీక్షితైః**
**మోహ ధ్వాన్త విభేదనం విరచయ న్బోధేన తత్తాదృశో**
**దేవ స్తత్త్వమసీతి బోధయతు మాం ముద్రావతాపాణినా.**

శరీరకాంతిచే మల్లె మొగ్గలను తిరస్కరించుచు, వట వృక్షమూలమున నివసించుచు, దయామృతముతో నిండిన చూపులచే మునిజనులను ఆదరించుచు, జ్ఞానముచే అజ్ఞానాంధకారమును నశింపజేయుచున్న ఆ దక్షిణామూర్తి దేవుడు జ్ఞానముద్రను ధరించిన చేతితో నాకు 'తత్త్వమసి' (ఆ పరమాత్మవునీవే) అను జ్ఞానమును బోధించు గాక!

**14. అగౌర గాత్రై రలలాట నేత్రై**
**రశాన్త వేషై రభుజంగభూషైః**
**అబోధ ముద్రై రనపాస్తనిద్రై**
**రపూర్ణ కామై రమరై రలం నః.**

తెల్లని శరీరములులేని, ఫాల నేత్రములు లేని, శాంతమగు వేషములు లేని, నాగా భరణములులేని, జ్ఞానముద్రలులేని, అజ్ఞాన నిద్రనువీడని, పొందని కోరికలు గల దేవతలు మాకవసరము లేదు.

అనగా తెల్లని శరీరమును, ఫాల నేత్రమును, శాంత వేషమును, నాగాభరణములను, జ్ఞానముద్రను ధరించిన అజ్ఞాన నిద్రను వీడి పరిపూర్ణ కాముడగు పరమేశ్వరుడు చాలును, ఇతర దైవరూపములు మాకక్కరలేదు అని భావము.

**15. దైవతాని కతిసన్తి చావనౌ**
**నైవ తాని మనసోమతాని మే**
**దీక్షితం జడధియా మనుగ్రహే**
**దక్షిణాభిముఖ మేవ దైవతమ్.**

భూమి యం దెందరు దేవతలున్నారు! కాని వారు నా మనస్సునకురుచించరు. మంద బుద్ధుల ననుగ్రహించుటకు దీక్షను వహించిన దక్షిణాభి ముఖుడగు దక్షిణా మూర్తియే దేవుడు.

**16. ముదితాయ ముగ్ధశశినాఽవతంసినే**
**భసితావలేప రమణీయ మూర్తయే**
**జగదిన్ద్ర జాల రచనా పటీయసే**
**మహసే నమోఽస్తు వటమూలవాసినే.**

నిత్య సంతోషియు, మనోహరమైన చంద్రుడు శిరో భూషణముగ గలదియు, భస్మాంగరాగముచే మనోహరమైన రూపము గలదియు, ప్రపంచ మనెడి ఇంద్ర జాలమును (గారడిని) రచించుటయందు సమర్థమైనదియు, వటవృక్ష మూలమునందు నివసించు తేజస్సు కొఱకు నమస్కారమగు గాక!

**17. వ్యాలమ్బినీభిః పరితో జటాభిః**
**కళావశేషేణ కలాధరేణ**
**పశ్యల్లలాటేన ముఖేన్దునా చ**
**ప్రకాశసే చేతసి నిర్మలానామ్.**

నలువైపుల వ్రేలాడుచున్న జడల చేతను, కళామాత్రావశిష్టుడగు చంద్రుని తోడను చూచుచున్న ఫాలభాగము గల - అనగా ఫాల నేత్రముతో గూడిన-చంద్రునివంటి ముఖముతోను పాప రహితులైన వారి మనస్సునందు భాసించుదువు.

**18. ఉపాసకానాం త్వ ముమా సహాయః**
**పూర్ణేందు భావం ప్రకటీకరోషి**
**య దద్య తే దర్శన మాత్రతో మే**
**ద్రవ త్యహో! మానస చంద్ర కాన్తః.**

ఉమా సమేతుడవై నీవు నిన్ను ఉపాసించువారికి పూర్ణచంద్రభావమును ప్రకటించుచున్నావు. ఎందువలననగా, నీ దర్శన మాత్రముచే నా మానస మనెడి చంద్రకాంత మణి ద్రవించుచున్నది. ఎంత ఆశ్చర్యము! పూర్ణచంద్ర కిరణ ప్రసారమున చంద్రకాంతమణి నీటిని చెమర్చుట లోక ప్రసిద్ధము గదా !

**19.** యస్తే ప్రసన్నా మనుసందధానో
మూర్తిం ముదా ముగ్ధ శశాంక మౌలేః
ఐశ్వర్య మాయుర్ల భతేచ విద్యా
మన్తేచ వేదాన్త మహారహస్యమ్.

మనోహరమైన చంద్రకళ శిరస్సునందు గల ప్రసన్నమైన నీ మూర్తిని సంతోషముతో ధ్యానించు జనుడు ఐశ్వర్యమును, ఆయువును, విద్యను పొందినవాడై తుదకు ఉపనిషదర్థ రహస్యమును అధిగమించును.

*ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం దక్షిణామూర్తి స్తోత్రం/ స్తవరాజమ్ సంపూర్ణమ్.*

## శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమ్ (అష్టకమ్)

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యువానం,
వర్షిష్ఠాన్తే వసదృషి గణైరావృతం బ్రహ్మ నిష్ఠైః ।
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్రమానంద మూర్తిం,
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే ॥

మౌనముగా ఉండుటయే ముద్ర అని చెప్పబడును. ఆ బ్రహ్మమే నేనై ఉన్నాను అను స్థితియే నిష్ఠ. అభేదమైన సోஉహం మంత్రజపమే సాధనము. చిత్తం ఏకాగ్రము చేసి ఆత్మయందు నిలుపుటయే సాధన పరికరము. సమస్త ఇంద్రియములను ఈశ్వరార్పణ చేయుటయే అర్పణము. మెలుకువ, కల, నిద్ర మొదలగు అవస్థలే కాలము. బ్రహ్మరంధ్రమే స్థానము. సృష్టి సమయములో బ్రహ్మదేవుడు పరమశివుని ఉపాసించి సృష్టిచేయు శక్తిని సంపాదించెను. ఆ పరమశివుడే శ్రీ దక్షిణామూర్తిగా ఆవిర్భవించి మౌనముద్రతో జ్ఞానము ఉపదేశించెను.

దక్షిణ అనగా జ్ఞానము, మూర్తి అనగా శరీరము, జ్ఞాన శరీరముదాల్చిన స్వరూపము శ్రీ దక్షిణామూర్తి స్వరూపము. అటువంటి దక్షిణామూర్తి ఆదిగురువుగా, జగద్గురువుగా శాస్త్రములో తెలుపబడినది. గురువు యొక్క అనుగ్రహము పొందినచో సకల విశ్వముయొక్క జ్ఞానము పొందవచ్చును.

**1.** విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం ।
పశ్య న్నాత్మని మాయయా బహిరివో ద్భూతం యథా నిద్రయా ।
య స్సాక్షాత్కురేతే ప్రబోధసమయే స్వాత్మాన మేవాద్వయం ।
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥

ఈ విశ్వమంతయును ఆత్మయందే యున్నది. కాని దర్పణము (అద్దము) నందు కనబడు నగరము వలె బాహ్యముగా నున్నట్లు భాసించు చున్నది. స్వప్రకాశమైన ఆత్మకు, మాయ యొక్క ప్రభావమున విశ్వము బాహ్యముగా నున్నట్లు కనిపించు చున్నది. సద్గురు సన్నిధానమున, సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మము నేనే అన్న ఆత్మజ్ఞానము పొందిన వానికి విశ్వమంతయు నిద్రాస్థితిలో కల్గిన స్వప్నము వలె మాయాకల్పితమని తెలియును ఆత్మ బోధ నొసగు సద్గురు స్వరూపమైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించుచున్నాను.

**2. బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః ।**
**మాయా కల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతం ।**
**మాయావీవ విజృంభయ త్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయా ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

బీజము లోపల పుష్పఫల శాఖాదులతో కూడిన వృక్షము, అంకురశక్తిగా దాగియున్నట్లు ఈ జగత్తు సృష్టికి పూర్వము, నిర్వికల్పముగా (భేద రహితముగా నుండును) మరల సృష్టిసమయము నందు మాయ చేత కల్పింపబడిన దేశకాలముల యొక్క సంబంధము చేత, నానా విధములగు, విచిత్ర రూపములలో సృజింప బడినది. ఏ పరమేశ్వరుడు తన (స్వ) సంకల్పము చేత ఇంద్రజాలకుని వలె సర్వమును స్వతంత్రముగా సృష్టించు చున్నాడో అట్టి సద్గురు స్వరూపమైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించు చున్నాను.

**3. యస్యైవ స్ఫురణం సదాత్మకమస త్కల్పార్థగం భాసతే ।**
**సాక్షాత్ తత్త్వమసీతి వేదవచసా యోబోధయత్యా శ్రితాన్ ।**
**యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తిర్భవాంభోనిధౌ ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

గురు రూపమున వెలుగొందు చున్న యే పరమాత్మ యొక్క సద్రూపమైన ప్రకాశమే మిద్యా స్వరూపములైన పదార్థచయములను చేరి ప్రకాశముతో భాసించు చున్నదో, ఎవరు తనను అనన్యభావముతో ఆశ్రయింతురో వారికి 'తత్త్వమని' అను మహా వాక్యాము చేత బ్రహ్మోపదేశమును చేయునో ఎటువంటి సద్రూపమైన సాక్షాత్కారము చేత సాధకునకు సంసార సాగరము నుండి అపునరావృత్తి పథము లభించుచున్నదో, అటు వంటి సద్గురు స్వరూపమైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించు చున్నాను.

**4. నానాచ్ఛిద్ర ఘటోదర స్థిత మహా దీప ప్రభాభాస్వరం ।**
**జ్ఞానం యస్యతు చక్షురాదికరణ ద్వారా బహిః స్పందతే ।**
**జానామీతి తమేవ భాంత మనుభా త్యేతత్ సమస్తం జగత్ ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

అనేక రంధ్రములు గల కుండలోపల నున్న పెద్ద దీపము యొక్క వెలుగు ప్రకాశించునట్టి కాంతివలె, ఎవని యొక్క అంతః కరణము నందు జ్ఞానము ప్రతిఫలించి కన్ను ముక్కు మెదలైన పంచేంద్రియములు ద్వారా ప్రసరించు చున్నదో, నేను తెలుసుకొనుచున్నానను భావమును భాసింపజేయుచు, నిరపేక్షముగా ప్రకాశించు ఆత్మ చైతన్యము ననుసరించి ఈ జగత్తు సర్వము వెలుగుచున్నదో అట్టి సద్గురు స్వరూపమైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించుచున్నాను.

**5. దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః।**
**స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహమితి భ్రాంతా భృశం వాదినః ।**
**మాయాశక్తి విలాస కల్పిత మహా వ్యామోహ సంహారిణే ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

స్త్రీలు, అంధులు, జడులవలె, ఆద్యంతము భ్రాంతిలో పడి, చాణ్వక, బౌద్ధాదివాదులు స్థూల దేహమును, ప్రాణమును, ఇంద్రియాది చక్షుశ్శ్రోత్రాదులను, బుద్ధిని సైతము నేనను కొనుచున్నారు. ఇట్టి మాయాశక్తిచేత కల్పింపబడిన మహాభ్రాంతిని సమూలముగా నాశనము చేయునట్టి మోక్షలక్ష్మి సంపన్నుడగు సద్గురు స్వరూపుడు శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించు చున్నాను.

**6. రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనాత్ ।**
**సన్మాత్రఃకరణోపసంహరణతో యోఽ భూత్సుషుప్తఃపుమాన్ ।**
**ప్రాగస్వాప్స మితి ప్రభోధసమయె యః ప్రత్యభిజ్ఞాయతే ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

రాహువుచేత ఆవరింపబడిన సూర్యచంద్రులవంటి మాయా సమాచ్ఛాదితమైన ఏ ఆత్మ ఇంద్రియ వ్యాపారములలో లీన మగుటవలన గాఢ నిద్ర పరవశుడైతాను కేవల సద్రూపుడనని గ్రహించి మేల్కాంచినపుడు ఇంతకు పూర్వము నిద్రించితినను ఎటువంటి ప్రత్యభిజ్ఞను (జ్ఞాపకమును) పొందుచున్నాడో అటువంటి ప్రత్యభిజ్ఞ స్వరూపుడైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించు చున్నాను.

**7. బాలాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి ।**
**వ్యావృత్తా స్వనువర్తమాన మహమి త్యంత స్ఫురంతం సదా ।**
**స్వాత్మానంప్రకటీకరోతి భజతాం యోముద్రయా భద్రయా ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

ప్రత్యక్ చైతన్యమునకు భిన్నుడు కాని ఏపరమాత్మ బాల్య కౌమార, యౌవన, వార్ధక్యదశల యందు జాగ్రత్, స్వప్న సుషుప్తి దశల యందును మరియు పరస్పర భిన్నములైన అవస్థల యందు తనను నేను అనునది ఎట్లు ఎల్లప్పుడును లోపల అనుసరించియున్నదో, అట్టి ఆత్మ స్వరూపమును చిన్ముద్రతో ప్రకటించు సద్గురు స్వరూపుడైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించు చున్నాను.

**8. విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః ।**
**శిష్యాచార్యతయా తథైవ పితృ పుత్రాద్యాత్మనా భేదతః ।**
**స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయా పరిభ్రామితః ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

తాను సచ్చిదానంద స్వరూపుడు, సర్వవ్యాపియై యున్నను మాయచేత భ్రాంతిలో పడిన యే ప్రాణులందరి యందును పరోక్షముగా భాసించునట్టి పురుషుడు (ఆత్మ) కార్య కారణ సంబంధముతోను, గృహ, క్షేత్ర మిత్రాదుల సంబంధముతోను సామిత్వ సంబంధముతోను, శిష్యాచార్య సంబంధముతోను, తండ్రీకొడుకుల సంబంధముతోను భేదదృష్టితోను చూచుచుండు ఇట్టి దృష్టికి అవిద్యారూపమైన భ్రాంతియే కారణము. అద్వయ ఆత్మబ్రహ్మ సాక్షాత్కారము కలుగు నంతవరకు ఈ ద్వైత భ్రాంతి తప్పదు. మాయా వశుడగుట వలన పరబ్రహ్మయే యిట్టి నానావిధ భేద భావములతో చూచు చుండును. పరమేశ్వరా భిన్నుడగు సద్గురుమూర్తి ఈ భేదభావమును పోగొట్టెను. అట్టి సద్గురు స్వరూపమైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించు చున్నాను.

**9. భూరంభాంస్యనలోఽ నిలోఽంబర మహ ర్నాథో హిమాంశుః ।**
**పుమా నిత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।**
**నాన్యత్కించ న విద్యతే విమృశతాం యస్మాత్ పరస్మాద్విభోః ।**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

ఏ పరమేశ్వరుని చరాచరాత్మక రూపములు ఈ విశ్వమందు అష్టవిధములైన మూర్తులలో భాసించు చున్నవో, వాటిని శ్రుతి, యుక్తి అనుభవములతో చక్కగా విచారణ చేసిన జ్ఞాన నిష్ఠులైన వారికి సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు అయిన పరమేశ్వరునకు అన్యమైన

దేదియు యండదు. అట్టి సర్వవ్యాపకుడైన సద్గురు స్వరూపుడు శ్రీ దక్షిణామూర్తికి నమస్కరించు చున్నాను (పృధ్వి, ఆపః, తైజో, వాయురాకాశములు, సూర్య చంద్రులు, జీవాత్మ అనునవి అష్ట మూర్తులు).

**10. సర్వాత్మత్త్వమితి స్ఫుటీ కృత మిదం యస్మాదముష్మిం స్తవే ।**
**తేనాన్య శ్రవణాదర్థ మననా ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।**
**సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యాదీశ్వరత్వం స్వతః ।**
**సిద్ధ్యే త్తత్పునరష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్ ॥**

సర్వాత్మత్వము అనగా ప్రత్యగాత్మ స్వరూపత్వము. ఈ స్తోత్రమును స్పష్టముగా ప్రపంచితము చేయబడినది దీనిని చక్కగా విచారణ చేయుచు ధ్యానము చేసిన సర్వాత్మయనెడి మహా విభూతి (సిద్ధి) సహితముగా సత్యజ్ఞాన ఆనంద లక్షణములతో వర్తించు పరమేశ్వరత్వము సిద్ధించును. మరియు మాయా పరిణామ రూపమైన అణిమాద్యష్ట సిద్ధులు, ఐశ్వర్యము సిద్ధించును. ఈ దక్షిణామూర్తి స్తోత్రమున ఈ విధముగా ప్రతిపాదింపబడిన సర్వాత్మత్వము గురుముఖ,... శ్రవణము చేసి, దానియర్థమును చింతనము ధ్యానము చేయుట వలన స్తోత్రము నందు ప్రవచించబడిన మహవిభూతి సిద్ధించును.

*ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం దక్షిణామూర్తి స్తోత్రమ్ సంపూర్ణమ్*

## శ్రీ శివ పఞ్చాక్షరీ స్తోత్రమ్

**1. నాగేన్ద్ర హారాయ త్రిలోచనాయ**
**భస్మాఙ్గరాగాయ మహేశ్వరాయ**
**నిత్యాయ శుద్ధాయ దిగమ్బరాయ**
**తస్మై 'న' కారాయ నమశ్శివాయ.**

సర్ప రాజములు హారములుగ గలవాడును, మూడు నేత్రములు గలవాడును, విభూతిని శరీరమునందు పూసికొనిన వాడును, మహా ప్రభువును, శాశ్వతమైన వాడును, పరిశుద్ధుడును, దిక్కులే వస్త్రములుగ గలవాడును, 'న'కార రూపుడును నగు ఆ శివునకు నమస్కారము.

**2. మన్దాకినీ సలిల చన్దన చర్చితాయ**
**నన్దీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ**
**మన్దార ముఖ్య బహుపుష్ప సుపూజితాయ**
**తస్మై 'మ' కారాయ నమశ్శివాయ.**

ఆకాశగంగా జలమనెడి మంచి గంధముచే పూయబడిన వాడును, నందీశ్వరుడు మున్నగు ప్రమథ నాయకులకు నాథుడును, మందార పుష్పము మున్నగుననేక పుష్పములచే పూజింపబడిన వాడును, 'మ'కార రూపముతో నొప్పు ఆ శివునకు నమస్కారము.

**3. శివాయ గౌరీ వదనాబ్జ బృన్ద**
**సూర్యాయ దక్షాధ్వర నాశకాయ**
**శ్రీ నీలకణ్ఠాయ వృషధ్వజాయ**
**తస్మై 'శి' కారాయ నమశ్శివాయ.**

మంగళ రూపుడును, పార్వతి యొక్క ముఖ మనెడి పద్మ సముదాయమునకు సూర్యునివలె వికాస హేతువైన వాడును, దక్షప్రజాపతి యొక్క యాగమును ధ్వంసము చేసిన వాడును, గరళముచే నల్లనగు కంఠము గలవాడును, వృషభము ధ్వజముగ (వాహనముగ) గలవాడును, 'శి'కార రూపుడును నగు ఆ శివునకు నమస్కారము.

**4. వశిష్ఠ కుమ్భోద్భవ గౌతమాది**
**మునీన్ద్ర దేవార్చిత శేఖరాయ**
**చన్ద్రార్క వైశ్వానర లోచనాయ**
**తస్మై 'వ' కారాయ నమశ్శివాయ.**

వశిష్ఠుడు, అగస్త్యుడు, గౌతముడు మున్నగు మునీశ్వరుల చేతను, దేవతల చేతను పూజింపబడిన శిరస్సు గలవాడును, చంద్రుడు సూర్యుడు అగ్నియు నేత్రములుగ గలవాడును, 'వ'కార రూపుడు నగు ఆ శివునకు నమస్కారము.

**5. యక్షస్వరూపాయ జటాధరాయ**
**పినాక హస్తాయ సనాతనాయ**
**దివ్యాయ దేవాయ దిగమ్బరాయ**
**తస్మై 'య' కారాయ నమశ్శివాయ.**

యక్ష స్వరూపుడును, జడలను ధరించిన వాడును, పినాకమను ధనుస్సు హస్తమునందు గలవాడును, ప్రాచీనుడును, దివ్యరూపుడును, ప్రకాశమానుడును, దిక్కులు వస్త్రముగ గలవాడును, 'య'కార రూపుడును నగు ఆ పరమ శివునకు నమస్కారము.

***ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం శివపంచాక్షరీ స్తోత్రం సంపూర్ణమ్.***



# అర్ధనారీశ్వర స్తోత్రమ్

**1. చాంపేయ గౌరార్థ శరీరకాయై**
**కర్పూర గౌరార్థ శరీరకాయ**
**ధమ్మిల్ల కాయైచ జటాధరాయ**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

చంపక (సంపెంగ) పుష్పమువలె పచ్చనైన శరీరమునందలి సగము మాత్రము గలదియు, కొప్పుతో గూడినదియు నగు పార్వతీ దేవికిని - కర్పూరము వలె తెల్లని అర్ధ శరీరము గలవాడును, జడల ధరించినవాడును నగు శివునకును నమస్కారము.

**2. కస్తూరికా కుంకుమ చర్చితాయై**
**చితారజః పుంజ విచర్చితాయ**
**కృతస్మరాయై వికృత స్మరాయ**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

కస్తూరితోను కుంకుమతోను పూయబడినదియు, మన్మథ వికారమును కలిగించు నదియు నగు పార్వతీ దేవికిని - చితియందలి భస్మముచే విశేషముగ పూయబడిన వాడును, మన్మథునికి వికారమును - అనగా నాశనమును - కల్గించినవాడును నగు శివునకును నమస్కారము.

**3. ఝుణత్క్వణత్కంకణ నూపురాయై**
**పాదాబ్జరాజ త్ఫణి నూపురాయ**
**హేమాంగదాయై భుజగాంగదాయ**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

ఝుణ ఝుణ యనుచున్న చేతి కంకణములు గలదియు, ధ్వనించుచున్న కాలి అందెలు గలదియు, బంగారపు భుజకీర్తులు గలదియు నగు గౌరీ దేవికిని - పాదపద్మముల యందు ప్రకాశించుచున్న పాములు అందెలుగ గలవాడును, పాముల నెడి భుజ కీర్తులతో నొప్పుచున్న వాడును నగు పరమేశ్వరునకు నమస్కారము.

**4. విశాల నీలోత్పల లోచనాయై**
**వికాసి పంకేరుహ లోచనాయ**
**సమేక్షణాయై విషమేక్షణాయ**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

విశాలమైన నల్ల కలువలవంటి నేత్రములు గలదియు, సమదృష్టి గలదియునగు పార్వతికిని-వికసించిన పద్మములవంటి నేత్రములు గలవాడును, విషమదృష్టి (మూడు నేత్రములు) గలవాడు నగు శివునకును నమస్కారము.

**5. మన్దారమాలా కలితాలకాయై**
**కపాల మాలాంకిత కంధరాయ**
**దివ్యాంబరాయై చ దిగంబరాయ**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

మందార మాలతో ప్రకాశించు శిరోజములు గలిగి, దివ్యమైన వస్త్రముతో నొప్పారు పార్వతీ దేవికిని - పుఱ్ఱెల దండలతో నొప్పు కంఠము గలవాడై, దిక్కులే వస్త్రముగ గల శివునకును నమస్కారము.

**6. అంభోధర శ్యామల కుంతలాయై**
**తటిత్ప్రభా తామ్ర జటా ధరాయ**
**నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

నీటి మబ్బువలె నల్లని శిరోజములతో నొప్పారు సర్వేశ్వరియగు పార్వతీ దేవికిని - మెరుపు కాంతివలె నెఱ్ఱనగు జటలను ధరించిన పరమేశ్వరుడగు శివునకును నమస్కారము.

**7. ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై**
**సమస్త సంహారక తాండవాయ**
**జగజ్జనన్యై జగదేక పిత్రే**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

ప్రపంచము యొక్క సృష్టికి నిమిత్తమగు సుకుమార నృత్యముతో నొప్పారు జగజ్జననియగు పార్వతికిని - సర్వ ప్రపంచ సంహార హేతువగు ఉద్ధత నాట్యముతో నొప్పారు జగత్పతియగు పరమేశ్వరునకును నమస్కారము.

**8. ప్రదీప్త రత్నోజ్జ్వల కుండలాయై**
**స్ఫురన్మహా పన్నగ భూషణాయ**
**శివాన్వితాయై చ శివాన్వితాయ**
**నమశ్శివాయై చ నమశ్శివాయ.**

మిక్కిలి ప్రకాశించు రత్నములతో వెలిగెడి కుండలములతో నొప్పారుచు పరమ శివునితో చేరియున్న పార్వతికిని - ప్రకాశించుచున్న మహా నాగములు ఆభరణములుగ గలవాడును, పరమేశ్వరితో నొప్పారు శివునకును నమస్కారము.

9. ఏతత్పఠే దష్టక మిష్టదం యో
భక్త్యా సమాన్యో భువి దీర్ఘ జీవీ
ప్రాప్నోతి సౌభాగ్య మనంతకాలం
భూయాత్సదా తస్య సమస్త సిద్ధిః

సర్వాభీష్టములు నొసంగెడి యీ అష్టకమును భక్తితో పఠించు జనుడు లోకమున పూజ్యుడై చిరంజీవియై, నిరవధికమగు సౌభాగ్యము కలిగి యెల్లప్పుడు సమస్త కార్య సిద్ధిని పొందగలడు.

*ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం అర్ధనారీశ్వర స్తోత్రం సంపూర్ణమ్.*

❧ ❧ ❧

## సుబ్రహ్మణ్య భుజంగ స్తోత్రమ్

1. సదా బాలరూపాపి విఘ్నాద్రిహన్త్రీ
మహాదన్తివక్త్రాపి పంచాస్య మాన్యా
విధీన్ద్రాదిమృగ్యా గణేశాభిధా మే
విధత్తాం శ్రియం కాపి కల్యాణమూర్తిః.

ఎల్లపుడు బాల రూపమున నున్నను, విఘ్నపర్వతముల భేదించునదియు, గొప్ప గజముఖము గలదైనను పంచాస్యుని (సింహము-శివుడు) ఆదర పాత్రమును, బ్రహ్మ యింద్రుడు మున్నగువారిచే వెతుక దగిన గణేశుడను పేరు గల ఒకానొక మంగళరూపము నాకు సంపదను కలుగజేయు గాక !

2. న జానామి శబ్దం న జానామి చార్థం
న జానామి పద్యం న జానామి గద్యమ్
చిదేకా షడాస్యా హృది ద్యోతతే మే
ముఖా న్నిస్సర న్తే గిర శ్చాపి చిత్రమ్.

శబ్దార్థములను గాని, పద్య గద్యములను గాని నే నెఱుంగను, ఆరు ముఖములు గల యొకానొక చిద్రూపము నా మనస్సునందు ప్రకాశించుచున్నది. నా ముఖము నుండి వాక్కులు బయలు దేరుచున్నవి. ఇది యెంతయు చిత్రము!

3. మయూరాధిరూఢం మహావాక్యగూఢం
మనోహారిదేహం మహచ్చిత్తగేహమ్
మహీ దేవ దేవం మహావేదభావం
మహాదేవబాలం భజే లోకపాలమ్.

నెమలి నధిష్ఠించి యున్నవాడును, తత్త్వమస్యాది మహా వాక్యములందు నిగూఢమై యున్నవాడును, మనోహరమైన దేహము గలవాడును, మహాత్ముల చిత్తము నందు వసించువాడును, బ్రాహ్మణుల కారాధ్యుడును, వేదములచే ప్రతిపాధ్యుడును, మహాదేవుని నందనుడును, లోకమును రక్షించు వాడును నగు సుబ్రహ్మణ్యేశ్వరుని సేవింతును.

**4. యదా సన్నిధానం గతా మానవా మే**
**భవామ్భోధి పారం గతా స్తే తదైవ**
**ఇతి వ్యంజయ న్సిన్ధుతీరే య ఆస్తే**
**త మీడే పవిత్రం పరాశక్తి పుత్రమ్.**

"నా సాన్నిధ్యమును పొందిన వెంటనే మనుజులు-సంసార సాగరమును దాటుదురు" అని సూచించుచు, సముద్ర తీరమున నున్న పరదేవత యొక్క పుత్రుడగు పవిత్రుడైన సుబ్రహ్మణ్యుని స్తుతింతును.

**5. యథాఽబ్ధే స్తరంగా లయం యాన్తితుంగా**
**స్తథైవాపద స్సన్నిధౌ సేవతాం మే**
**ఇతీవోర్మిపంక్తీ ర్నృణాం దర్శయన్తం**
**సదా భావయే హృత్సరోజే గుహం తమ్.**

పెద్దవైన సముద్ర తరంగములు లయమును పొందినట్లు నా సన్నిధానమున సేవించు జనుల యాపదలు నశించును అని జనులకు తరంగ పంక్తులను చూపు చున్నట్లుగా నున్న ఆ కార్తికేయుని నిరంతరము నా హృదయ పద్మమున తలంతును.

**6. గిరౌ మన్నివాసే సదా యేఽధిరూఢా**
**స్తదా పర్వతే రాజతే తేఽధిరూఢాః**
**ఇతీవ బ్రువ న్గన్ధశైలాధిరూఢ**
**స్స దేవో ముదే మే సదా షణ్ముఖోస్తు.**

నా నివాసస్థానమగు పర్వతము నెక్కిన నరులు కైలాసము నధిష్టించ గలరు అని చెప్పుచున్న వానివలె గంధశైలము నధిష్ఠించియున్న ఆ షణ్ముఖ దేవుడు నాకు సంతోషమును కలిగించు గాక!

**7. మహామ్భోధి తీరే మహాపాప చోరే**
**మునీన్ద్రానుకూలే సుగన్ధాఖ్య శైలే**
**గుహాయాం వసన్తం స్వభాసా లసన్తం**
**జనార్తిం హరన్తం శ్రయామో గుహం తమ్.**

మహా సాగర తీరమున గొప్ప పాపముల హరించునదియు, మునీశ్వరుల కావాసమును నగు గంధశైలమునందు, గుహయందు తన కాంతితో ప్రకాశించుచు

నివసించు చున్నవాడును, జనుల బాధలను హరించు వాడును నగు కుమారస్వామిని సేవింతుము.

**8. లస త్స్వర్ణ గేహే నృణాం కామదోహే**
**సుమస్తోమ సంఛన్న మాణిక్య మంచే**
**సముద్య త్సహస్రార్క తుల్యప్రకాశం**
**సదా భావయే కార్తికేయం సురేశమ్.**

మనుజుల కోరికల నొసంగు కనక భవనమునందు పుష్ప సముదాయముచే గప్పబడిన రత్న పీఠముపై ఉదయించుచున్న సహస్రాదిత్యులతో సాటియైన వెలుగు గల దేవతా శ్రేష్ఠుడైన కుమారస్వామిని నిరంతరము తలంచెదను.

**9. రణద్ధంసకే మఞులేஉ త్యన్తశోణె**
**మనోహారి లావణ్య పీయూషపూర్ణే**
**మనష్షట్పదో మే భవక్లేశ తప్తః**
**సదా మోదతాం స్కన్ద! తే పాదపద్మే.**

ఓ కుమారస్వామీ! సంసారము నందలి కష్టములచే తపింప జేయబడిన నా మనస్సనెడి తుమ్మెద - శబ్దించుచున్న అందెలతో మనోహరమై మిక్కిలి యెఱ్ఱనై, మనోహరమైన లావణ్యామృతముతో నిండియున్న నీ పాదపద్మమునందు నిరంతరము ఆనందించు గాక !

**10. సువర్ణాభ దివ్యామ్బరై ర్భాసమానాం**
**క్వణ త్కింకిణీ మేఖలా శోభమానామ్**
**లసద్ధేమపట్టేన విద్యోతమానాం**
**కటిం భావయే స్కన్ద! తే దీప్యమానామ్.**

ఓ కుమారస్వామీ! బంగారము వంటి కాంతి గల దివ్య వస్త్రములతోను, శబ్దించుచున్న చిరు గంటలు గల మొలనూలుతోను, ప్రకాశించుచున్న బంగారపు పట్టెతోను ప్రకాశించుచున్న నీ యొక్క కటి ప్రదేశమును ధ్యానింతును.

**11. పులిన్దేశకన్యా ఘనాభోగతుంగ**
**స్తనాలింగనాసక్త కాశ్మీరరాగమ్**
**నమస్యా మ్యహం తారకాஉరే! తవోర**
**స్స్వభక్తావనే సర్వదా సానురాగమ్.**

తారకాసురుని సంహరించిన సుబ్రహ్మణ్య దేవా! పులింద కన్యయగు వల్లీదేవి యొక్క ఉన్నతములైన ఱొమ్ముల యాలింగనముచే లగ్నమైన కుంకుమచే నెఱ్ఱ నైనదియు, నిజ భక్తుల రక్షణమున నెల్లప్పుడు ఆసక్తి గల నీ వక్షస్థలమును నమస్కరింతును.

**12. విధౌ క్లుప్తదణ్డా న్స్వలీలా ధృతాణ్డా**
**న్నిరస్తేభశుండా న్ద్విషత్కాలదణ్డాన్**
**హతేన్ద్రారిషండా జ్జగత్త్రాణశౌండా**
**న్సదా తే ప్రచణ్డాన్ శ్రయే! బాహుదణ్డాన్**

ఓ స్వామీ! కర్తవ్యాచరణమున శిక్షితములును, అనాయాసముగ ధరింపబడిన బ్రహ్మాండములు గలవియు, గజ తుండముల నిరసించుచున్నవియు, విరోధులకు కాలదండముల వంటివియు, రాక్షస సముదాయముల పరిమార్చినవియు జగద్రక్షణ సమర్థములును భయంకరములును నగు నీ బాహుదండములను నాశ్రయింతును.

**13. సదా శారదా ష్షణ్మృగాంకా యది స్యుః**
**సముద్యన్త ఏవస్థితా శ్చేత్సమన్తాత్**
**సదా పూర్ణబిమ్బాః కలంకై శ్చ హీనా**
**స్తదా త్వన్ముఖానాం బ్రువే! స్కన్ద! సామ్యమ్.**

ఓ కుమారస్వామీ! చంద్రులు ఎల్లపుడును శరచ్చంద్రులు గను, ఆరు సంఖ్య గలవారుగను, ఉదయించు చున్నవారుగను, పూర్ణబింబో పేతులుగను, కళంక శూన్యులుగను నుందురేని అపుడు నీ ముఖములతో పోలికను చెప్పుదును.

**14. స్ఫురన్మన్దహాసై స్సహంసానిచంచ**
**త్కటాక్షావలీ భృఙ్గ సంఘోజ్జ్వలాని**
**సుధాస్యన్ది బిమ్బాధరాణీశ సూనో!**
**తవాలోకయే! షణ్ముఖాంభోరుహాణి.**

ఓ శివకుమారా! చిరు నవ్వుల నెడి హంసలతోను క్రీగంటి చూపుల నెడి తుమ్మెదలతోను ప్రకాశించుచున్నవియు, అమృతము స్రవించు దొండపండువంటి పెదవులతో నొప్పారు నీ యొక్క ఆరుముఖము ల నెడి పద్మములను దర్శింతును.

**15. విశాలేషు కర్ణాన్తదీర్ఘే ష్వజస్రం**
**దయా స్యన్దిషు ద్వాదశ స్వీక్షణేషు**
**మయీ షత్కటాక్ష స్సకృత్పాతిత శ్చే**
**ద్భవేత్తే దయాశీల! కానామ హానిః?.**

దయాశీలుడా! విశాలములును, కర్ణాంత పర్యంత దీర్ఘములును నగు నీ యొక్క పన్నెండు నేత్రములు దయను వర్షించుచుండగా, నీ మంద కటాక్షము నాపై నొక పర్యాయము ప్రసరింప జేసెదవేని నీకు హాని యేమి?.

**16. సుతాంగోద్భవో మేఽసి జీవేతి షడ్ధా
జప న్మన్త్ర మీశో ముదా జిఘ్రతే యాన్
జగద్భారభృద్భ్యో జగన్నాథ! తేభ్యః
కిరీటోజ్జ్వలేభ్యో నమో మస్తకేభ్యః.**

కుమారా! చిరంజీవ! అని ఆరు పర్యాయము లుచ్చరించి శివుడు ఆఘ్రాణించు ననియు, జగద్భారమును నిర్వహింప సమర్థములును, కిరీటములచే ప్రకాశించుచున్న నీ తలలకు ఓ జగన్నాథా! నమస్కారము.

**17. స్ఫురద్రత్న కేయూర హారాభిరామ
శ్చల త్కుణ్డల శ్రీలసద్గండ భాగః
కటౌ పీతవాసాః కరే చారుశక్తిః
పురస్తా న్మమాస్తాం! పురారే స్తనూజః.**

మణిమయ కేయూరములతోను, ముత్యాల హారములతోను మనోహరమైన వాడును, చలించుచున్న కుండల కాంతిచే ప్రకాశించు చెక్కిళ్ళు గలవాడును, నడుమున పీత వస్త్రము, హస్తమున మనోహరమగు శక్తియు గల శివనందనుడగు కుమారస్వామి నా ముందు ఉండుగాక!

**18. ఇహా యాహి! వత్సేతి హస్తా న్ప్రసార్యా
హ్వాయ త్యాదరా చ్ఛంకరే మాతు రంకాత్
సముత్పత్య తాతం శ్రయన్తం కుమారం
హరాశ్లిష్ట గాత్రం భజే బాలమూర్తిమ్.**

"బిడ్డా! ఇటు రమ్ము" అని చేతులను చాచి ఆదరముతో శంకరుడు పిలుచు చుండగా తల్లి యొడినుండి దూకి తండ్రి నాశ్రయించి వానిచే కౌగలించుకొనబడిన శరీరము గల బాలసుబ్రహ్మణ్యమూర్తిని సేవింతును.

**19. కుమారేశసూనో! గుహ! స్కన్ద! సేనా
పతే! శక్తిపాణే! మయూరాధిరూఢ!
పులిన్దాత్మజా కాన్త! భక్తార్తి హారిన్!
ప్రభో! తారకారే! సదా రక్ష! మాం త్వమ్.**

కుమారస్వామి ! ఈశపుత్రా! గుహా! స్కందా! దేవసేనాపతీ! శక్తి యను ఆయుధము హస్తమునందు గలవాడా! నెమలి నెక్కినవాడా! వల్లీనాథా! భక్తుల బాధలు తీర్చునట్టి ప్రభూ! తారకాసురుని సంహరించిన సుబ్రహ్మణ్యా! నన్నెల్లప్పుడు రక్షించుము!

**20. ప్రశాన్తేన్ద్రియే నష్టసంజ్ఞే విచేష్టే**
**కఫోద్గారివక్త్రే భయోత్కంపి గాత్రే**
**ప్రయాణోన్ముఖే మయ్యనాథే తదానీం**
**ద్రుతం మే దయాళో! భవాగ్రే గుహ! త్వమ్.**

ఇంద్రియములు చేష్టలుడిగి, స్పృహతప్పి, ముఖము కఫమును గ్రక్కుచుండ, శరీరము భయముచే కంపించుచుండ దిక్కులేక నేను ప్రాణ ప్రయాణమునకు సిద్ధుడనై యుండగా దయా స్వభావము గల కుమారస్వామీ! నీవు నా యెదుట నుందువు గాక!

**21. కృతా న్తస్య దూతేషు చణ్డేషు కోపా**
**ద్దహ! ఛ్ఛిన్ధి! భిన్ధీతి మాం తర్జయత్సు**
**మయూరం సమారుహ్య మాభై రితి త్వం**
**పురః శ్శక్తిపాణి ర్మమా యాహి! శీఘ్రమ్.**

భయంకరులైన యమదూతలు కోపముతో “కాల్చుము! భేదించుము” అని బెదరించుచుండగా శీఘ్రముగా నీవు నెమలి నెక్కి, శక్తిని చేతగొని నా యెదుటకు రమ్ము!

**22. ప్రణమ్యా సకృ త్పాదయోస్తే పతిత్వా**
**ప్రసాద్య ప్రభో! ప్రార్థయేఽనేక వారమ్**
**నవక్తుం క్షమోఽహం తదానీం కృపాబ్ధే!**
**నకార్యాన్తకాలే మనాగ ప్యుపేక్షా.**

కృపా సముద్రుడా! ప్రభో! అనేక పర్యాయములు నీ పాదములపై బడి నమస్కరించి బ్రతిమాలుకొని ప్రార్థించుచున్నాను. అప్పుడు నేను మాట్లాడజాలను. నా అవసాన కాలమునందు ఏ మాత్రమును ఉపేక్షింపకుము!

**23. సహస్రాణ్డభోక్తా త్వయా శూరనామా**
**హత స్తారక స్సింహ వక్త్రశ్చ దైత్యః**
**మమాన్త ర్హృదిస్థం మనఃక్లేశ మేకం**
**నహంసి ప్రభో! కింకరోమి క్వయామి.**

ఓ ప్రభో! నీచే అనేక బ్రహ్మాండముల కబళించిన శూరుడను పేరుగల తారకుడు, సింహ ముఖుడు అను రాక్షసులు చంపబడిరి. నా హృదయాన్తరాళమున నున్న మానసిక బాధ నొక్కదానిని నీవేల నశింపజేయవు? ఏమి చేయుదును ? ఎచటికి పోదును ?

**24. అహం సర్వదా దుఃఖ భారావసన్నో**
**భవాన్దీనబన్ధు స్త్వదన్యం నయాచే**
**భవద్భక్తిరోధం సదా క్లుప్తబాధం**
**మమాధిం ద్రుతం నాశయో మాసుత! త్వమ్.**

పార్వతీ నందనా! నే నెల్లప్పుడు దుఃఖ భారముచే క్రుంగితిని, నీవు దీనులకు చుట్టమువు. నీ కంటె నితరుని ప్రార్థించను. నీ భక్తికి ఆటంకమైనదియు, ఎల్లప్పుడు బాధలతో నిండినదియు నగు నా మానసిక వ్యధను నీవు నశింపజేయుము.

**25. అపస్మార కుష్ఠ క్షయార్శః ప్రమేహ**
**జ్వరోన్మాద గుల్మాది రోగా మహాన్తః**
**పిశాచాశ్చ సర్వే భవత్పత్రభూతిం**
**విలోక్య క్షణాత్తారకారే! ద్రవన్తే.**

తారకాసురవైరీ! స్మృతి తప్పుట, కుష్ఠు, క్షయ, మూలరోగము, ప్రమేహము, జ్వరము, చిత్తచాంచల్యము, గుల్మములు మొదలగు గొప్ప రోగములు, సమస్త పిశాచములు నీ దగు వాహనము యొక్క సత్తను చూచి క్షణకాలములో తొలగిపోవును.

**26. దృశి స్కన్దమూర్తి శ్శృతౌ స్కన్దకీర్తి**
**ర్ముఖే మే పవిత్రం సదా తచ్చరిత్రమ్**
**కరే తస్య కృతం వపుస్తస్య భృత్యం**
**గుహే సన్తు లీనా మమాశేషభావాః.**

నా దృష్టియందు కుమారస్వామి యాకృతియు, నా చెవియందు వాని కీర్తియు, నా ముఖమునందు ఎల్లప్పుడు పవిత్రమైన ఆ కుమారస్వామి చరితము, నా చేతి యందు వానికి సంబంధించిన కృత్యము, నా శరీరమున వాని దాస్యము ఈ విధముగ మదీయ సమస్త భావములు కుమారస్వామి యందు లీనము లగుగాక!

**27. మునీనా ముతాహో! నృణాం భక్తి భాజా**
**మభీష్టప్రదా! స్సన్తి సర్వత్ర దేవాః**
**నృణా మన్త్యజానా మపి స్వార్థదానే**
**గుహా ద్దేవ మన్యం నజానే నజానే.**

మునులకు గాని లేక భక్తిపరులగు నరులకు గాని వాంఛితముల నొసంగు దేవులంతట గలరు. కాని అంత్యవర్ణ సంజాతులగు మానవులకు గూడ నిజాభీష్టముల నొసంగుటయందు కుమారస్వామి కంటె వేరు దైవమును నే నెఱుంగను. నే నెఱుంగను.

**28. కలత్రం సుతా బన్ధువర్గః పశుర్వా**
**నరో వాஉథ నారీ గృహే యే మదీయాః**
**యజన్తో నమన్తః స్తువన్తో భవన్తం**
**స్మరన్తశ్చ తే సన్తు సర్వే కుమార!.**

ఓ కుమారస్వామీ! నా భార్య, బిడ్డలు, బంధువులు, పశువు గాని మా ఇంటియందున్న నా సంబంధమైనవారు మగవాడుగాని, ఆడదిగాని అందరు నిన్ను

పూజించువారుగను, నీకు నమస్కరించువారుగను, నిన్ను స్తుతించువారుగను, నిన్ను స్మరించు వారుగను నుందురుగాక!

**29. మృగాః పక్షిణో దంశకా యేచ దుష్టా**
**స్తథా వ్యాధయో బాధకా యే మదంగే**
**భవచ్ఛక్తి తీక్ష్ణా గ్రభిన్నా స్సుదూరే**
**వినశ్యన్తు తే చూర్ణిత క్రౌఞ్చశైల !.**

క్రౌంచ పర్వతమును చూర్ణము చేసిన కుమారస్వామీ! నా శరీరమును బాధించు మృగములు గాని, పక్షులు గాని, దుష్టములైన అడవి యీగలు గాని, వ్యాధులు గాని, నీదగు శక్తి యనెడి ఆయుధము యొక్క వాడియైన కొనచే భేదింపబడినవై మిక్కిలి దూరముగ నశించుగాక !

**30. జనిత్రీ పితా చ స్వపుత్రాపరాధం**
**సహేతే నకిం దేవసేనాధినాథ !**
**అహం చాతిబాలో భవాన్ లోకతాతః**
**క్షమస్వాపరాధం సమస్తం మహేశ!.**

దేవ సేనాపతీ! తల్లిగాని, తండ్రిగాని తన బిడ్డ యొక్క అపరాధమును క్షమింపరా? నేను మిక్కిలి బాలుడను. నీవు లోకపితవు. కావున మహాప్రభూ! నా సమస్తాపరాధమును క్షమింపుము!

**31. నమః కేకినే శక్తయే చాపి తుభ్యం**
**నమ శ్ఛాగ! తుభ్యం నమః కుక్కుటాయ**
**నమ స్సిన్ధవే సింధుదేశాయ తుభ్యం**
**పునః స్కన్దమూర్తే! నమస్తే నమోస్తు.**

కుమారస్వామీ! నీ వాహన మగు నెమిలికి, నీ యాయుధమగు శక్తికి, నీకు, నీ మేకపోతునకు, నీ ధ్వజమగు కోడికి నమస్కారము. నీవు వసించు సింధుదేశమునకు, సముద్రమునకున్ను నమస్కారము. తిరిగి నీకు నమస్కారము.

**32. జయానన్దభూమ ఞ్జయాపారధామ**
**ఞ్జయా మోఘకీర్తే! జయానందమూర్తే!**
**జయానన్దసిన్ధో! జయాశేషబన్ధో!**
**జయ త్వం! సదా ముక్తిదానేశసూనో!.**

ఆనందాతిశయము గలవాడా! గొప్ప తేజస్సు గలవాడా! గొప్ప యశస్సు గలవాడా! ఆనందరూపుడా! ఆనంద సముద్రుడా! ఎల్లవారికి బంధువైనవాడా! ఎల్లప్పుడు మోక్ష మొసంగు శివకుమారా! నీవు సర్వోత్కర్షచే నొప్పుదువు గాక!

**33.** **భుజంగాఖ్య వృత్తేన క్లుప్తం స్తవం యః**
**పఠేద్భక్తి యుక్తో గుహం సంప్రణమ్య**
**స పుత్రా న్కళత్రం ధనం దీర్ఘమాయు**
**ర్లభే త్స్కన్ద సాయుజ్యమన్తే నరస్సః.**

ఎవడు భక్తితో సుబ్రహ్మణ్యేశ్వరుని నమస్కరించి భుజంగ వృత్తముతో నున్న యీ స్తవమును పఠించునో ఆ మనుజుడు భార్యను, బిడ్డలను, ధనమును, దీర్ఘాయువును పొంది అంత్యకాలమున స్కంద సాయుజ్యము నొందు గాక!

***ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం సుబ్రహ్మణ్య భుజంగ స్తోత్రం సంపూర్ణమ్.***



## శివ భుజంగ ప్రయాత స్తోత్రమ్

**1.** **గళద్దాన గండం మిళ ద్భృంగషండం**
**చలచ్చారు శుండం జగత్త్రాణ శౌండమ్**
**కన ద్దంతకాండం విపద్భంగ చండం**
**శివ ప్రేమపిండం భజే వక్రతుండమ్.**

గండస్థలములనుండి స్రవించుచున్న మదజలముతో, ముసురుచున్న తుమ్మెదల గుంపుతో, కదలుచున్న చిన్ని తొండముతో, లోకరక్షణ సామర్థ్యముతో, మెఱయుచున్న ఏకదంతముతో, ఆపదలను తొలగించు శౌర్యముతో, దర్శనీయుడగు శివ ప్రేమ మూర్తి శ్రీ గణనాథుని భజించెదను.

**2.** **అనాద్యన్త మాద్యం పరం తత్త్వ మర్థం**
**చిదాకార మేకం తురీయం త్వమేయమ్**
**హరి బ్రహ్మ మృగ్యం పరబ్రహ్మ రూపం**
**మనోవాగతీతం మహః శైవ మీడే.**

హరి బ్రహ్మాదులచే నిరంతరము వెదకబడుచు, ఆద్యంతములు లేని, ఇంద్రియ గోచరము కాని, మనోవాక్కుల కందని, కేవల చిదాకార తురీయ పరబ్రహ్మ స్వరూపమగు ఆ శివ మహామహస్సును ప్రస్తుతించెదను.

**3.** **స్వశక్త్యాది శక్త్యన్త సింహాసనస్థం**
**మనోహారి సర్వాంగ రత్నోరు భూషమ్**
**జటాఽహీందు గంగాఽస్థి శమ్యాక మౌళిం**
**పరాశక్తి మిత్రం నమః పంచవక్త్రమ్.**

శివ శక్త్యాది దీప్తిశక్తి పర్యంత సర్వశక్తి పరివేషితమైన సింహాసనము నలంకరించి, మనోహరములైన సర్వాంగములయందు రత్న భూషణముల దాల్చి, జటలను, సర్పములను, చంద్రుని, గంగను, అస్థిమాలను, రేల పువ్వులను భూషణములుగా మౌళియం దలంకరించుకొని, ఐదు మోములతో పరాశక్తి సహాయుడై యున్న పరమేశ్వరు నుతించుచున్నాము.

**4. శివేశాన తత్పూరుషాఽఘోర వామా**
**దిభిః పంచభిర్హృన్ముఖైః షడ్భి రంగైః**
**అనౌపమ్య షట్త్రింశతం తత్త్వవిద్యా**
**మతీతం పరం త్వాం కథం వేత్తి కో వా?.**

ఓ పరమేశ్వరా ! శివ– ఈశాన – తత్పురుష – అఘోర – వామదేవ అనెడి పంచముఖములతోను, హృదయ – శిరః – శిఖా – కవచ – నేత్రత్రయ – అస్త్రముల నెడి షడంగములతోను నిరుపమానమగు ఇరువదియారవదగు పరమాత్మ తత్త్వమును గూడ నతిక్రమించిన నీ పరతత్త్వము నెవ రెఱుంగగలరు?.

**5. ప్రవాళ ప్రవాహ ప్రభా శోణ మర్ధం**
**మరుత్వ న్మణిశ్రీ మహః శ్యామ మర్ధమ్**
**గుణస్యూత మేత ద్వపుః శైవ మంతః**
**స్మరామి స్మరాపత్తి సంపత్తి హేతోః.**

దేవ దేవా! ప్రమాళ మణుల కాంతి ప్రవాహమువలె సగము ఎఱ్ఱగాను, ఇంద్ర నీలమణుల కాంతి ప్రవాహమువలె సగము నల్లగాను, గుణగుంఫితమైన నీ శైవదేహమును కామ నాశనమనే సంపద కొఱకు ధ్యానించెదను.

**6. స్వసేవా సమాయాత దేవాఽసురేంద్రా**
**నమ న్మౌళి మందారమాలాఽభిషిక్తమ్**
**నమస్యామి శంభో! పదాంభోరుహం తే**
**భవాంభోధి పోతం భవానీ విభావ్యమ్.**

పరమేశ్వరా! తమసేవ కొఱకు వచ్చిన సురాసుర ప్రభువులు నమస్కరించుటకై వంచిన శిరస్సుల మీద కల్పపుష్పమాలికలందలి మకరందముచే నభిషేకించబడుచు సంసార సాగరమును తరింపచేయ నావ యనదగి, భవానిచే ధ్యానించబడు నీ పాదాంబుజమును నమస్కరించెదను.

**7. జగన్నాథ! మన్నాథ! గౌరీసనాథ!**
**ప్రసన్నానుకంపిన్ ! విపన్నార్తిహారిన్!**
**మహః స్తోమమూర్తే! సమస్తైకబంధో!**
**నమస్తే నమస్తే పునస్తే నమోఽస్తు.**

జగన్నాథ! మన్నాథ! గౌరీసనాథ! ప్రపన్నులను కనికరించు స్వామీ! ఆపన్నుల ఆర్తిని పోద్రోలు పరమబంధూ! తేజోమయమూర్తీ! నీకు నమశ్శతముల నర్పించుచున్నాను.

**8. విరూపాక్ష! విశ్వేశ! విశ్వాది దేవ!**
**త్రయీమూల ! శంభో! శివ! త్ర్యంబక! త్వమ్**
**ప్రసీద స్మర త్రాహి పశ్యావముక్త్యై**
**క్షమాం ప్రాప్నుహి త్ర్యక్ష ! మాం రక్ష మోదాత్.**

ఓ విరూపాక్షా! విశ్వేశ! విశ్వమున కాదిదేవా! వేదములకు మొదలయిన దేవా ! శంభూ! త్ర్యంబక! ప్రసన్నుడవగుము. ఒక్కసారి నన్ను రక్షింపదలంపుము. ముక్తి నిచ్చు కటాక్షమున చూడుము. నా తప్పులను క్షమింపుము. వాత్సల్యముతో రక్షింపుము.

**9. మహాదేవ! దేవేశ! దేవాది దేవ!**
**స్మరారే! పురారే! యమారే! హరేతి**
**బ్రువాణః స్మరిష్యామి భక్త్యా భవంతం**
**తతో మే దయాశీల! దేవ! ప్రసీద.**

ఓ మహాదేవ! దేవేశ! దేవాదిదేవా! కామారే! పురారే! కాలాంతకా! హరా! అని పలుకుచు భక్తితో నిన్ను స్మరింపగలను. ఓ దయాస్వభావా! నన్ను అనుగ్రహింపుము.

**10. త్వదన్యః శరణ్యః ప్రపన్నస్య నేతి**
**ప్రసీద స్మర న్నేవ హన్యాం స్తు దైన్యమ్**
**న చేత్తే భవే ద్భక్త వాత్సల్యహాని**
**స్తతో మే దయాళో! సదా సన్నిధేహి.**

భక్తులకు నీ కన్న శరణ్యుడు లేడు. ప్రసన్నుడవుకమ్ము. నిన్ను స్మరించుచు నా దైన్యము పోద్రోలుదుము. నీకు భక్తవాత్సల్యమున్నచో సన్నిధిని దయచేయుము.

**11. అయం దానకాల స్త్వహం దానపాత్రం**
**భవా నేవ దాతా త్వదన్యం న యాచే**
**భవద్భక్తి మేవ స్థిరాం దేహి మహ్యం**
**కృపాశీల! శంభో! కృతార్థోఽస్మి తస్మాత్**

ఓ కృపాశీల శంభో! ఇది దాన మిచ్చుటకు మంచికాలము. నేను మంచి దానపాత్రుడను, నీవు గొప్పదాతవు. నిన్ను తప్పనెవ్వరిని యాచింపను, స్థిరమైన భక్తినే నాకిమ్ము, దానివలన నేను కృతార్థుడనగుదును.

**12. పశుం వేత్సి చేన్మాం తమే వాధిరూఢః**
**కలంకీతి వా మూర్ధ్ని ధత్సే తమేవ**
**ద్విజిహ్వః పునః సోఽపి తే కంఠభూషా**
**త్వదంగీకృతాః శర్వ! సర్వేఽపి ధన్యాః.**

నన్ను పశువని తలంచెదవేని నీ వాహనము పశువేగదా, నేను కలంకినని తలచెదవేమో! నీ శిరమున భూషణముగా కలంకముగల వానినే (చంద్రుని) ధరించితివిగదా! ద్విజిహ్వుడనని (అబద్ధములాడువాడనని) తలంచితివేని నీ కంఠా భరణముగా ద్విజిహ్వుని (సర్పమును) దాల్చితివి గదా! నీ వంగీకరింపవలెనేగాని ఎవ్వరైనా అందఱూ ధన్యులే యగుదురు.

**13. న శక్నోమి కర్తుం పరద్రోహ లేశం**
**కథం ప్రీయసే త్వం న జానే గిరీశ!**
**తథాహి ప్రసన్నోఽసి కస్యాపి కాన్తా**
**సుతద్రోహిణో వా పితృద్రోహిణో వా.**

నేను లేశమైనా పరద్రోహము చేయలేనివాడను గనుక నా కెట్లు నీవు ప్రసన్నుడవగుదువు? భార్యాపుత్రులకు ద్రోహము చేసిన (వదలిన) వానికిగాని - పితృద్రోహము చేసిన (వదలి పెట్టిన) వానికిగాని ప్రసన్నుడవగుదువు.

**14. స్తుతిం ధ్యాన మర్చాం యథావ ద్విధాతుం**
**భజన్న వ్యజానన్ మహేశావలంబే**
**త్రసంతం సుతం త్రాతు మగ్రే మృకండో**
**ర్యమప్రాణ నిర్వాపణ త్వత్పదాబ్జమ్**

ఓ మహేశా! నీ స్తుతినిగాని, ధ్యానమునుగాని, పూజనుగాని, యథావిధిగా చేయుటకై యత్నించుచున్నను తెలియనివాడవయ్య. కనుక స్వామి! మృత్యుభయమున వణకుచున్న మార్కండేయుని రక్షించుటకై యమ ప్రాణములను బలిగొన్న నీ పాదపద్మమునే నమస్కరించెదను.

**15. శిరో దృష్టి హృద్రోగ శూల ప్రమేహ**
**జ్వరార్శో జరా యక్ష్మ హిక్కా విషార్తాన్**
**త్వ మాద్యో భిష గ్భేషజం భస్మ శంభో!**
**త్వ ముల్లాఘ యాస్మా న్వపుర్లాఘవాయ**

శిరోదృష్టి, హృద్రోగములు, ప్రమేహజ్వరార్శోవ్యాధులు, జరా రాజయక్ష్మ హిక్కా విషములు మొదలైన రోగబాధలకు నీ వాదివైద్యుడవు, నీ మందు భస్మము మమ్ములను దేహలాఘవ (ఆరోగ్యము) కొఱకు రోగహితులను చేయుము.

**16. దరిద్రోఽ స్మ్యభ ద్రోఽ స్మి భగ్నోఽ స్మి దూయే**
**విషణ్ణోఽ స్మి సన్నోఽ స్మి ఖిన్నోఽ స్మి చాహం**
**భవా న్ప్రాణినా మన్తరాత్మాఽ సి శంభో**
**మమాధిం న వేత్సి ప్రభో! రక్ష మాం త్వమ్.**

దరిద్రుడను, అభద్రుడను, భగ్నుడను, విషణ్ణుడను, సన్నుడను, ఖిన్నుడనై విచారించుచున్నాను. నీవు ప్రాణులకెల్ల అంతరాత్మవుగదా! నా మనసులోనున్న విచారములను పోద్రోలి రక్షింపుము.

**17. తద్వీక్షోః కటాక్షః పతే త్ర్యక్ష! యత్ర**
**క్షణం క్ష్మాచ లక్ష్మీః స్వయం తం వృణా తే**
**కిరీటస్ఫుర చ్చామర చ్ఛత్రమాలా**
**కలాచీ గజ క్షౌమ భూషా విశేషైః**

ఓ శివా! త్ర్యంబకా! నీ నేత్ర కటాక్ష మెవని పై క్షణకాల మనుగ్రహించునో వానిని లక్ష్మియు, భూదేవియు స్వయముగా వరించి కిరీట ఛ్చత్ర చామర మాలా కలాచీ గజ క్షౌమ భూషా విశేషములతో అనుగ్రహించెదరు.

**18. భవాన్యై భవాయాపి మాత్రే చ పిత్రే**
**మృడాన్యై మృడాయా ప్యఘఘ్న్యై మఖఘ్నే**
**శివాంగ్యై శివాంగాయ కుర్మః శివాయై**
**శివా యాంబికాయై నమ స్త్ర్యంబకాయ.**

జగన్మాతా పితలగు భవానీ భవులకు, అఘఘ్నీ మఖఘ్నులగు మృడానీ మృడులకు, శివాంగీ శివాంగులగు శివులకు, అంబికా త్ర్యంబకులకు నమస్కారములు.

**19. భవ ద్గౌరవం మల్లఘుత్వం విదిత్వా**
**ప్రభో! రక్ష కారుణ్యదృష్ట్యానుగం మామ్**
**శివాత్మానుభావస్తుతా వక్ష మోఽ హం**
**స్వశక్త్యా కృతం మేఽ పరాధం క్షమస్వ.**

ప్రభూ! నీ గౌరవము, నా లఘుత్వము నెఱిగి నిన్ననుసరించు నన్ను దయా దృష్టితో రక్షింపుము. శివ స్వరూపానుభవమును స్తుతించుటయందు సమర్థుడను కాను. మిక్కిలి ఆశక్తి వలన చేసిన యీ యపరాధమును క్షమింపుము.

**20. యదా కర్ణ రన్ధ్రం వ్రజే త్కాలవాహ**
**ద్విష త్కంఠ ఘంటా ఘణాత్కారనాదః**
**వృషాధీశ మారుహ్య దేవౌపవాహ్యం**
**తదా వత్స! మాభీ రితి ప్రీణయ త్వమ్.**

ఏ క్షణమున యమ మహిష గళ ఘంటా ఘణఘణాత్కార నాదము నా కర్ణ రంధ్రమున బడునో, ఆ క్షణముననే నీవు నందివాహనా రూఢుడవై వచ్చి వత్సా! భయపడకుము, అని ఆనంద పరుపగోరుచున్నాను.

**21. యదా దారుణా భాషణా భీషణా మే**
**భవిష్య న్త్యుపాంతే కృతాంతస్య దూతాః**
**తదా మన్మన స్త్వ త్పదాంభోరుహస్థం**
**కథం నిశ్చలం స్యాన్న మస్తేఽస్తు శంభో!**

శంభూ! దారుణ భాషణములతో భయపెట్టుచు యమదూతలు ఎప్పుడు నన్ను చుట్టుముట్టెదరో అప్పుడు నా మనోభృంగము నీ పాద పద్మ మధ్యమున చేరి యెట్లు నిలుచునాయని నమస్కరించుచున్నాను.

**22. యదా దుర్ని వారవ్యథోఽహం శయానో**
**లుఠ న్నిశ్వ సన్నిః సృతావ్యక్తవాణిః**
**తదా జహ్ను కన్యా జలాలంకృతం తే**
**జటామండలం మన్మనోమందిరే స్యాత్.**

శివా! ఎప్పుడు నివారింపరాని బాధతో పొరలుచు నిశ్వసించుచు పొరబాటుమాట లాడుచుండునో అప్పుడు గంగా ప్రవాహాలంకృతమైన నీ జటామండలము నామనోమందిరమున నిలుచుగాక !

**23. యదా పుత్రమిత్రాదయో మత్సకాశే**
**రుద న్త్యస్య హా కీదృశీయం దశేతి**
**తదా దేవ దేవేశ! గౌరీశ ! శంభో !**
**నమస్తే శివాయే త్యజస్రం బ్రవాణి.**

ఏ సమయమున నా పుత్ర మిత్రాదులు నా సమీపమున నుండి ఇతనికిట్టి యవస్థ వచ్చెనే యని ఏడ్చుచుందురో అప్పుడు నా వాక్కు ఓ దేవదేవేశ! గౌరీశ! శంభో! శివా! నీకు నమస్కారము అని ఎడము లేకుండా బలుకుగాక !

**24. యదా పశ్యతాం మా మసౌ వేత్తి నాస్మా**
**నయం శ్వాస ఏవేతి వాచో భవేయుః**
**తదా భూతిభూషం భుజంగావనద్ధం**
**పురారే! భవంతం స్ఫుటం భావయేయమ్.**

ఓ త్రిపురాంతకా! ఏ సమయమున మరణావస్థలోనున్న నన్ను చూచువారు "నన్ను గుర్తించినాడు" – "మమ్ములను గుర్తింపలేదు" అని చెప్పుకొనుచుందురో ఆ

సమయమున విభూతిభూషణుని, భుజంగావతంసుని నిన్ను స్పష్టముగా భావమున దర్శింప ననుగ్రహింపుము.

**25. యదా యాతనాదేహ సందేహవాహీ**
**భవే దాత్మ దేహేన మోహో మహా న్మే**
**తదాకాశ శీతాంశు సంకాశ మీశ !**
**స్మరారే ! వపు స్తే నమస్తే స్మరామి.**

ఓ కామాంతకా! ఏ సమయమున నా ఆత్మ దేహమున యాతనాదేహ మనెడి సందేహమును కలిగించు మహామోహము కలుగకుండునో అప్పు డాకాశమున వెలుగుచున్న పూర్ణ చంద్రునివంటి నీ శరీరమును స్మరించి నమస్కరించెదను.

**26. యదాపార మచ్ఛాయ మస్థాన మద్భి**
**ర్జనై ర్వా విహీనం గమిష్యామి మార్గమ్**
**తదా తం నిరున్ధన్ కృతాంతస్య మార్గం**
**మహాదేవ! మహ్యం మనోజ్ఞం ప్రయచ్ఛ.**

ఓ మహాదేవ! ఏ కాలమున నిలువనీడ లేక, జలమైన లేక, తోడు లేక, అంతులేని ఆ యమలోక మార్గమున నడవవలసివచ్చునో ఆ సమయమున నీ వా మార్గము నడ్డగించి నీ మనోహరమైన మార్గము ననుగ్రహింపుము.

**27. యదా రౌరవాది స్మర న్నేవ భీత్యా**
**వ్రజా మ్యత్ర మోహం మహాదేవ! ఘోరమ్**
**తదా మా మహో! నాథ! కస్త్తారయిష్య**
**త్యనాథం పరాధీన మర్ధేందు మౌళే !.**

ఓ బాలచంద్రమౌళీ! ఏ సమయమున రౌరవాది మహానరకములను స్మరించుచు భయమునొంది మూర్ఛనొందెదనో అట్టి సమయమున అనాథుడనైన నన్ను నీకన్న రక్షించువా రెవరు గలరు ?

**28. యదా శ్వేతప్రతాయ తాఽలంఘ్యశక్తేః**
**కృతాన్తా ద్భయం భక్తి వాత్సల్యభావాత్**
**తదా పాహి మాం పార్వతీవల్లభాఽన్యం**
**న పశ్యామి పాతార మేతాదృశం మే.**

ఓ ధవళాంగ! అలంఘ్య శక్తియగు యమధర్మరాజు వలని భయము నా కెప్పుడు కలుగునో అపుడు వాత్సల్యముతో వచ్చి నన్ను రక్షింపుము. ఓ పార్వతీ వల్లభా! నీవంటి రక్షకుల నెవ్వరిని చూడలేదు.

**29.** **ఇదానీ మిదానీం మృతి ర్మే భవిత్రీ**
**త్యహో! సంతతం చిన్తయా పీడితోఽస్మి**
**కథం నామ మాభూ న్మృతౌ భీతి రేషా**
**నమస్తే గతీనాం గతే! నీలకంఠ!.**

ఓ శరణశరణ్య! నీలకంఠ! ఇప్పుడో ఇంకొకింతకో మృతి వచ్చు ననెడి చింతలో నెల్లప్పుడు బాధపడుచున్నాను. ఈ మరణ భయము నాకెట్లు పోద్రోలెదవోగదా! నీకు నమస్కారము.

**30.** **అమర్యాద మేవాహ మాబాలవృద్ధం**
**హరన్తం కృతాన్తం సమీక్ష్యాస్మి భీతః**
**మృతౌ తావకాంఘ్ర్యబ్జ దివ్య ప్రసాదా**
**ద్భవానీపతే ! నిర్భయోఽహం భవాని.**

ఓ భవానీనాథ! యముడు అమర్యాదముగా ఆ బాలవృద్ధముగా ప్రాణులను కొనిపోవుట చూచి భయపడుచున్నాను. మృతికాలమున నీ పాదపద్మమువలన నేను నిర్భయుడ నగుదునుగాక!

**31.** **జరా జన్మ గర్భాదివాసాది దుఃఖా**
**న్యసహ్యాని జహ్యాం జగన్నాథ! దేవ!**
**భవన్తం వినా మే గతి ర్నైవ శంభో!**
**దయాళో! న జాగర్తి కింవా దయా తే ?.**

దేవా! అసహ్యములైన జర, జన్మము, గర్భవాసము మొదలైన దుఃఖములను విడిపింపుము. ఓ దయాళూ! నీకన్న నాకు గతి లేదు. నీ దయ నిద్రపోవుచున్నదా ?

**32.** **శివాయేతి శబ్దో నమః పూర్వ ఏష**
**స్మరన్ ముక్తి కృన్మృత్యుహా తత్త్వవాచీ**
**మహేశాన! మాగా న్మనస్తో వచస్తః**
**సదా మహ్య మేత త్ప్రదానం ప్రయచ్ఛ.**

ఓ మహేశ్వరా! స్మరించువారికి మృత్యువును పోగొట్టుచు తత్త్వమును తెలుపునట్టి "నమశ్శివాయ" అను శబ్దము నా మనోవాక్కుల నుండి తొలగి పోకుండునట్లు వర ప్రదానము చేయుము.

**33.** **త్వమ ప్యంబ! మాం పశ్య శీతాంశుమౌళి**
**ప్రియే! భేషజం త్వం భవవ్యాధిశాంతౌ**
**బహుక్లేశభాజం పదాంభోజపోతే !**
**భవాబ్ధౌ నిమగ్నం నయ స్వాద్య పారమ్.**

చంద్రమౌళి ప్రియా! అంబా! సంసారరోగశాంతికి ఔషధము నీవు. ఈ భవసాగరమున మునిగి క్లేశపడుచున్న నన్ను నీ పాదపద్మమనే పడవలో చేర్చుకొనుము.

**34. అనుద్య ల్లలాటాక్షి వహ్ని ప్రరోహై**
**రవామ స్ఫురచ్చారు వామోరు శోభైః**
**అనంగ భ్రమ ద్భోగి భూషా విశేషై**
**రచన్ద్రార్ధచూడై రలం దైవతైర్నః.**

లలాట నేత్రమున అగ్ని శిఖలులేని, వామ భాగమున వామాక్షి శోభలేని, శరీరమున సర్పభూషణములేని, జటామండలమున బాలచంద్రుని దాల్చని ఇతర దైవతములతో నాకేమి పనియున్నది ?

**35. అకంఠేకలంకా దనంగే భుజంగా**
**దపాణౌ కపాలా దఫాలేఽన లాక్షాత్**
**అమౌళౌ శశాంకా దవామే కళత్రా**
**దహం దేవ మన్యం న మన్యే న మన్యే.**

కలంకము కంఠమున లేని, సర్పములు శరీరమున లేని, కపాలము చేతిలో లేని, అనలాక్షము ఫాలమున లేని, చంద్రుడు మౌళిపై లేని, కళత్రము వామ భాగమున లేని, అన్య దేవతలను నేను తలపనే తలపను.

**36. మహాదేవ! శంభో! గిరీశ! త్రిశూలిన్!**
**త్వయీదం సమస్తం విభా తీతి యస్మాత్**
**శివా దన్యథా దైవతం నాభిజానే**
**శివోఽహం శివోహఽం శివోఽహం శివోఽహమ్.**

ఓ మహాదేవ! శంభూ! గిరీశా! త్రిశూలీ! నీయం దీ సమస్తము విభాసిల్లు చుండుటవలన నీకన్న వేరుగా దైవతమును గుర్తింపలేను. శివోఽహం, శివోఽహం, శివోఽహం, శివోఽహం, (నేను శివుడనే).

**37. యతోఽజాయ తేదం ప్రపంచం విచిత్రం**
**స్థితిం యాతి యస్మిన్ యదేకాన్త మన్తే**
**న కర్మాదిహీనః స్వయంజ్యోతి రాత్మా**
**శివోఽహం, శివోఽహం, శివోఽహం, శివోఽహమ్.**

ఎవ్వనివలన ఈ విచిత్రమైన ప్రపంచము పుట్టినదో, ఎవనిచేత నిది నిలిచి యున్నదో, ఎవనియందు లయించుచున్నదో, అట్టి కర్మాదులులేని స్వయం జ్యోతి రాత్మయగు శివుడే నేను – శివుడే నేను.

**38.** **కిరీటే నిశేశో లలాటే హుతాశో**
**భుజే భోగిరాజో గళే కాలిమా చ**
**తనౌ కామినీ యస్య తత్తుల్య దేవం**
**న జానే న జానే న జానే న జానే.**

కిరీటమున నిశేశుడు, లలాటమున హుతాశుడు, భుజమున భోగిరాజు, గళమున కాలిను, శరీరమున ఉమ కలిగిన నీతో సమానుడగు దేవుని నే నెఱుంగ నెఱుంగ నెఱుంగ నెఱుంగను.

**39.** **అనేన స్తవే నాదరా దంబికేశం**
**పరాం భక్తి మాసాద్య తం యే నమన్తి**
**మృతౌ నిర్భయా స్తే జనాస్తం భజన్తే**
**హృదంభోజమధ్యే సదాసీన మీశమ్.**

ఏ పుణ్యాత్ములు హృదయమున పరమ భక్తిని సంపాదించుకొని అంబికాపతి నీ స్తవముచే ఆదరమున స్తుతించి నమస్కరించెదరో వారు మరణకాలమున హృదయపద్మ మధ్యమున సదాసీనుడై యున్న ఈశ్వరుని నిర్భయులై భజించుచుందురు.

**40.** **భుజంగ ప్రియాకల్ప! శంభో ! మయైవం**
**భుజంగ ప్రయాతేన వృత్తేన క్లుప్తమ్**
**నరః స్తోత్రమేతత్ పఠిత్వోరు భక్త్యా**
**సుపుత్రాయురారోగ్యమైశ్వర్యమేతి**

భుజంగ భూషణములపై మోజ (ప్రేమ) గల శంభూ! నీ స్తోత్రమును భుజంగ ప్రయాత వృత్తములతో క్లుప్త పరచితిని. ఈ స్తుతి నెవరు భక్తితో పఠించెదరో వారికి సుపుత్రాయురారోగ్యములను ఐశ్వర్యమును అనుగ్రహింపుము.

***ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం శివభుజంగ ప్రయాత స్తోత్రం సంపూర్ణమ్.***

## ద్వాదశలింగ స్తోత్రమ్

**1.** **సౌరాష్ట్ర దేశే వసుధావకాశే**
**జ్యోతిర్మయం చంద్రకళావతంసమ్**
**భక్తి ప్రదానాయ కృతావతారం**
**తం సోమనాథం శరణం ప్రపద్యే.**

భూతలమునందలి సౌరాష్ట్ర దేశమునందు జ్యోతి స్వరూపుడై చంద్రరేఖ శిరో భూషణముగా గలిగి భక్తి ప్రబోధము కొరకై అవతరించిన శ్రీ సోమనాథస్వామిని శరణు పొందుదును.

**2. శ్రీశైల శృంగే వివిధ ప్రసంగే**
**శేషాద్రిశృంగేఽపి సదా వసంతమ్**
**త మర్జునం మల్లికపూర్వమేనం**
**నమామి సంసార సముద్రసేతుమ్.**

శ్రీ శేషగిరి శిఖర భూతమగు శ్రీశైల శృంగమునందు నిరంతరము నివసించుచు, సంసారమనెడి సముద్రమును దాటుటకు వారధివంటివాడగు శ్రీ మల్లికార్జున స్వామికి నమస్కరింతును.

**3. అవంతికాయాం విహితావతారం**
**ముక్తి ప్రదానాయ చ సజ్జనానామ్**
**అకాలమృత్యోః పరిరక్షణార్థం**
**వందే మహాకాళ మహం సురేశమ్.**

సజ్జనులకు ముక్తి నొసంగుటకును, అకాలమృత్యువు నుండి రక్షించుటకును అవంతికా క్షేత్రమందు అవతరించిన దేవోత్తముడగు మహా కాళేశ్వరస్వామికి నమస్కరించెదను.

**4. కావేరికా నర్మదయోః పవిత్రే**
**సమాగమే సజ్జనతారణాయ**
**సదైవ మాంధాతృపురే వసంత**
**మోంకార మీశం శివ మేక మీడే.**

సజ్జనుల తరింపజేయుటకై పవిత్రమైన కావేరి నర్మదా నదుల సంగమస్థానమగు మాంధాతృపురమున నెల్లపుడు సన్నిహితుడగు ఓంకారేశ్వరుడగు పరమశివుని స్తోత్రము చేయుదును.

**5. పూర్వోత్తరే పారలికాభిధానే**
**సదాశివం తం గిరిజాసమేతమ్**
**సురా సురారాధిత పాదపద్మం**
**శ్రీవైద్యనాథం సతతం నమామి.**

ఈశాన్యదిశయందు పారలికా క్షేత్రమునందు దేవాసురులచే నారాధింప బడిన పద్మములవంటి పాదములు గలిగి పార్వతీ సంయుతుడై శ్రీ వైద్యనాథుడును పేరుతో నొప్పారు సదాశివుని నిరంతరము నమస్కరింతును.

**6. ఆమర్ద సంజ్ఞే నగరే చ రమ్యే**
**విభూషితాంగం వివిధైశ్చ భోగైః**
**సద్భుక్తి ముక్తి ప్రద మీశ మేకం**
**శ్రీనాగనాథం శరణం ప్రపద్యే.**

మనోహరమగు ఆమర్ద నగరమునందు నలంకరింపబడిన శరీరము కలిగి నానావిధ భోగములతో నొప్పారుచు భుక్తిని ముక్తిని అనుగ్రహించు శ్రీనాథుని శరణు పొందుదును.

**7. సానంద మానందవనే వసంత**
**మానందకందం హతపాపబృందమ్**
**వారాణసీనాథ మనాథనాథం**
**శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే.**

ఆనందమగు వారాణసియందు ఆనందముతో సన్నిహితుడైన వాడును, పాపరాశిని నశింపజేయువాడును, ఆనందహేతుభూతుడును, గతిలేనివారికి దిక్కైనవాడును కాశీనాథుడు నగు శ్రీవిశ్వనాథుని శరణు పొందుదును.

**8. యో డాకినీ శాకినికా సమాజే**
**నిషేవ్యమాణః పిశితాశనైశ్చ**
**సదైవ భీమాది పద ప్రసిద్ధం**
**తం శంకరం భక్తహితం నమామి.**

డాకినీ శాకినీ సమాజమున రాక్షసులచే సేవింపబడుచు భీమాది పదములచే ప్రసిద్ధుడై భక్తులకు హితకరుడగు శ్రీ శంకరుని నమస్కరింతును.

**9. శ్రీతామ్రపర్ణీ జలరాశి యోగే**
**నిబధ్య సేతుం నిశి బిల్వపత్రైః**
**శ్రీరామచంద్రేణ సమర్చితం తం**
**రామేశ్వరాఖ్యం సతతం నమామి.**

తామ్రపర్ణీనదీ సముద్ర సంగమ స్థలమునందు సేతువును బంధించి, రాత్రి యందు మారేడు దళములచే శ్రీ రామచంద్రుడు పూజించిన రామేశ్వరస్వామిని నిరంతరము నమస్కరింతును.

**10. సింహాద్రి పార్శ్వేఽపి తటే రమన్తం**
**గోదావరీతీర పవిత్రదేశే**
**యద్దర్శనా త్పాతకజాతనాశః**
**ప్రజాయతే త్ర్యంబక మీశ మీడే.**

సింహాద్రి ప్రాంతమున గోదావరినదియొక్క పవిత్ర ప్రదేశమునందు క్రీడించుచున్న వాడును, దర్శన మాత్రముచేతనే పాతక సముదాయమును నశింపజేయువాడు నగు త్ర్యంబక స్వామిని స్తుతింతును.

**11. హిమాద్రి పార్శ్వేఽపి తటే రమన్తం**
**సంపూజ్యమానం సతతం మునీంద్రైః**
**సురాసురై ర్యక్ష మహోరగాద్యైః**
**కేదారసంజ్ఞం శివ మీశ మీడే**

హిమగిరి ప్రాంతమున క్రీడించుచున్న వాడును, మునీశ్వరుల చేతను, దేవాసురుల చేతను, యక్షుల చేతను, నాగుల చేతను నెల్లపుడు పూజింపబడుచుండెడివాడు నగు కేదారేశ్వర స్వామిని స్తుతించుదును.

**12. ఏలాపురీ రమ్యశిలాలయేఽస్మి**
**న్సముల్ల సంతం త్రిజగద్వ రేణ్యమ్**
**వన్దే మహోదార తర స్వభావం**
**సదాశివం తం ధిషణేశ్వరాఖ్యమ్.**

ఏలాపురమునందలి మనోహరమైన శివాలయమునందు విరాజిల్లుచున్న వాడును, ముల్లోకములందును శ్రేష్ఠుడును, మిక్కిలి ఉదార భావము గల ధిషణేశ్వర స్వామికి ఎల్లపుడు నమస్కరింతును.

**13. ఏతాని లిఙ్గాని సదైవ మర్త్యాః**
**ప్రతః పఠంతోఽమలమానసాశ్చ**
**తే పుత్ర పౌత్రైశ్చ ధనై రుదారైః**
**సత్కీర్తి భాజ స్సుఖినో భవన్తి.**

ఈ ద్వాదశ శివలింగములను నిరంతరము ప్రాతఃకాలమున స్మరించు మానవులు పరిశుద్ధమైన మనస్సుగలవారై, మంచి కీర్తిగలవారై పుత్ర పౌత్రులతోను, గొప్ప ధనములతోను సుఖము ననుభవింతురు.

*ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం ద్వాదశలింగ స్తోత్రం సంపూర్ణమ్.*

## కాలభైరవాష్టకమ్

**1. దేవరాజ సేవ్యమాన పావనాంఘ్రి పంకజం**
**వ్యాలయజ్ఞ సూత్ర మిందు శేఖరం కృపాకరమ్**
**నారదాది యోగిబృంద వందితం దిగంబరం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

దేవేంద్రునిచే సేవింపబడుచున్న పవిత్రమగు పాదపద్మములు గలవాడును, నాగయజ్ఞోపవీతముగలవాడును, చంద్రుడు శిరస్సునందుగలవాడును, దయానిధియు, నారదుడు మున్నగు యోగి సముదాయముచే నమస్కరింపబడుచున్న దిగంబరుడగు వారాణసీపుర ప్రభువగు కాలభైరవుని సేవింతును.

**2. భానుకోటి భాస్వరం భవాబ్ధి తారకం పరం**
**నీలకంఠ మీప్సితార్థ దాయకం త్రిలోచనమ్**
**కాలకాల మంబుజాక్ష మక్షశూల మక్షరం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

కోటి సూర్యప్రకాశుడును, సంసార సముద్రమునుండి తరింపజేయువాడును, గరళమును కంఠమునందు ధరించినవాడును, అభీష్టముల నొసంగెడువాడును, మూడు నేత్రములు గలవాడును, మృత్యువును జయించినవాడును, పద్మములవంటి నేత్రములు గలవాడును, జపమాలను-త్రిశూలమును ధరించువాడును, నాశరహితుడును, కాశీ పురాధీశ్వరుడును నగు కాలభైరవుని సేవింతును.

**3. శూల టంక పాశ దండ పాణి మాదికారణం**
**శ్యామకాయ మాదిదేవ మక్షరం నిరామయమ్**
**భీమవిక్రమం ప్రభుం విచిత్ర తాండవ ప్రియం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

శూలము, టంకము, పాశము, దండము అను ఆయుధములను హస్తముల ధరించుచున్నవాడును, జగత్తునకు మూలకారణమైనవాడును, నల్లని శరీరము కల వాడును, ఆది దేవుడును, నాశరహితుడును, ఉపద్రవ శూన్యుడును, భయంకరమైన పరాక్రమము గలవాడును, సమర్థుడును, విచిత్రమగు తాండవమునందు ప్రీతిగల వాడును, కాశీపురాధీశ్వరుడును నగు కాలభైరవుని సేవించెదను.

**4. భుక్తి ముక్తి దాయకం ప్రశస్త చారువిగ్రహం**
**భక్త వత్సలం స్థిరం సమస్తలోక నిగ్రహమ్**
**నిక్వణ న్మనోజ్ఞ హేమ కింకిణీ లసత్కరం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

భుక్తిని ముక్తిని నొసంగువాడును, శ్రేష్ఠమును, మనోహరమును నగు శరీరము గలవాడును, భక్తులయందు వాత్సల్యముగలవాడును, చలింపని వాడును, సమస్త జగద్రూపుడును, ధ్వనించుచున్న మనోహరములగు బంగారు చిరుగంటలచే ప్రకాశించు కటి ప్రదేశముగలవాడును, కాశీపురాధీశ్వరుడును నగు కాలభైరవుని సేవింతును.

**5. ధర్మసేతు పాలకం త్వధర్మమార్గ నాశకం**
**కర్మపాశమోచకం సుశర్మదాయకం విభుమ్**
**స్వర్ణవర్ణ కేశపాశ శోభితాంగ నిర్మలం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

ధర్మసేతువును పాలించువాడును, అధర్మమార్గమును నశింపజేయువాడును, పాశములవలె బంధించు కర్మపాశములను విడిపించువాడును, సుఖదాయకుడును, సర్వవ్యాపకుడును, బంగారపు రంగుగల కేశపాశముచే ప్రకాశించు శరీరముచే నిర్మలమైన కాశీపురాధీశ్వరుడగు కాలభైరవుని సేవింతును.

**6. రత్న పాదుకా ప్రభాభిరామ పాదయుగ్మకం**
**నిత్య మద్వితీయ మిష్టదైవతం నిరంజనమ్**
**మృత్యుదర్పనాశనం కరాళదంష్ట్ర భూషణం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

రత్న ఖచితమైన పాదుకల కాంతిచే మనోహరమగు పాద ద్వంద్వముగల వాడును, శాశ్వతుఁడును, సాటిలేనివాడును, ఇష్టదైవమును, నిర్మలమైనవాడును, మృత్యు దేవతయొక్క గర్వభంజకుడును, భయంకరములగు కోరలు అలంకారములుగ గల కాశీపట్టణప్రభువగు కాలభైరవుని సేవింతును.

**7. అట్టహాస భిన్న పద్మజాండ కోశ సంతతిం**
**దృష్టిపాత నష్ట పాపజాల ముగ్ర శాసనమ్**
**అష్టసిద్ధి దాయకం కపాలమాలికాధరం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

వికటమైన నవ్వుచే బ్రద్దలైన బ్రహ్మాండ సముదాయముగల వాడును, దృష్టి ప్రసారములచే నశించిన పాపసముదాయముగలవాడును, కఠోరమైన శాసనముగల వాడును, అణిమాద్యష్టసిద్ధుల నొసంగువాఁడును, కపాలముల మాలను ధరించిన వాడును కాశీపుర ప్రభువగు కాలభైరవుని సేవింతును.

8. **భూతసంఘ నాయకం విశాల కీర్తి దాయకం**
**కాశివాసి లోక పుణ్యపాప శోధకం విభుమ్**
**గీతిమార్గకోవిదం పురాతనం జగత్పతిం**
**కాశికాపురాధినాథ కాలభైరవం భజే.**

భూతసంఘములకు నాయకుడును, విస్తారమైన కీర్తి నొసంగువాడును, కాశీపురమునగల జనుల పుణ్యపాపములను శోధించు ప్రభువును, గానమార్గమునందు ఆరితేరినవాడును, ప్రాచీనుడును, జగన్నాథుడును, కాశీపురనాథుడును నగు కాల భైరవుని సేవింతును.

**9. కాలభైరవాష్టకం పఠన్తి యే మనోహరం**
**జ్ఞాన ముక్తి సాధకం విచిత్ర పుణ్యవర్ధనమ్**
**శోక మోహ లోభ దైన్య కోప తాప నాశనం**
**తే ప్రయాన్తి కాలభైరవాంఘ్రి సన్నిధిం ధ్రువమ్**

మనోహరమైనదియు, జ్ఞాన మోక్షములను సాధించునదియు, గొప్ప పుణ్యమును పెంపొందించునదియు, శోకమును, మోహమును, లోభమును, దీనభావమును, కోపమును, తాపమును పోగొట్టునదియు నగు నీ కారభైరవాష్టకమును పఠించువారు తప్పక శ్రీ కాలభైరవుని పాదసన్నిధిని చేరుదురు.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం కాలభైరవాష్టకం సంపూర్ణమ్.***

## ఉమామహేశ్వర స్తోత్రమ్

**1. నమః శివాభ్యాం నవయౌవనాభ్యాం**
**పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యామ్**
**నగేన్ద్రకన్యా వృష కేతనాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్.**

ఎల్లప్పుడు నవయౌవనులైన, అర్ధనారీశ్వర స్వరూపమును ధరించిన పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. పర్వత పుత్రియైన, వృషకేతనముగాగల శంకర పార్వతుల కొరకు నమస్కారము. (నమోనమః అని ఆదరార్థమందు ద్విర్వచనము.)

**2. నమః శివాభ్యాం సరసోత్సవాభ్యాం**
**నమస్కృతాభీష్ట వరప్రదాభ్యామ్**
**నారాయణే నార్చిత పాదుకాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్.**

రసవత్తరమైన యుత్సవములు కలిగి నమస్కరించువారికి కోరిన వరములిచ్చు పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. నారాయణుని చేత పూజింపబడు పాదుకలుగల శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**3. నమః శివాభ్యాం వృషవాహనాభ్యాం**
**విరించి విష్ణ్విన్ద్ర సుపూజితాభ్యామ్**
**విభూతి పాటీర విలేపనాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్.**

ఎద్దు వాహనముగాగల, బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుల చేత పూజింపబడు పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. విభూతిని, గంధమును పూసుకొన్న శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**4. నమః శివాభ్యాం జగదీశ్వరాభ్యాం**
**జగత్పతిభ్యాం జయవిగ్రహాభ్యామ్**
**జమ్భారి ముఖ్యై రభివన్దితాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

జగదీశ్వరులైన, జగద్భర్తలైన, మంగళ విగ్రహులైన పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. ఇంద్రుడు మొదలగు వారల చేత నమస్కరించబడు శంకరపార్వతుల కొరకు నమస్కారము.

**5. నమః శివాభ్యాం పరమౌషధాభ్యాం**
**పంచాక్షరీ పఞ్జర రంజితాభ్యామ్**
**ప్రపంచ సృష్టి స్థితి సంహృతాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

పరమౌషధస్వరూపులైన, పంచాక్షరియను పంజరమందు నొప్పుచున్న పార్వతీ పరమేశ్వరులకొరకు నమస్కారము. ప్రపంచముయొక్క ఉత్పత్తి స్థితి లయకారణ భూతులైన శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**6. నమః శివాభ్యాం మతిసున్దరాభ్యా**
**మత్యన్త మాస క్త హృదమ్బుజాభ్యామ్**
**అశేష లోకైక హితం కరాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

అతి సుందరులైన, మిక్కిలి ప్రేమతో కూడుకొనిన హృదయ కమలములుగల పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. సమస్త లోకమునకు ముఖ్యమైన హితమును కలుగ చేయునట్టి శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**7. నమః శివాభ్యాం కలినాశకాభ్యాం**
**కంకాళ కళ్యాణ వపుర్ధరాభ్యామ్**
**కైలాస శైల స్థిత దేవతాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

పాపమును పోగొట్టునట్టి మంగళ ప్రదములైన యొముకలచే శుభమైన శరీరమును ధరించిన పార్వతీ పరమేశ్వరులకొరకు నమస్కారము. కైలాసమందున్న దేవతా స్వరూపులైన పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము.

**8. నమః శివాభ్యాం మశుభాపహాభ్యా**
**మశేష లోకైక విశేషితాభ్యామ్**
**అకుంఠితాభ్యాం స్మృతిసంభృతాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

అశుభమును పోగొట్టునట్టి, సమస్త లోకమును అతిశయించియున్న పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. అకుంఠితులైన (అనగా వ్యర్థముకాని విశేష స్మృతితో కూడిన) శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**9. నమః శివాభ్యాం రథవాహనాభ్యాం**
**రవీన్దు వైశ్వానర లోచనాభ్యామ్**
**రాకా శశాంకాభ ముఖామ్బుజాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

రథము వాహనముగాగల సూర్య, చంద్ర, అగ్నులు నేత్రములుగాగల పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. పూర్ణిమనాటి చంద్రకాంతివంటి కాంతిగల ముఖపద్మములుగల శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**10. నమః శివాభ్యాం జటలంధరాభ్యాం**
**జరామృతిభ్యాం చ వివర్జి తాభ్యామ్**
**జనార్దనాబ్జోద్భవ పూజితాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

జటా సముదాయమును ధరించిన జరామృత్యు రహితులైన పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. జనార్దనుని చేతను బ్రహ్మ చేతను పూజింపబడు శంకర పార్వతులకొరకు నమస్కారము.

**11. నమః శివాభ్యాం విష మేక్షణాభ్యాం**
**బిల్వచ్ఛదా మల్లిక దామభృద్భ్యామ్**
**శోభావతీ శాన్తవతీశ్వరాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

మూడు నేత్రములుగల, మారేడు దళముల యొక్కయు మల్లెపూల యొక్కయు దండలను ధరించిన పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. శోభావతీ శాంత వతీశ్వరులైన శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**12.** **నమః శివాభ్యాం పశుపాలకాభ్యాం**
**జగత్త్రయీ రక్షణ బద్ధహృద్భ్యామ్**
**సమస్త దేవాసుర పూజితాభ్యాం**
**నమోనమః శంకర పార్వతీభ్యామ్!**

పశుపాలకులైన, మూడు లోకములను రక్షించుటయందు దృఢసంకల్పముగల పార్వతీ పరమేశ్వరుల కొరకు నమస్కారము. సమస్తమైన దేవతల చేత, రాక్షసుల చేత పూజింపబడు శంకర పార్వతుల కొరకు నమస్కారము.

**13.** **స్తోత్రం త్రిసంధ్యం శివపార్వతీభ్యాం**
**భక్త్యా పఠే ద్ద్వాదశకం నరో యః**
**స సర్వ సౌభాగ్య ఫలాని భుం క్తే**
**శతాయు రన్తే శివలోక మేతి.**

ఏ నరుడు ద్వాదశ శ్లోకాత్మకమైన ఈ స్తోత్రమును భక్తితో శివపార్వతుల ప్రీతికొరకు మూడు కాలములయందు పఠించునో, అతడు నూరు సంవత్సరములు ఆయుర్దాయము గలిగి ఇహలోకమున సర్వ సౌభాగ్యములను అనుభవించును. అనన్తరము శివలోకమును పొందును.

*ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం ఉమామహేశ్వర స్తోత్రం సంపూర్ణమ్.*

## శివపంచాక్షర నక్షత్రమాలా స్తోత్రమ్

**1.** **శ్రీమదాత్మనే గుణైకసింధవే నమశ్శివాయ**
**ధామలేశ ధూత కోక బంధవే నమశ్శివాయ**
**నామశోషితానమ ద్భవాంధవే నమశ్శివాయ**
**పామరేతర ప్రధాన బంధవే నమ శ్శివాయ.**

శ్రీ సంపన్నమైన యాత్మరూపునకు గుణసాగరునకు శివునకు నమస్కారము. అత్యల్ప తేజోలేశముచే సూర్యుని ధిక్కరించువాడు, వినతులగు భక్తుల భావాంధువును (సంసారమనెడి పాడునూతిని) ఇంకించువాడు, పుణ్యజన ముఖ్యబంధువు అగు శివునికి నమస్కారము.

**2.** **కాలభీత విప్రబాల పాల! తే నమ శ్శివాయ**
**శూలభిన్న దుష్టదక్షఫాల! తే నమ శ్శివాయ**
**మూలకారణాయ కాలకాల ! తే నమ శ్శివాయ**
**పాలయాధునా దయాలవాల! తే నమ శ్శివాయ.**

యమునకు జడిసిపోవు బ్రాహ్మణ బాలుని రక్షించినవాడ! (మార్కండేయ జీవనదాత యన్నమాట). శూలముచే దుష్టుడగు దక్షుని ఫాలము బగులగొట్టినవాడ! మూలకారణా! కాలకాల! నీకు నమస్కారము. దయకు ఆలవాలమైనవాడ! ఇపుడు నన్ను పాలింపుము. శివునకు నీకిదే నమస్కారము.

**3. ఇష్టవస్తు ముఖ్యదాన హేతవే నమ శ్శివాయ**
**దుష్టదైత్య వంశ ధూమకేతవే నమ శ్శివాయ**
**సృష్టిరక్షణాయ ధర్మసేతవే నమ శ్శివాయ**
**అష్టమూర్తయే వృషేంద్రకేతవే నమ శ్శివాయ.**

అభీష్ట వస్తువుల నిచ్చుటలో ముఖ్య హేతువవు, దుష్టదానవ వంశములకు ధూమకేతువవు, సృష్టి పాలకుడవు, ధర్మ సేతువవు, అష్టమూర్తివి, వృష భేంద్రుడు కేతువునందుగలవాడవు అగు శివునకు నీకు నమస్కారము.

**4. ఆపదద్రి భేద టంక హస్త! తే నమ శ్శివాయ**
**పాపహారి దివ్యసింధు మస్త! తే నమ శ్శివాయ**
**పాపదారిణే లసన్న మస్త! తే నమ శ్శివాయ**
**శాపదోష ఖండన ప్రశస్త! తే నమ శ్శివాయ.**

ఆపదల నెడి కొండల బ్రద్దలగొట్టు రాతిఉలి చేత గలవాడవు. పాపముల హరించు దివ్యగంగ శిరమున గలవాడవు. పాపముల చీల్చి చెండాడు వాడవు, అందరి నమస్కారము లందు కొనువాడవు. శాపదోషముల ఖండింపగల మహేశ్వరుడవు. శివుడవు. నీకు నమస్కారము.

**5. వ్యోమకేశ దివ్యభవ్యరూప! తే నమ శ్శివాయ**
**హేమ మేదినీ ధరేంద్ర చాప! తే నమ శ్శివాయ**
**నామమాత్ర దగ్ధ సర్వపాప! తే నమ శ్శివాయ**
**కామనైక తానహృద్దురాప! తే నమ శ్శివాయ.**

ఆకాశము కేశముగాగల దివ్యము, మంగళకరము అయిన రూపుగలవాడా! బంగారుకొండ (మేరువు) విల్లుగా గలవాడా! నామమాత్రముచే (శివనామో చ్చారణ మాత్రముచేత) నెల్ల పాపముల దహించువాడా. కామన యెడల తదేక వృత్తిగల హృదయముల కందరానివాడా. నీకు నమస్కారము (సకాములకు దుర్ల భుడన్నమాట).

**6. బ్రహ్మమస్తకావలీ నిబద్ధ! తే నమ శ్శివాయ**
**జిహ్మగేంద్రకుండల ప్రసిద్ధ! తే నమ శ్శివాయ**
**బ్రహ్మణే ప్రణీత వేదపద్ధ! తే నమ శ్శివాయ**
**జిహ్మకాల దేహదత్త పద్ధ! తే నమ శ్శివాయ.**

బ్రహ్మమనగా వేదము. బ్రహ్మ మస్తకములు వేదశిరస్సులు. వేదాంతములు అందు నిబద్ధుడవు. అనగా వేదాంత వాక్యముల యర్థమైయున్నాడవు. ఆదిశేషుడు కుండలముగా గలవాడవు. బ్రహ్మ స్వరూపుడవు. వేదవిహిత మార్గ ప్రవర్తకుడవు. మోసగాడగు కాలుని దేహమును కాలదన్నినవాడవు నగు శివునకు నమస్కారము.

**7. కామనాశనాయ శుద్ధకర్మణే నమ శ్శివాయ**
**సామగాన జాయమాన శర్మణే నమ శ్శివాయ**
**హేమకాంతి చాకచక్య వర్మణే నమ శ్శివాయ**
**సామజాసురాంగలబ్ధ చర్మణే నమ శ్శివాయ.**

కామహరుడు, శుద్ధకర్మ స్వరూపుడు, సామగానముచే సుఖము నందువాడు, బంగరుకాంతుల జక జకలునించు కవచముగలవాడు, గజాసురు మేని చర్మముగొన్న వాడు నగు శివునకు నమస్కారము.

**8. జన్మ మృత్యు ఘోర దుఃఖ హారిణే నమ శ్శివాయ**
**చిన్మయైకరూప దేహధారిణే నమ శ్శివాయ**
**మన్మనోరథావపూర్తి కారిణే నమ శ్శివాయ**
**మన్మనోగతాయ కామవైరిణే నమ శ్శివాయ.**

జననమరణములను ఘోరదుఃఖములను హరించువాడు, చిన్మ యరూప శరీరము దాల్చువాడు, నా మనోరథముల నిండించువాడు, నా మనసునం దుండువాడు, మన్మ థవైరియునగు శివునకు నమస్కారము.

**9. యక్షరాజబంధవే దయాలవే నమ శ్శివాయ**
**దక్షపాణిశోభి కాంచనాలవే నమ శ్శివాయ**
**పక్షిరాజవాహహృచ్ఛయాలవే నమ శ్శివాయ**
**అక్షిఫాల వేదపూతతాలవే నమ శ్శివాయ.**

యక్ష రాజగు కుబేరునికి చుట్టము, దయకు ఆటపట్టు, కుడి చేతియందు అగ్ని కలవాడు, గరుడ వాహనుని హృదయమున నివసించువాడు, ఫాలాక్షుడు, వేదములచే బవిత్రములయిన తాలువులు గలవాడు నగు శివునకు నమస్కారము.

**10. దక్షహస్తనిష్ఠ జాతవేదసే నమ శ్శివాయ**
**అక్షరాత్మనే నమద్బిడౌజసే నమ శ్శివాయ**
**దీక్షిత ప్రకాశితాత్మ తేజసే నమ శ్శివాయ**
**ఉక్షరాజవాహ తే సతాంగతే నమ శ్శివాయ.**

కుడిచేతియం దగ్ని కలవాడు, అక్షర స్వరూపుడు, ఇంద్రునిచే నమస్కరింపబడువాడు, యజ్ఞ దీక్షితులయందు ప్రకటింపబడిన తన తేజస్సు గలవాడు (హోత శివుని అష్టరూపములలో నొకడు), వృషభేంద్రవాహనుడును, సజ్జనులకు గతియునగు శివునకు నీకు నమస్కారము.

**11. రాజతాచలేంద్రసాను వాసినే నమ శ్శివాయ**
**రాజమాన నిత్యమందహాసినే నమ శ్శివాయ**
**రాజకోరకావతంస భాసినే నమ శ్శివాయ**
**రాజరాజ మిత్రతా ప్రకాశినే నమ శ్శివాయ.**

వెండికొండ చరియలయందు వసించువాడు, ఎల్లపుడు మందహాసము చిందువాడు, చిన్ని జాబిల్లి మొగ్గ తలపూవుగా గలవాడు, కుబేరుని మిత్రభావమున వెలుగువాడు నగు శివునకు నమస్కారము.

**12. దీనమానవాళి కామధేనవే నమ శ్శివాయ**
**సూనబాణ దాహ కృత్కృశానవే నమ శ్శివాయ**
**స్వానురాగ భక్త రత్నసానవే నమ శ్శివాయ**
**దానవాంధకార చండభానవే నమ శ్శివాయ.**

దీనజనులపాలి కామధేనువు, పూవింటివాని దహించు కృశానువు (అగ్ని), తనయందు వలపుగల భక్తులపాలి రత్నసానువు (మేరువు), దానవు లనెడి కారు చీకట్లకు చండభానువు (సూర్యుడు) అగు శివునకు నమస్కారము.

**13. సర్వమంగళా కుచాగ్ర శాయినే నమ శ్శివాయ**
**సర్వదేవతా గణాతిశాయినే నమ శ్శివాయ**
**పూర్వదేవ నాశ సంవిధాయినే నమ శ్శివాయ**
**సర్వ మన్మనోజ భంగదాయినే నమ శ్శివాయ.**

సర్వమంగళ కుచాగ్రములందు శయనించువాడు, సర్వదేవతా గణముల నతిశయించువాడు, రాక్షసుల నాశనము చేయువాడు, సమూలముగ నాలోని కామ వృత్తిని నశింపజేయువాడు నగు శివునకు నమస్కారము.

14. స్తోకభక్తితోఽపి భక్తపోషిణే నమ శ్శివాయ
మాకరందసారవర్షి భాషిణే నమ శ్శివాయ
ఏక బిల్వ దానతోఽపి తోషిణే నమ శ్శివాయ
నైకజన్మ పాపజాల శోషిణే నమ శ్శివాయ.

ఏ కొలది భక్తితోనేని భక్తుల బోషించువాడు, తేనె తేట లొలికించు భాషణములు గలవాడు, ఏక బిల్వ మాత్రదానముచే నుబ్బువాడు, అనేక జన్మ పాప జాలము నింకించువాడు నగు శివునకు నమస్కారము.

15. సర్వజీవ రక్షణైక శీలినే నమ శ్శివాయ
పార్వతీ ప్రియాయ భక్త పాలినే నమ శ్శివాయ
దుర్విదగ్ధ దైత్యసైన్య దారిణే నమ శ్శివాయ
శర్వరీశ ధారిణే కపాలినే నమ శ్శివాయ.

సర్వజీవుల రక్షించు శీలముగలవాడు, పార్వతీ ప్రియుడు, భక్త పాలకుడు, మాయా నిపుణులైన దైత్యుల సేనలం జీల్చినవాడు, చంద్రుని ధరించువాడు, కపాలియు నగు శివునకు నమస్కారము.

16. పాహి మా ముమా మనోజ్ఞ దేహ! తే నమ శ్శివాయ
దేహి మే వరం సితాద్రి గేహ! తే నమ శ్శివాయ
మోహితర్షి కామినీసమూహ! తే నమ శ్శివాయ
స్వేహిత ప్రసన్న కామదోహ! తే నమ శ్శివాయ.

ఉమా మనోహరమైన శరీరముగలవాడ! నన్ను కాపాడు. తెలికొండ నిలయముగాగలవాడ! నాకు వరములిమ్ము. దారుకావన మునిభామినుల మోహింప జేసినవాడ! స్వభక్తులయెడ బ్రసన్నుడై కామ దోహనముచేయు కామధేనువ! శివ! నీకు నమస్కారము.

17. మంగళ ప్రదాయ గో తురంగ! తే నమ శ్శివాయ
గంగయా తరంగితోత్తమాంగ! తే నమ శ్శివాయ
సంగర ప్రవృత్త వైరి భంగ! తే నమ శ్శివాయ
అంగజారయే కరే కురంగ! తే నమ శ్శివాయ.

మంగళమిచ్చువాడ! వృషభ మెక్కువాడ! గంగ శిరమునందు కెరటములు వేయువాడ! సంగరమందు వైరుల భంగించువాడ! మన్మథారి! చేతిలో కురంగము గలవాడ! నీకు శివునికి నమస్కారము.

**18. ఈహిత క్షణ ప్రదాన హేతవే నమ శ్శివాయ**
**ఆహితాగ్ని పాల కోక్ష కేతవే నమ శ్శివాయ**
**దేహకాంతి ధూత రౌప్యధాతవే నమ శ్శివాయ**
**దేహ దుఃఖపుంజ ధూమకేతవే నమ శ్శివాయ.**

కోరిన క్షణములో కోర్కెల నిచ్చువాడ! ఆహితాగ్నుల పాలించువాడ! వృషభధ్వజ! దేహకాంతిచే వెండిని ధిక్కరించువాడ! సంసార దుఃఖపుంజము పాలిధూమ కేతువ! నీకు నమస్సు.

**19. త్ర్యక్ష! దీన సత్కృపా కటాక్ష! తే నమ శ్శివాయ**
**దక్ష సప్తతంతు నాశ దక్ష! తే నమ శ్శివాయ**
**ఋక్షరాజ భాను పావకాక్ష! తే నమ శ్శివాయ**
**రక్ష! మాం ప్రసన్న మాత్రరక్ష! తే నమ శ్శివాయ.**

త్రినేత్ర! దీనులయెడ దయనించు కటాక్షములు గలవాడ! దక్షుని యజ్ఞమును నాశనము చేసినవాడ! చంద్రుడు, సూర్యుడు, అగ్ని నేత్రములుగా గలవాడ, నన్ను రక్షింపుము, శివునకు నీ కిదే నమస్కారము.

**20. న్యంకుపాణయే శివంకరాయ తే నమ శ్శివాయ**
**సంకటాబ్ధి తీర్ణ కింకరాయ తే నమ శ్శివాయ**
**పంకభీషితా భయంకరాయ తే నమ శ్శివాయ**
**పంకజాననాయ శంకరాయ తే నమ శ్శివాయ.**

జింక చేత గలవాడు, మంగళకరుడు, నిజకింకరులను (భక్తులను) కష్టముల నుండి గట్టెక్కించువాడు పాపభయగ్రస్తుల కభయప్రదాత, పంకజముఖుడు, సుఖ కరుడు నగు శివునకు నమస్కారము.

**21. కర్మపాశనాశ ! నీలకంఠ! తే నమ శ్శివాయ**
**శర్మదాయ నర్మభస్మకంఠ! తే నమ శ్శివాయ**
**నిర్మమర్షి సేవితోపకంఠ! తే నమ శ్శివాయ**
**కుర్మహే నతీర్నమద్వికుంఠ ! తే నమ శ్శివాయ.**

కర్మపాశముల ద్రెంచువాడ! నీలకంఠ! శర్మము నిచ్చువాడ! (సుఖదాత!) యాగభస్మము కంఠమున బూసికొన్నవాడ! అహంకార మమకార శూన్యులగు ఋషులు సన్నిధింజేరువాడ! వైకుంఠవంద్య! నీకు నతులొనర్తుము. శివునకు నీకిదే నమస్కారము.

**22. విష్టపాధిపాయ నమ్రవిష్ణవే నమ శ్శివాయ**
**శిష్టవిప్ర హృద్గుహా చరిష్ణవే నమ శ్శివాయ**
**ఇష్టవస్తు నిత్యతుష్ట జిష్ణవే నమ శ్శివాయ**
**కష్టనాశనాయ లోకజిష్ణవే నమ శ్శివాయ.**

లోకాధిప! విష్ణువంద్య! శిష్టాచార సంపన్నులగు విప్రుల హృద్గుహయందు చరించు వాడవు! ఇష్టవస్తువగు ఆత్మచే నిత్యతృప్తుడవు! జయశీలుడవు, కష్టముల హరించు వాడవు, లోకముల గెల్చినవాడవునగు నీకు నమస్కారము.

**23. అప్రమేయ దివ్య సుప్రభావ! తే నమ శ్శివాయ**
**సుప్రసన్న రక్షణస్వభావ! తే నమ శ్శివాయ**
**స్వప్రకాశ నిస్తులానుభావ! తే నమ శ్శివాయ**
**విప్రడింభ దర్శితార్ద్రభావ! తే నమ శ్శివాయ.**

అప్రమేయ దివ్యప్రభావా! సుప్రసన్నా! రక్షణ స్వభావా! స్వప్రకాశముచే సాటిలేని అనుభావము గలవాడా! బ్రాహ్మణ బాలు నెడ (మార్కండేయునియందు) జూపించిన ఆర్ద్రభావము గలవాడ! శివునకు నీ కిదే నమస్కారము.

**24. సేవకాయ మే మృడ ప్రసీద! తే నమ శ్శివాయ**
**భావలభ్యతావక ప్రసాద! తే నమ శ్శివాయ**
**పావకాక్ష! దేవపూజ్యపాద! తే నమ శ్శివాయ**
**తావకాంఘ్రి భక్త దత్త మోద! తే నమ శ్శివాయ.**

నీ దాసుడనగు నాయెడ బ్రసన్నుడవగుము. భావనచే నీ ప్రసాదము బడయ దగినది. అగ్నిలోచన! దేవవంద్య చరణా! నీ చరణ భక్తులకు ఆనందమిచ్చువాడ! శివునికి నీ కిదే నమస్కారము.

**25. భుక్తి ముక్తి దివ్యభోగ దాయినే నమ శ్శివాయ**
**శక్తి కల్పిత ప్రపంచ భాగినే నమ శ్శివాయ**
**భక్త సంకటాపహార యోగినే నమ శ్శివాయ**
**యుక్తసన్మనస్సరోజ యోగినే నమ శ్శివాయ.**

భుక్తిముక్తులను దివ్యభోగములను నిచ్చువాడ! నిజ శక్తిచే నఖిల ప్రపంచ కల్పనము చేయువాడ! భక్త సంకటాపహర్తవగు యోగీంద్ర! యోగి జన మనః పద్మమునందు నివసించు శివునకు నీకు నమస్కారము.

**26.** **అంతకాంతకాయ పాపహారిణే నమ శ్శివాయ**

**శంతమాయ దంతిచర్మ ధారిణే నమ శ్శివాయ**

**సంతతాశ్రితవ్యథా విదారిణే నమ శ్శివాయ**

**జంతు జాత నిత్య సౌఖ్య కారిణే నమ శ్శివాయ.**

అంతకున కంతకుడు, పాపముల హరించువాడు, పరమ సుఖదాత, గజము తోలు ధరించినవాడు, ఎల్లప్పుడు ఆశ్రితుల వెతల హరించువాడు, సకల జంతువులకు నిత్య సౌఖ్యము (ముక్తిని) బ్రసాదించువాడు నగు శివునకు నమస్కారము.

**27.** **శూలినే నమో నమః కపాలినే నమ శ్శివాయ**

**పాలినే విరించి తుండ మాలినే నమ శ్శివాయ**

**లీలినే విశేష రుండ మాలినే నమ శ్శివాయ**

**శీలినే నమః ప్రపుణ్య శాలినే నమ శ్శివాయ.**

శూలధరునకు, కఫాలధరునకు నమస్కారము. పాలించువానికి, బ్రహ్మ కపాలమాలికి నమస్సు. లీలలు గలవానికి, పుఱ్ఱెలమాల గలవానికి నమస్కారము. శీలవంతునకు పుణ్యశాలికి, శివునకు వందనము.

**28.** **శివపంచాక్షర ముద్రాం**

**చతుష్పదోల్లాస పద్య మణి ఘటితామ్**

**నక్షత్రమాలికా మిహ**

**దధ దుపకంఠం నరో భవే త్సోమః**

శివపంచాక్షరీ ముద్రగలది, నాల్గుపాదములచే నుల్లసించు పద్యమణులచే సంఘటితమయినదియు నగు నీ నక్షత్రమాలికను (27 స్తుతి శ్లోకములు గలది నక్షత్రమాల) కంఠమునం దాల్చు నరుడు సోముడగును. (శివసారూప్య సాయుజ్యమందు నన్నమాట).

***ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాదకృతం శ్రీ శివ పంచాక్షర నక్షత్రమాలా స్తోత్రం సంపూర్ణమ్.***

❀ ❀ ❀

# శివనామావళ్యష్టకమ్

**1. హే చంద్రచూడ! మదనాంతక! శూలపాణే!**
**స్థాణో! గిరీశ! గిరిజేశ ! మహేశ ! శంభో !**
**భూతేశ ! భీత భయ సూదన! మా మనాథం**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష !**

చంద్రుడు శిరోభూషణముగ గలవాడా! మన్మథుని నశింపజేసిన వాడా ! శూలము హస్తమునందు గలవాడా ! స్థిరమైనవాడా ! కైలాస పర్వతమునకు నాథుడా! పార్వతీపతీ! మహేశ్వరా ! శంభూ! సమస్త ప్రాణులకు ప్రభువైన వాడా! భయము నొందినవారి భయమును పోగొట్టు వాడా! ఓ జగన్నాథా ! దిక్కులేని నన్ను గహనమైన సంసారమునందలి దుఃఖమునుండి రక్షించుము.

**2. హే పార్వతీ హృదయవల్లభ ! చంద్రమౌళే !**
**భూతాధిప! ప్రమథనాథ ! గిరీశ చాప !**
**హే వామదేవ! భవ! రుద్ర! పినాకపాణే !**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష.!**

ఓ పార్వతీ మనోనాథా! చంద్రశేఖరా! ప్రాణులకు ప్రభువైన వాడా! ప్రమథగణములకు నాథుడా! మేరుపర్వతమును ధనువుగ (త్రిపురాసుర సంహార సమయమున) ధరించినవాడా ! ఓ వామదేవా! భవా! రుద్రా! పినాకమను ధనుస్సు హస్తమునందు గలవాడా ! ఓ జగన్నాథా! అరణ్యమువంటి సంసార దుఃఖము నుండి నన్ను కాపాడుము.

**3. హే నీలకంఠ! వృషభధ్వజ! పంచవక్త్ర !**
**లోకేశ! శేషవలయ! ప్రమథేశ! శర్వ!**
**హే ధూర్జటే ! పశుపతే! గిరిజాపతే! మాం**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష.!**

నల్లని కంఠముగలవాడా! నందివాహనా! సద్యోజాతాది పంచముఖములు గలవాడా! లోకపాలకా! శేషుని కంకణముగ ధరించినవాడా! ప్రమథగణాధిపా! ఓ శర్వా! ఓ ధూర్జటీ! ఓ పశుపతీ! ఓ పార్వతీపతీ! ఓ జగన్నాథా! సంసారదుఃఖమనెడి అరణ్యము నుండి నన్ను రక్షించుము.

**4. హే విశ్వనాథ! శివ! శంకర! దేవ దేవ!**
**గంగాధర! ప్రమథనాయక! నందికేశ !**
**బాణేశ్వరాంధకరిపో ! హర! లోకనాథ!**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష.!**

ఓ విశ్వనాథా! శివా! శంకరా! దేవదేవా! గంగను ధరించిన వాడా! ప్రమథగణాధిపా! ఓ నందికేశ్వరా! ఓ బాణేశ్వరా! అంధకాసురుని నశింపజేసిన వాడా! ఓ హర! లోకపతీ! ఓ జగన్నాథా! సంసార దుఃఖమనెడి అరణ్యము నుండి నన్ను కాపాడుము.

**5. వారాణసీ పురపతే! మణికర్ణి కేశ !**
**వీరేశ! దక్షమఖకాల! విభో! గణేశ!**
**సర్వజ్ఞ ! సర్వహృదయైకనివాస ! నాథ!**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష.!**

కాశీపట్టణ ప్రభూ ! ఓ మణికర్ణికా దీపీపతీ! (మణికర్ణికాఘాట్ అని కాశీలో ఒక ప్రదేశము గలదు.) దక్ష ప్రజాపతి యొక్క యజ్ఞమునకు యమునివంటివాడా! ఓ ప్రభూ! ప్రమథగణాధిపా! సమస్తము నెఱింగినవాడా ! అందరి హృదయములందు ప్రధానముగ నివసించువాడా ! జగన్నాథా ! సంసార దుఃఖారణ్యము నుండి నన్ను కాపాడుము.

**6. శ్రీమన్మహేశ్వర! కృపామయ! హే దయాలో !**
**హే వ్యోమకేశ! శితికంఠ! గణాధినాథ!**
**భస్మాంగరాగ! నృకపాలకలాపమాల !**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష.!**

శోభతోనొప్పు మహేశ్వరా ! ఓ దయామయా ! ఆకాశము కేశములుగ గలవాడా! గరళము కంఠమున గలవాడా ! ప్రమథ గణములకు నాథా ! భస్మము మైపూతగ గలవాడా ! నర కపాలముల మాలను ధరించినవాడా ! ఓ జగన్నాథా ! సంసార దుఃఖమనెడి అరణ్యము నుండి రక్షించుము.

**7. కైలాసశైల వినివాస! వృషాకపే హే !**
**మృత్యుంజయ! త్రినయన! త్రిజగన్ని వాస!**
**నారాయణప్రియ ! మదాపహ! శక్తినాథ !**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష.!**

కైలాస పర్వతమున నివసించువాడా ! ధర్మాచరణ తత్పరుల రక్షించువాడా ! మృత్యువును జయించినవాడా ! మూడు నేత్రములుగలవాడా ! ముల్లోకములందు నివసించువాడా ! నారాయణుడు ప్రియుడుగ గలవాడా ! గర్వమును పోగొట్టు వాడా ! శక్తికి నాథా ! ఓ జగత్పతీ ! సంసార దుఃఖ మనెడి అరణ్యము నుండి రక్షించుము.

**8. విశ్వేశ ! విశ్వభవనాశక! విశ్వరూప!**
**విశ్వాత్మక! త్రిభువనైక గుణాధి కేశ !**
**హే విశ్వనాథ! కరుణామయ! దీనబంధో !**
**సంసార దుఃఖ గహనా జ్జగదీశ ! రక్ష.!**

ఓ విశ్వనాథా ! అందరి సంసారమును నశింపజేయువాడా ! విరాడ్రూపుడా ! ప్రపంచరూపుడా ! ముల్లోకములందు ప్రధానమైనవాడా ! గుణములచే నధికుడవైన ప్రభూ ! జగన్నాథా! దయామయా! దీనులకు బంధూ! ఓ జగత్పతీ! సంసార దుఃఖ మనెడి అరణ్యము నుండి రక్షించుము.

**9. గౌరీ విలాస భవనాయ మహేశ్వరాయ**
**పంచాననాయ శరణాగత కల్పకాయ**
**శర్వాయ సర్వజగతామధిపాయ తస్మై**
**దారిద్ర్య దుఃఖ దహనాయ నమః శివాయ.**

పార్వతిదేవి యొక్క విలాసములకు నిలయమైనవాడును, మహేశ్వరుడును, పంచముఖుడును, శరణు పొందినవారికి కల్పవృక్షము వంటి వాడును, శర్వుడును, సర్వజగదీశ్వరుడును, దారిద్ర్యమనెడి దుఃఖమునకు నాశకుడును నగు ఆ శివునకు నమస్కారము.

***ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం శివనామావళ్యష్టకమ్ సంపూర్ణమ్.***

## శివాపరాధక్షమాపణ స్తోత్రమ్

**1. ఆదౌ కర్మప్రసంగాత్కలయతి కలుషం మాతృకుక్షౌ స్థితం మాం**
**విణ్మూత్రామేధ్యమధ్యే క్వథయతి నితరాం జాఠరో జాతవేదాః**
**యద్యద్వై తత్ర దుఃఖం వ్యథయతి నితరాం శక్యతే కేన వక్తుం !**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

ఓ మహాదేవా శివా ! ప్రారబ్ధకర్మవశమున మాతృగర్భమున మలమూత్రాదులలో ఆకలిచిచ్చు కుమిలించుచుండగా నేను పడు దుఃఖము చెప్పనలని కాదు. అట్టి దుఃఖమునకు కారణమైన పాపరూపమగు నా అపరాధమును క్షమించుము.

**2. బాల్యే దుఃఖాతిరేకా న్మలలులితవపుః స్తన్యపానే పిపాసు**
**ర్నో శక్త శ్చేంద్రియేభ్యో భవమలజనితా జన్తవో మాంతుదన్తి**
**నానారోగాదిదుఃఖా ద్రుదితపరవశ శ్శంకరం నస్మరామి**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

బాల్యమున దుఃఖాతిశయమున మలమును పూసికొనుచు, తల్లిపాలకై యేడ్చుచు, ఇంద్రియములు వశములుగాక, సంసారమలమున నేర్పడిన నానా జీవులు నన్ను పీడించుచుండగా, నానారోగాది దుఃఖములవలన నేడ్చుచు, వశముతప్పి శంకరుడవగు నిన్ను స్మరింపనైతిని. ఓ మహాదేవా! నా యీ యపరాధమును క్షమింపుము.

**3. ప్రౌఢోఽహం యౌవనస్థో విషయవిషధరైః పంచభి ర్మర్మసంధౌ**
**దష్టో నష్టో వివేకః సుత ధన యువతి స్వాదసౌఖ్యే నిషణ్ణః**
**శైవే చిన్తావిహీనం మమ హృదయ మహో! మానగర్వాధిరూఢం**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

పడుచుదనమున దిట్టనై పంచేంద్రియముల ఉపభోగములను సర్పములు నానా మర్మసంధులయందు గఱువగా వివేకము చెడి పుత్ర ధన కళత్రానుభవమునందు తగుల్కొని నా మనస్సు శివచింతలేక దురభిమాన నిరూఢమై యున్నది. ఓ శివా! నా యపరాధమును క్షమింపుము.

**4. వార్ధక్యే చేన్ద్రియాణాం వికలగతిమతి శ్చాధిదైవాదితాపైః**
**ప్రాప్తైః రోగై ర్వియోగై ర్వ్యసనకృశవపుః ప్రౌఢిహీనం చ దీనమ్**
**మిథ్యామోహాభిలాషై ర్భ్రమతి మమ మనో ధూర్జటే ర్ధ్యానశూన్యం**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

ముసలితనమున ఇంద్రియముల వ్యాపారము తగ్గి, మతిచెడి ఆధిభౌతికాధిదైవికాధ్యాత్మిక తాపత్రయముల చేతను, రోగముల చేతను, ఇష్టజన వియోగముల చేతను, వ్యసనముల చేతను శరీరము కృశించి పటిమతగ్గి దీనావస్థలోనున్నది. నా మనస్సు వ్యర్థమగు కోరికలతో భ్రమచెందుచు శివధ్యానశూన్య మైనది. ఓ మహాదేవా! నా అపరాధమును క్షమింపుము.

**5. స్నా త్వా ప్రత్యూషకాలే స్నపనవిధివిధౌ నాహృతం గాంగతోయం**
**పూజార్థం వా కదాచిద్బహుతరగహనేఽ ఖండబిల్వీదళం వా**
**నానీతా పద్మమాలా సరసి వికసితా గంధపుష్పై స్త్వదర్థం**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

ప్రాతః కాలమున స్నానముచేసి నీ (శివున) కు నభిషేకము కొరకై గంగా జలమును తెచ్చి యెఱుంగను. పూజకై యొకప్పుడును అడవినుండి మారేడు దళములను

తెచ్చియెఱుంగను. నీకొఱకై గంధపుష్పములతో కూడ సరస్సునందు వికసించిన తామరపూల మాలను తేనైతిని. ఓ మహాదేవా! నా అపరాధమును మన్నింపుము.

**6. దుగ్ధై ర్మధ్వాజ్యయుక్తై ర్దధిసితసహితై స్స్నాపితం నైవ లింగం**
**నోలిప్తం చన్దనాద్యైః కనకవిరచితైః పూజితం న ప్రసూనైః**
**ధూపైః కర్పూరదీపై ర్వివిధరసయుతై ర్నైవ భక్ష్యోపహారైః**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

ఓ మహాదేవా! పాలు, తేనె, నెయ్యి, పెరుగు, పంచదార అను పంచా మృతములతో నీ లింగము నభిషేకించి యెఱుంగను. చందనము కస్తూరి మున్నగు సుగంధ ద్రవ్యములను నీ లింగమునకు పూసి యెఱుంగను. బంగారపు పూలతోను, ధూప దీపములతోను, షడ్రసోపేతములైన భక్ష్యముల నివేదనలతోను పూజించి యెఱుంగను. ఓ శివా! నా యపరాధమును మన్నింపుము.

**7. నో శక్యం స్మార్తకర్మ ప్రతిపదగహనం ప్రత్యవాయాకులాఢ్యే**
**శ్రౌతే వార్తా కథం మే ద్విజకుల విహితే బ్రహ్మమార్గానుసారే !**
**తత్త్వే జ్ఞాతే విచారే శ్రవణమననయోః కిం నిదిధ్యాసితవ్యం !**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

అడుగడుగున ప్రవేశింప శక్యముకాని స్మార్తకర్మ చేయనలవికానిది. ప్రత్యవాయములచే వ్యాకులమైన బ్రాహ్మణులకు విహితమైన శ్రౌతకర్మమాటగాని, సారభూతమైన బ్రహ్మతత్త్వ విచారము మాటగాని, శ్రవణ మనన నిది ధ్యానముల విషయముగాని చెప్పుటకే వీలుకాదు. ఓ మహాదేవా ! నా యపరాధమును మన్నింపుము.

**8. ధ్యాత్వా చిత్తే శివాఖ్యం ప్రచురతరధనం నైవ దత్తం ద్విజేభ్యో**
**హవ్యం తే లక్షసంఖ్యై ర్హుతవహవదనే నార్పితం బీజమంత్రైః**
**నోతప్తం గాంగతీరే వ్రతజపనియమై రుద్రజాప్యం న జప్తం**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

మనస్సునందు శివుని ధ్యానించి యధికమగు ధనమును బ్రాహ్మణులకు నొసంగ నైతిని. లక్షసంఖ్యాకముగ బీజాక్షరములతోను, మంత్రములతోను హవిస్సును నీ కొరకై అగ్నిముఖమున నర్పించియుండ లేదు. గంగానదీ తీరమున వ్రతములతోను, జపములతోను, నియమములతోను తపస్సు చేసియుండలేదు. రుద్రానువాకములను జపించియుండ లేదు. ఓ శివా! మహాదేవా! నా యపరాధమును మన్నించుము.

**9. నగ్నో నిస్సంగశుద్ధ స్త్రిగుణవిరహితో ధ్వస్తమోహాంధకారో**
**నాసాగ్రన్యస్తదృష్టి ర్విదితభవగుణో నైవ దృష్టః కదాచిత్**
**ఉన్మన్యావస్థయా త్వాం విగతగతిమతి శ్శంకరం న స్మరామి**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

ఓ శివా! దిగంబరుండనై విషయాసక్తి శూన్యతచే పరిశుద్ధుడనై త్రిగుణాతీతుడనై మోహాంధకారము నశింపగా నాసాగ్రమున దృష్టిని నిలిపి సృష్టి రహస్యము నెఱింగిన నిన్నొకప్పుడును చూచి యెఱుంగను. 'ఉన్మని' (మనస్సు లేకుండుట) యను అవస్థచే గమనాది శూన్యుడనై సుఖకరుడవైన నిన్ను స్మరింపనైతిని. ఓ మహాదేవా! నా యపరాధమును మన్నించుము.

**10. స్థిత్వా స్థానే సరోజే ప్రణవమయమరు త్కుమ్భితే సూక్ష్మమార్గే**
**శాన్తేస్వాన్తే ప్రలీనే ప్రకటిత విభవే దివ్యరూపే శివాఖ్యే**
**లింగాగ్రే బ్రహ్మవాక్యే సకలతనుగతం శంకరం న స్మరామి**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

పద్మాసనమున గూర్చుండి ఓంకారరూపమైన వాయువుచే సుషుమ్నా మార్గము పూరితముకాగా, మనస్సు ప్రశాంతమై యేకాగ్రము కాగా లింగాగ్రమున గాని, బ్రహ్మవాక్యమునగాని శివరూపమగు దివ్యరూపము గోచరించునట్లు సర్వ శరీరగతు డగు శంకరుని స్మరింపనైతిని. ఓ శివా! నా నేరమును మన్నింపుము.

**11. హృద్యం వేదాన్తవేద్యం హృదయసరసిజే దీప్త ముద్యత్ప్రకాశం**
**సత్యం శాంతస్వరూపం సకలముని మనః పద్మషండైక వేద్యమ్**
**జాగ్రత్స్వప్నే సుషుప్తౌ త్రిగుణవిరహితం శంకరం నస్మరామి**
**క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ! భో శ్రీ మహాదేవ! శంభో !**

మనోహరుడును, ఉపనిషద్వేద్యుడును, పెంపొందుచున్న కాంతి గలవాడును, సత్యరూపుడును, ప్రశాంతమైన రూపముగలవాడును, సమస్తమునుల మనః పద్మ సముదాయములకు గోచరమగువాడును, త్రిగుణాతీతుడును నగు శంకరుని జాగ్రదవస్థ యందుగాని, సుషుప్తి యందుగాని మనస్సునందు స్మరింపనైతిని. ఓ శివా! నా యపరాధమును మన్నింపుము.

**12. చంద్రోద్భాసిత శేఖరే స్మరహరే గంగాధరే శంకరే**
**సర్పై ర్భూషిత కంఠ కర్ణవివరే నేత్రోత్థవైశ్వానరే**
**దంతిత్వక్కృత సుందరాంబరధరే త్రైలోక్యసారే హరే**
**మోక్షార్థం కురు చిత్తవృత్తి మమలా మన్యైస్తు కిం కర్మభిః !**

చంద్రచూడుడును, కామహరుడును, గంగాధరుడును, సుఖకరుడును, కంఠము నందును-కర్ణములందును నాగాభరణముల దాల్చినవాడును, ముల్లోకములకు సారభూతుడును నగు శివునియందు నా బుద్ధి వృత్తిని ముక్తిని గోరి నిలుపుము. ఇతరములగు కర్మలచే నేమి ప్రయోజనము.

**13. కిం యానేన ధనేన వాజికరిభిః ప్రాప్తేన రాజ్యేన కిం ?**
**కింవా పుత్రకలత్ర మిత్ర పశుభి ర్దేహేన గేహేన కిం?**
**జ్ఞాత్వైతత్క్షణ భంగురం సపది రే త్యాజ్యం మనో దూరతః**
**స్వాత్మార్థం గురువాక్యతో భజ భజ! శ్రీ పార్వతీవల్లభమ్.**

ఓ మానసమా! వాహనములచేగాని, ధనముచేగాని, గుఱ్ఱములచేగాని, రాజ్యముచేగాని, పుత్ర, మిత్ర, కళత్రములచేగాని, పశువులచేగాని, శరీరముచేగాని, గృహముచేగాని యేమి ప్రయోజనము ? ఇవి యన్నియు క్షణభంగురములని తెలిసి కొని వెంటనే పూర్తిగ వదలి నీ క్షేమముకొఱకై గురూపదేశమువలన పార్వతీపతిని సేవింపుము.

**14. పౌరోహిత్యం రజనిచరితం గ్రామణీత్వం నియోగో**
**మాఠాపత్యం హ్యనృతవచనం సాక్షివాదః పరాన్నమ్**
**బ్రహ్మద్వేషః ఖలజనరతిః ప్రాణినాం నిర్దయత్వం**
**మా భూ దేవం మమ పశుపతే ! జన్మజన్మాంతరేషు.**

ఓ పశుపతీ! పౌరోహిత్యము, రాత్రిజాగరణము, గ్రామాధిపత్యము, నియోగము, మఠాధిపత్యము, అసత్యము పలుకుట, సాక్ష్యము చెప్పుట, పరాన్న భోజనము, బ్రాహ్మణద్వేషము, దుర్జన సాంగత్యము, ప్రాణులయందు దయ లేకపోవుట యనునవి నాకు జన్మజన్మాంతరముల యందును కలుగకుండు గాక !

**15. ఆయు ర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యౌవనం**
**ప్రత్యాయాన్తి గతాః పునర్న దివసాః కాలో జగద్భక్షకః**
**లక్ష్మీస్తోయ తరఙ్గ భఙ్గ చపలా విద్యుచ్చలం జీవితం**
**తస్మా న్మాం శరణాగతం కరుణయా త్వం రక్ష మామధునా.**

చూచుచుండగనే దినదినము ఆయువు నశించుచున్నది. పడుచుతనము నశించుచున్నది. గడిచిన రోజులు తిరిగి రావు. కాలము జగత్తును భక్షించును. సంపద నీటి తరంగమువలె చంచలమైనది. జీవితము మెఱపుతీగవలె నశ్వరమైనది. కావున ఓ దేవా ! నిన్ను శరణు పొందిన నన్ను దయతో తప్పక కాపాడుము.

***ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పాద కృతం శివాపరాధ క్షమాపణ స్తోత్రం సంపూర్ణం.***

# శివషడక్షరీ స్తోత్రమ్/ పంచాంగ రుద్రధ్యానమ్

**ఓం,**

**ఓంకారమంత్రసంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః**
**కామదం మోక్షదం తస్మై 'ఓం' కారాయ నమో నమః 1**

ప్రతి నిత్యము యోగిపుంగవులు ధ్యానించెడు "ఓం" కార బిందు సహితమగు, కోర్కెలను అనుగ్రహించు, మోక్షము నొసంగు 'ఓం' కార రూపుడగు పరమశివునికి నమస్కారము.

**ఓం నం,**

**నమస్తే దేవదేవేశ నమస్తే పరమేశ్వర ।**
**నమస్తే వృషభారూఢ 'న' కారాయ నమో నమః 2**

సకల మునులు నమస్కరించు, సమస్త అప్సరసగణము నమస్కరించెడు, మానవులు నమస్కరించు 'న' కార స్వరూపుడగు దేవదేవునికి నమస్కారము.

**ఓం మం,**

**మహాదేవం మహాత్మానం మహాపాతక నాశనం ।**
**మహాపాపహరం వందే 'మ' కారాయ నమో నమః 3**

మహోన్నతమగు తత్త్వ స్వరూపుడు, మహాదేవునికి ప్రియుడు, పరమమగు జ్ఞానమును బసంగెడు, మహా పాపములను హరింప చేయు 'మ' కార స్వరూపుడగు పరమ శివునికి నమస్కరించెదను.

**ఓం శిం,**

**శివం శాంతం జగన్నాథం లోకానుగ్రహ కారణం ।**
**శివమేకం పరం వందే 'శి' కారాయ నమో నమః 4**

మంగళ స్వరూపుడైన, శాంత స్వభావము కలిగిన, మంగళ మగు ఆకారము కలిగిన, శుభములకు అనుగ్రహ కారకుడగు, వరిష్టమగు, కేవలము శివ స్వరూపము కలిగిన 'శి' కార రూపుడగు పార్వతీశునికి నమస్కారము.

**ఓం వాం,**

**వాహనం వృషభోయస్య వాసుకీః కంఠభూషణం ।**
**వామే శక్తిధరం వందే 'వ' కారాయ నమో నమః 5**

వృషభము వాహనముగా కలిగిన, వాసుకి అను సర్పరాజును మెడ యందు భూషణముగా ధరించిన, వామ భాగమున శక్తిని ఉంచుకొనిన దేవ దేవుడగు 'వ' కార స్వరూపుడగు పరమశివునికి నమస్కారము.

**ఓం యం,**

**యత్ర కుత్ర స్థితం దేవం సర్వవ్యాపిన మీశ్వరం ।**

**యల్లింగం పూజయే న్నిత్యం 'య' కారాయ నమోనమః । 6**

'య' కారము నందు సుస్థిర స్థానము కలిగిన, ఏ 'య' కారము పరమ మంగళ కరమైనదో ఎవని రూపము ప్రతి నిత్యము పరమానందమును కలుగచేయునో ఆ 'య' కార స్వరూపుడగు పార్వతీ వల్లభునికి నమస్కారము.

**షడక్షర మిదం స్తోత్రం యః పఠేచ్ఛివ సన్నిధౌ ।**

**తస్య మృత్యుభయం నాస్తి హ్యపమృత్యుభయం కుతః ॥ 7**

షడక్షరములతో కూడిన ఈ మంగళ స్తుతిని శివుని సన్నిధి యందు పఠించువారలకు మృతుభయము ఉండనే ఉండదు. ఇక అప మృత్యువు గూర్చి చింతఏల ? (అనగా అపమృత్యు భయము గూర్చి విచారించవలసిన పనిలేదు.)

*శ్రీ మచ్ఛంకరభగవత్పాదపూజ్యకృత శివషడక్షరీ స్తోత్రమ్ సంపూర్ణమ్.*

## కృష్ణా ష్టకమ్

**1. శ్రియా శ్లిష్టో విష్ణుః స్థిర చరగురుర్వేదవిషయో**
**ధియాం సాక్షీ శుద్ధో హరిరసురహన్తాబ్జనయనః**
**గదీ శంఖీ చక్రీ విమల వనమాలీ స్థిరరుచిః**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షి విషయః ॥**

లక్ష్మీ దేవిచే ఆలింగితుఁడు, సర్వవ్యాపకుడు, స్థావర జంగమములైన పదార్థములకు గురువు, వేదవేద్యుఁడు, ప్రాణుల బుద్ధులకు సాక్షియైనవాఁడు, నిత్యశుద్ధుడు, హరియై రాక్షసులను సంహరించువాఁడు, పుండరీకాక్షుఁడు, గదను ధరించినవాఁడు, శంఖమును – చక్రమును చేఁతఁబట్టినవాఁడు, స్వచ్ఛమైన వనమాలను దాల్చినవాడు, స్థిరమైన కాంతి గలవాఁడు, శరణాగత రక్షకుఁడు, సకలలోకాధిపతియు అగు కృష్ణుడు కన్నులకుఁ గానవచ్చుఁ గాక !

**2. యత స్సర్వం జాతం వియ దనిల ముఖ్యం జగదిదం**
**స్థితౌ నిశ్శేషం యోఽవతి నిజసుఖాం శేన మధుహా**
**లయే సర్వం స్వస్మి న్హరతి కలయా యస్తుస విభుః**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః ॥**

ఎవనివలన ఆకాశము, వాయువు మొదలయిన సమస్తమయిన యీ జగత్తు పుట్టినదో, మధుసూదనుఁడై తన సుఖాంశముచే స్థితి సమయములో ఎవఁడు నిశ్శేషముగ రక్షించునో, లయ సమయమునందు తన యంశచే సమస్తమును తనయందే లీనము చేయునో, వ్యాపకుడు శరణాగత రక్షకుఁడు లోకాధిపతియు నైన ఆ శ్రీకృష్ణుఁడు నా కన్నులకుఁ గానవచ్చుఁ గాక !

**3. అసూనాయమ్యాదౌ యమనియమ ముఖ్యైస్సుకరణై**
**ర్నిరు ధ్యేదం చిత్తం హృది విమయ మానీయ సకలమ్**
**యమీడ్యం పశ్యన్తి ప్రవరమతయో మాయినమసౌ**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః ॥**

శ్రేష్ఠమైన బుద్ధిగలవారు యమ నియమ ప్రధానములగు సాధనములచే ముందుగ ప్రాణాధి వాయువులను నిరోధించి, చిత్తమును నిరోధించి, హృదయమునందు అఖండుడును, నిర్మలుడును, స్తుత్యుడును, మాయావియు నగు నెవని జూతురో శరణాగత రక్షకుఁడు లోకాధిపతియైన ఆ కృష్ణుఁడు నా కన్నులకు గోచరించుఁ గాక !

**4. పృథివ్యాం తిష్ఠన్యో యమయతి మహీం వేద న ధరా**
**యమిత్యాదౌ వేదో వదతి జగతా మీశ మమలమ్**
**నియన్తారం ధ్యేయం మునిసురనృణాం మోక్షద మసౌ**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షివిషయః ॥**

ఎవడు భూమియందుండినవాఁడై భూమిని నియమించునో, ఎవనిని భూమి ఎఱుఁగదో అని నిర్మలుఁడు, జగదీశుడు, సకల జగన్నియన్తయు, మునులకు-దేవతలకు-మనుష్యులకు మోక్షము నిచ్చు నిట్టి యే దేవునిగూర్చి వేదమిట్లు తెలుపు చున్నదో శరణాగత రక్షకుఁడు సకలలోకాధిపతి యగు ఆ కృష్ణుఁడు నాకు దృగ్గో చరుఁడగుఁ గాక !

**5. మహేంద్రాది ర్దేవో జయతి దితిజాన్యస్య బలతో**
**న కస్య స్వాతంత్ర్యం క్వచిదపి కృతౌయత్కృతి మృతే**
**బలారాతేర్గర్వం పరిహరతి యోఽసౌ విజయినః**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షి విషయః ॥**

మహేంద్రుఁడు మొదలైన దేవతలు ఎవని బలమువలన రాక్షసులను జయించు చున్నారో, ఎవని యత్నము లేక యెవ్వనికి ఏ పనియందును స్వాతంత్ర్యము లేదో, విజయశాలియైన దేవేంద్రుని గర్వము నెవఁడు దూరముచేయునో శరణాగత రక్షకుడు సకల లోకాధిపతి యగు ఆ కృష్ణుఁడు నాకు కన్నులకుఁ గోచరించుఁ గాక !

**6.** **వినా యస్య ధ్యానం వ్రజతి పశుతాం సూకరముఖాం**
**వినా యస్య జ్ఞానం జననమృతిభయం యాతి జనతా**
**వినా యస్య స్మృత్యా కృమిశతజనిం యాతి స విభుః**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షి విషయః ॥**

జనసమూహము ఎవని ధ్యానము లేక పోవుటవలన సూకరము (పంది, కుక్క) మొదలయిన పశుత్వమును పొందునో, యెవని జ్ఞానము లేకున్న జననమరణ భయమును పొందు చున్నదో, ఎవ్వని స్మరింపకున్న వందలకొలది పురుగులు జన్మలెత్తునో శరణాగత రక్షకుడు సకల లోకాధిపతి యగు ఆ కృష్ణుఁడు నా కన్నులకు గోచరించు గాక !

**7.** **నరాతంకోట్టంకః శరణశరణో భ్రాన్తిహరణో**
**ఘనశ్యామో వామో వ్రజశిశువయస్యోఽర్జునసఖః**
**స్వయంభూర్భూతానాం జనక ఉచితాచారసుఖదః**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షి విషయః ॥**

నరుల భీతిని పోగొట్టుటలో సమ్మెటయైనవాఁడు, రక్షించువారికిని రక్షకమయినవాడు, భ్రాంతిని తొలగించువాఁడు, నీల మేఘ శ్యామలమయిన వాఁడు, సుందరుఁడు, గొల్లపిల్లలకు స్నేహితుఁడు, అర్జునసఖుఁడు, స్వయముగా పుట్టినవాడు, ప్రాణులకు జనకుఁడు, తగిన ఆచారము నిచ్చి సుఖము నిచ్చువాఁడు, శరణాగత రక్షకుడు, సకల లోకాధిపతియు అగు ఆ కృష్ణుఁడు నాకు దృగ్గోచరుఁడగు గాక !

**8.** **యదాధర్మగ్లాని ర్భవతి జగతాం క్షోభకరణీ**
**తదా లోకస్వామీ ప్రకటితవపుః స్సేతుధృదజః**
**సతాం ధాతా స్వచ్ఛో నిగమగణగీతో వ్రజపతిః**
**శరణ్యో లోకేశో మమ భవతు కృష్ణోఽక్షి విషయః ॥**

ఎప్పుడు లోకములను కల్లోలపఱచు ధర్మగ్లాని కలుగునో అప్పుడు సకల లోకాధిపతి ధర్మ సేతువును నిర్మించువాఁడై అజుఁడు (పుట్టనివాఁడు) అయ్యును శరీరము దాల్చినవాఁడగును. సత్పురుషులకు సకలమును గూర్చువాఁడు, నిర్మలుఁడు, వేదవేదాంగ సమూహముచే కీర్తింపఁబడువాఁడు, వ్రజపతియు శరణాగత రక్షకుఁడు సకల లోకాధిపతియైన ఆ శ్రీ కృష్ణుడు నాకు కన్నులకుఁ గానవచ్చుఁగాక !

**ఇతి శ్రీ మచ్ఛంకరభగవత్పాద కృతం కృష్ణాష్టకం సంపూర్ణమ్.**



# అచ్యుతాష్టకమ్

1. **అచ్యుతం కేశవం రామ నారాయణం**
   **కృష్ణ దామోదరం వాసుదేవం హరిమ్**
   **శ్రీధరం మాధవం గోపికా వల్లభం**
   **జానకీ నాయకం రామచంద్రం భజే ॥**

స్వరూప స్వభావములచే నాశనములేనివాడును, కేశి యను రాక్షసుని సంహరించిన వాడును, యోగుల హృదయములకు విశ్రాంతి స్థానమైనవాడును, నరులకు గమ్య స్థానమైనవాడును, భక్తుల పాపములను పోగొట్టువాడును, కుక్షి యందు సమస్త లోకములు గలవాడు, ప్రపంచము నంతను కప్పియుండువాడును, స్మరణ మాత్రముచే పాపములను హరించువాడును, లక్ష్మిని ధరించినవాడును, యదుకులమును బుట్టిన వాడును, గోపికలకు ప్రియుడును, జానకీ పతియు నగు శ్రీరామచంద్రుని సేవింతును.

2. **అచ్యుతం కేశవం సత్యభామాధవం**
   **మాధవం శ్రీధరం రాధికారాధితమ్**
   **ఇందిరామందిరం చేతసా సుందరం**
   **దేవకీనందనం నందజం సందధే ॥**

పుట్టుక మొదలగు వికారములు లేనివాడును, కేశి యను రాక్షసుని సంహరించిన వాఁడును, సత్యభామాపతియును, లక్ష్మీనాథుడును, లక్ష్మిని (వక్షస్థలమున) దాల్చినవాడును, రాథా దేవిచే ఆరాధింపబడినవాడును, లక్ష్మికి నిలయమైనవాడును, సుందరమైనవాడును, దేవకీ దేవిని ఆనందింపజేయువాడును, నందకుమారుడును నగు శ్రీ కృష్ణుని మనసుచే ధ్యానింతును.

3. **విష్ణవే జిష్ణవే శంఖినే చక్రిణే**
   **రుక్మిణీ రాగిణే జానకీ జానయే**
   **వల్లవీ వల్లభా యార్చితా యాత్మనే**
   **కంస విధ్వంసినే వంశినే తే నమః ॥**

సర్వవ్యాపకుడును, జయశీలుడును, ప్రశస్తములైన శంఖ చక్రములను ధరించిన వాడును, రుక్మిణీ దేవి యందనురాగము గలవాడును, సీతాపతియు, గోపికా ప్రియుడును, పూజ్యుడును, ఆ పరమాత్మ రూపుడును, కంసుని చంపినవాడును, వేణువును ధరించినవాడును నగు నీకు నమస్కారము.

**4. కృష్ణ ! గోవింద! హే రామ! నారాయణ!**
**శ్రీపతే! వాసు దేవాజిత! శ్రీనిధే !**
**అచ్యుతానన్త! హే మాధవాధోక్షజ !**
**ద్వారకా నాయక! ద్రౌపదీ రక్షక ! ॥**

ఓ కృష్ణా! గోవిందా! రామా! నారాయణా! లక్ష్మీపతీ! వసుదేవపుత్రా! లేక సమస్త జగదాధారమైన దేవా! ఇతరులకు జయింప నలవికానివాడా! సిరికి నిలయమైనవాడా! అచ్యుతా- నాశనము లేనివాడా! మాధవా-బహిర్ముఖములగు ఇంద్రియములకు గోచరము కానివాడా! ద్వారకా పట్టణమునకు నాయకా, ద్రౌపదిని రక్షించిన ఓ అచ్యుతా ! నీకు నమస్కారము.

**5. రాక్షసైః క్షోభితస్సీతయా శోభితో**
**దండకారణ్య భూపుణ్యతా కారణమ్**
**లక్ష్మణే నాన్వితో వానరై స్సేవితోఽ**
**గస్త్య సంపూజితో రాఘవః పాతు మామ్ ॥**

రాక్షసులచే కలతనొందింపబడిన వాడును, సీతాదేవితో ప్రకాశమానుడును, దండకారణ్య ప్రదేశముయొక్క పవిత్రతకు కారణమైనవాడును, లక్ష్మణునిచే ననుస రింపబడినవాడును, వానరులచే సేవింపబడినవాడును, అగస్త్య మునిచే మిక్కిలి పూజింపబడినవాడును, రఘువంశ సంజాతుడును నగు శ్రీ రామచంద్రమూర్తి నన్ను రక్షించుగాక !

**6. ధేనుకారిష్టహా నిష్టకృద్ద్వేషిణాం**
**కేశిహా కంస హృద్వంశికా వాదకః**
**పూతనా కోపకః సూరజా ఖేలనో**
**బాల గోపాలకః పాతు మాం సర్వదా ॥**

గోవుల కష్టములు పారద్రోలినవాడును, శత్రువుల కప్రియమును చేయువాడును, కేశి యను రాక్షసుని సంహరించినవాడును, కంసుని హరించిన (చంపిన) వాడును, వేణువాదన తత్పరుడును, పూతన యను రాక్షసిని కోపించినవాడును, యమునా నది యందు క్రీడించువాడును నగు బాలగోపాల కృష్ణుడు నన్ను ఎల్లప్పుడు రక్షించుగాక !

**7. విద్యుదుద్యోతవ త్ప్రస్ఫుర ద్వాససం**
**ప్రావృడ మ్భోదవ త్ప్రోల్లస ద్విగ్రహమ్**
**వన్యయా మాలయా శోభితో రఃస్థలం**
**లోహితాంఘ్రిద్వయం వారిజాక్షం భజే ॥**

మెఱుపుయొక్క ప్రకాశమువలె మిక్కిలి ప్రకాశించు వస్త్రము కలవాడును, వర్షాకాలపు మేఘమువలె మిక్కిలి ప్రకాశించు శరీరము గలవాడును, వనసంజాతములైన పుష్పాదుల యొక్క దండచే ప్రకాశింపజేయబడిన వక్షస్థలము కలవాడును, ఎఱ్ఱని పాదయుగ్మము కలవాడును. పద్మములవంటి నేత్రములు గలవాడును నగు పుండరీకాక్షుని సేవింతును.

**8. కుంచితైః కుంతలై ర్భ్రాజమానాననం**
**రత్నమౌలిం లసత్కుండలం గండయోః**
**హార కేయూరకం కంకణ ప్రోజ్జ్వలం**
**కింకిణీ మంజులం శ్యామలం తం భజే ॥**

వంకరలు తిరిగిన ముంగురులచే ప్రకాశించుచున్న ముఖము గలవాడును, రత్నమును శిరస్సున ధరించినవాడును, చెక్కిళ్ళయందు ప్రకాశమానములగు కర్ణాలంకారములు గలవాడును, ముత్యాలహారములతోను, బాహుపురులతోను, కంకణములతోను మిక్కిలి ప్రకాశించువాడును, చిఱుమువ్వలచే మనోహరమైనవాడును నగు ఆ నల్లని వానిని (శ్యామసుందరుని) సేవింతును.

**9. అచ్యుతస్యాష్టకం యః పఠే దిష్టదం**
**ప్రేమతః ప్రత్యహం పూరుషః సస్పృహమ్**
**వృత్తతః సున్దరం వేద్య విశ్వంభరం**
**తస్య వశ్యో హరిర్జాయతే సత్వరమ్ ॥**

పద్యవృత్తములచే నందమైనదియు, విష్ణు తత్త్వమును తెలుపునదియు, కోరికల నొసంగునదియు నగు అచ్యుతాష్టకమును శ్రద్ధాభక్తులతో ప్రతిదినము నెవడు పఠించునో అతనికి వెంటనే శ్రీహరి వశుడగును.

**ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతమ్ అచ్యుతాష్టకం సంపూర్ణమ్.**



# పాండురంగాష్టకమ్

1. మహాయోగపీఠే తటే భీమరథ్యా
   వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః
   సమాగత్య తిష్ఠంతమానందకందం
   పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥

భీమ నధియొద్దన యోగపీఠమందు పుండరీకునికి వరము లొసంగ మునీంద్రు లందరితో వచ్చి నిలిచిన యానందమూలమైన పరబ్రహ్మమూర్తియైన పాండురంగని భజింతును.

2. తటిద్వాససం నీలమేఘావభాసం
   రమామందిరం సుందరం చిత్ప్రకాశమ్
   పరం త్విష్టకాయాం సమన్యస్తపాదం
   పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥

మెఱుపువలె మెఱయు వలువ దాలిచి, నీల మేఘమువలె నలరుచు, లక్ష్మీ నివాసమై మనోహరమై చిత్ప్రకాశమై ఒకానొక యిటుకరాతిపై పాదములను సమముగ నుంచి నిలచియున్న పరబ్రహ్మమూర్తియైన పాండురంగని భజించెదను.

3. ప్రమాణం భవాబ్ధేరిదం మామకానాం
   నితంబః కరాభ్యాం ధృతో యేన తస్మాత్
   విధాతు ర్వసత్యై ధృతో నాభికోశ ః
   పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥

నా భక్తులకు సంసార మిదిగో యింతపాటిది అనుచు దెలుపుటకో యన్నట్లు తన నడుముం దాను రెండు చేతులం బొదివి పట్టుకొని బ్రహ్మ నిలుచుటకునై నాభి కమలముం దాల్చియున్న పరబ్రహ్మమూర్తిని పాండురంగని భజించెదను.

4. స్ఫురత్కౌస్తుభాలంకృతం కంఠ దేశే
   శ్రియా జుష్ట కేయూరకం శ్రీనివాసమ్
   శివం శాంతమీడ్యం వరం లోకపాలం
   పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥

కంఠముందు కౌస్తుభమణిదాల్చి, శోభతో గూడిన భుజకీర్తులు మెఱయ సిరికి నివాసమైనవాడు, మంగళ స్వరూపుడు, శాంతుడు పొగడదగినవాడు శ్రేష్ఠుడును, జగద్రక్షకుడునై పరబ్రహ్మమూర్తియైన పాండురంగని భజించెదను.

**5. శరచ్చంద్రబింబాననం చారుహాసం**
**లసత్కుండలాక్రాంత గండస్థలాంతమ్**
**జపారాగబింబాధరం కంజనేత్రం**
**పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥**

శరత్కాల చంద్రబింబమువంటి మోము, చక్కని నవ్వు, కుండలములచే నలరారు గండస్థలములు, జపా (దాసాని) కుసుమమువలె నెఱ్ఱనగు దొండపండు వంటి పెదవి, తామర రేకులం బోలు కన్నులు గలిగియున్న పరబ్రహ్మమూర్తియైన పాండురంగని భజించెదను.

**6. కిరీటోజ్జ్వలత్సర్వ దిక్ప్రాంతభాగం**
**సురైరర్చితం దివ్యరత్నై రనర్ఘైః**
**త్రిభంగాకృతిం బర్హమాల్యావతంసం**
**పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥**

కిరీట కాంతులచే నలుదెసలు మిరుమిట్లు గొలుపుచు, అమూల్య దివ్యరత్న ములచే, దేవతలచే నర్చింపబడుచు త్రిభంగిగ (మెడ, నడుము, పాదము వంపుగా జేసి) నిలిచి, నెమిలి పింఛమును, మాలను దాల్చియున్న పరబ్రహ్మమూర్తియగు పాండురంగని భజించెదను.

**7. విభుం వేణునాదం చరంతం దురంతం**
**స్వయం లీలయా గోపవేషం దధానమ్**
**గవాం బృందకానందదం చారుహాసం**
**పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥**

వేణువు నూదుచు లీలాగోపాలబాలక మూర్తియై బృందావన వీధుల గోబృందముం గాచుచుండు పరబ్రహ్మమూర్తి యగు పాండురంగని భజించెదను.

**8. అజం రుక్మిణీ ప్రాణసంజీవనం తం**
**పరంధామ కైవల్యమేకం తురీయమ్**
**ప్రసన్నం ప్రపన్నార్తిహం దేవ దేవం**
**పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥**

రుక్మిణీ ప్రాణవల్లభుని కైవల్యానామక పరమ తేజమును, తురీయము నైన దైవమును, ప్రసన్నుడును, ప్రపన్నుల బాధల హరించు దేవదేవుని, పరబ్రహ్మమూర్తి యగు పాండురంగని గొలిచెదను.

**9. స్తవం పాండురంగస్య నైపుణ్యదం యే**
**పఠంత్యేకచిత్తేన భక్త్యా చ నిత్యమ్**
**భవాంభోనిధిం తే తు తీర్త్వాంత కాలే**
**హరేరాలయం శాశ్వతం ప్రాప్నువంతి ॥**

పుణ్యప్రదమగు పాండురంగ స్తోత్రమును భక్తితో ఏకాగ్రచిత్తులై పఠించు వారు సంసార సముద్రమును దాటి అవసానమునందు శాశ్వతమగు వైకుంఠమును చేరుదురు.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతమ్ పాండురంగాష్టకం సంపూర్ణమ్.***

## హనుమత్పంచరత్నమ్

**1. వీతాఖిల విషయేచ్ఛం**
**జాతానందాశ్రు పులకమత్యచ్ఛమ్**
**సీతాపతి దూతాద్యం**
**వాతాత్మజమద్య భావయే హృద్యమ్ ॥**

భోగ్యపదార్థము లన్నిటియందు ఇచ్ఛపోయినవాఁడు, ఆనందముచే కన్నీరు పులకాంకురములు కలిగినవాడు, మిక్కిలి స్వచ్ఛహృదయము గలవాఁడు, సీతాపతి యయిన రామచంద్రుని దూతలలో మొదటివాఁడు, మనోహరుడు అగు వాయుపుత్రుని భావించెదను.

**2. తరుణారుణ ముఖకమలం**
**కరుణారసపూర పూరితాపాఙ్గమ్**
**సంజీవనమాశాసే**
**మంజుల మహిమానమంజనాభాగ్యమ్ ॥**

లేఁత సూర్యునివంటి ముఖపద్మము కలవాఁడు, దయారస ప్రవాహముతో నింపఁ బడిన క్రీగంటి చూపుగలవాఁడు, సకల లోకములు జీవింపఁజేయువాఁడు, మృదువయిన మహిమ గలవాఁడు అగు అంజనాసుతుని కోరెదను.

**3. శంబరవైరి శరాతిగ**
**మంబుజదళ విపుల లోచనోదారమ్**
**కంబుగలమనిలదిష్టం**
**బింబజ్వలితోష్ఠమేకమవలంబే ॥**

మన్మథ బాణములను మీఱినవాడు, పద్మదళములవలె విస్తారమయిన కన్నులతో మించినవాఁడు, శంఖమువంటి కంఠము గలవాఁడు, వాయుదేవుని భాగ్యమైన వాఁడు, దొండపండువలె ప్రకాశించు క్రింది పెదవి గలవాఁడు లేక సూర్యబింబముచే తపింప జేయబడిన పెదవులు గలవాఁడు, అద్వితీయుడయిన పవనసుతుని నేను సేవించెదను.

**4. దూరీకృత సీతార్తిః**
**ప్రకటీకృత రామవైభవ స్ఫూర్తిః**
**దారిత దశముఖ కీర్తిః**
**పురతో మమ భాతు హనుమతో మూర్తిః ॥**

సీతాదేవికి గల ఆర్తిని తొలగించినది, శ్రీ రామచంద్రుని వైభవ విశేషమును ప్రకటించునది, రావణాసురుని కీర్తిని చీల్చి వేసినది అగు హనుమంతమూర్తి నాయెదుట భాసించుగాఁక !

**5. వానర నికరాధ్యక్షం**
**దానవకుల కుముద రవికర సదృశమ్**
**దీనజనావన దీక్షం**
**పవన తపఃపాక పుంజమద్రాక్షమ్ ॥**

వానర సమూహమునకు అధ్యక్షుఁడైనవాఁడు, రాక్షస సమూహములనెడు కలువలకు సూర్యకిరణములతో సమానమైనవాఁడు (రాక్షస కులము నణచివేయువాఁడు), దీన జనులను రక్షించెడి దీక్ష గలవాఁడు, వాయువు చేసిన తపఃఫలముగా వెలసిన వాడగు హనుమంతుని చూచినాను.

**6. ఏత త్పవనసుతస్య**
**స్తోత్రం యః పఠతి పఞ్చరత్నాఖ్యమ్**
**చిరమిహ నిఖిలాన్భోగా**
**న్భుక్త్వా శ్రీరామ భక్తి భాగ్భవతి ॥**

వాయుసుతునకు చెందిన పంచరత్న మను నీ స్తోత్రము నెవడు చదువునో అతడు చిరకాల మీలోకమున భోగము లనుభవించి శ్రీరామ భక్తి కలవాడగును.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం హనుమత్పంచరత్నం సంపూర్ణమ్.***

## శ్రీరామ భుజంగ ప్రయాత స్తోత్రమ్

**1. విశుద్ధం పరం సచ్చిదానందరూపం**
**గుణాధారమాధారహీనం వరేణ్యమ్**
**మహాన్తం విభాన్తం గుహాన్తం గుణాన్తం**
**సుఖాన్తం స్వయం రామధామ ప్రపద్యే ॥**

నిత్యశుద్ధుఁడు అన్నిటికంటె పరమయినవాఁడు, సచ్చిదానంద స్వరూపుఁడు, సకలగుణముల కాధారమైనవాఁడు, తన కే యాధారము లేనివాఁడు, అందఱకు సేవింపఁ దగినవాఁడు, అన్నిటికంటె గొప్పవాఁడయి ప్రకాశించువాఁడు, అజ్ఞానమును నశింపఁ జేయువాఁడు, త్రిగుణాతీతుఁడు, సుఖమునకు పరాకాష్ఠయైనవాఁడు అగు శ్రీరాముఁడను స్వయం జ్యోతి స్స్వరూపుని ఆశ్రయింతును.

**2. శివం నిత్యమేకం విభుం తారకాఖ్యం**
**సుఖాకారమాకార శూన్యం వరేణ్యమ్**
**మహేశం కలేశం సురేశం పరేశం**
**నరేశం నిరీశం మహీశం ప్రపద్యే !**

మంగళ స్వరూపుఁడు, నిత్యుఁడు, అద్వితీయుఁడు, సర్వవ్యాపకుఁడు, తారక నామముగలవాఁడు, సుఖ స్వరూపుఁడు, ఆకారములేనివాఁడు, వరింపఁదగినవాఁడు, గొప్ప ప్రభువు, కళలకు ప్రభువు, దేవతలకు ప్రభువు, అన్నిటికంటె పరమయిన ప్రభువు, మనుష్యులందఱకు ప్రభువు, తన్ను నియమించు ప్రభువు లేనివాఁడు, భూమి కంతటికి ప్రభువు అయిన రాముని ఆశ్రయింతును.

**3. యదావర్తయేత్ కర్ణ మూలేఽన్త కాలే**
**శివో రామ రామేతి రామేతి కాశ్యామ్**
**తదేకం పరం తారక బ్రహ్మరూపం**
**భజేఽహం భజఽహం భజేఽహం భజేఽహమ్ ॥**

కాశిలో మరణించిన ప్రాణికి చెవిలో అవసానకాలమున విశ్వేశ్వరుడు మూడుమాఱులు రామ రామ రామ యని దేని నుపదేశించునో అట్టి బ్రహ్మరూపమైన తారక మంత్రమును నేను సేవింతును.

**4. మహారత్న పీఠే శుభే కల్పమూలే**
**సుఖాసీనమాదిత్యకోటి ప్రకాశమ్**
**సదా జానకీ లక్ష్మణోపేత మేకం**
**ముదా రామచంద్రం భజేఽహం భజేఽహం ॥**

మంగళకరమయిన కల్పవృక్షమూలమున మహారత్న ఖచితమైన పీఠమునందు సుఖముగా కూర్చుండి, కోటి సూర్యసమానమయిన తేజస్సుగలిగి, యెల్లప్పుడు సీతా లక్ష్మణులతో కూడియుండి, అద్వితీయుఁడైన శ్రీరామచంద్రుని నే నెల్లప్పుడు సేవించెదను, సేవించెదను.

**5. క్వణద్రత్న మంజీర పాదారవిందం**
**లస న్మేఖలా చారు పీతాంబరాఢ్యమ్**
**మహారత్న హారోల్లసత్కౌస్తుభాంగం**
**నద చ్చంచరీ మంజరీ లోల మాలమ్ ॥**

చిఱుగంటలు మ్రోఁగు రత్నపుటందెలు గల పాదపద్మములుగలవాడు, తళ తళలాడు మొలనూలుచే అందమయిన పీతాంబరమును దాల్చినవాఁడు, గొప్ప రత్న హారములతో ప్రకాశించుచున్న కౌస్తుభమణి ధరించినవాఁడు, రొదచేయు తుమ్మెదలు గల పూలగుత్తులతో తూగు మాలలు ధరించినవాఁడు అగు శ్రీరామచంద్రుని సేవించెదను.

**6. లస చ్చంద్రికా స్మేర శోణాధరాభం**
**సముద్య త్పతంగేందుకోటి ప్రకాశమ్**
**నమద్బ్రహ్మ రుద్రాది కోటీర రత్న**
**ప్రభాపూర నీరాజనారాధితాంఘ్రిమ్ ॥**

వెన్నెలవంటి మందహాసముతోఁగూడిన యెఱ్ఱని క్రింది పెదవి కాంతి కలవాడు, ఉదయించిన కోటి సూర్యచంద్రుల కాంతి గలవాఁడు, నమస్కరించుచున్న బ్రహ్మరుద్రేంద్రుల కిరీటములందలి రత్నకాంతుల సముదాయ మనెడి నీరాజనముచే ఆరాధింపఁబడు పాదములుగలవాడు నగు శ్రీ రామచంద్రుని భజింతును.

**7. పురః ప్రాంజలీ నాంజనేయాది భక్తాన్**
**స్వచిన్ముద్రయా భద్రయా బోధయంతమ్**
**భజేఽహం భజేఽహం సదా రామచంద్రం**
**త్వదన్యం న మన్యే న మన్యే న మన్యే ॥**

ఎదురుగ దోసిలు లొగ్గి యున్న ఆంజనేయుఁడు మొదలయిన భక్తులకు మంగళ స్వరూపమయిన తన జ్ఞాన ముద్రచే ఉపదేశించుచున్న శ్రీరామచంద్రుని నే నెల్లప్పుడు సేవించెదను. శ్రీ రామచంద్రా! నిన్ను గాక మఱి యొకని ముమ్మాటికిని దలపోయను.

**8. యదా మత్సమీపం కృతాంతః స్సమేత్య**
**ప్రచండ ప్రకోపై ర్భటై ర్భీషయే న్మామ్**
**తదావిష్కరోషి త్వదీయం స్వరూపం**
**సదాపత్ప్రణాశం స కోదండబాణమ్ ॥**

యముఁ డేనాఁడు నా దగ్గఱకు వచ్చి తీవ్ర కోపము గల భటులచే నన్ను భయ పెట్టునో, ఆనాడు ఆపదలనెప్పుడు పోగొట్టునది ధనుర్బాణములను ధరించునది యగు నీ స్వరూపమును ప్రకటించెదవు రామా.

**9. నిజే మానసే మందిరే సన్ని ధేహి!**
**ప్రసీద ప్రసీద ప్రభో! రామచంద్ర**
**ససౌమిత్రిణా కైకయీ నందనేన**
**స్వశక్త్యానుభక్త్యా చ సంసేవ్యమాన! ॥**

లక్ష్మణునితో గూడిన భరతునిచే స్వశక్తితోను, సుభ క్తితోను సేవింపబడు ప్రభూ! రామచంద్రా! నా మనోమందిరములోనికి వేంచేయుము, నా యెడల ప్రసన్నుఁడవు కమ్ము.

**10. స్వభక్తాగ్రగణ్యైః కపీశైర్మహీశై**
**రనీకైరనేకైశ్చ రామ! ప్రసీద!**
**నమస్తే నమోఽ స్త్వీశ! రామ! ప్రసీద !**
**ప్రశాధి! ప్రశాధి! ప్రపన్నం ప్రభో! మామ్ ॥**

శ్రీరామా! నీ భక్తులలో అగ్రగణ్యులయిన వానరాధిపతులతోను, భూపతులతోను, అనేకములయిన సైన్యములతోను గూడి ప్రసన్నుఁడవగుము, నీకు నమస్కారము. ఈశ్వరా! నీకు నమస్కారము, రామా! ప్రసన్నుఁడవగుము. ప్రభూ! శరణాగతుడనయిన నన్ను శాసింపుము.

**11. త్వ మేవాసి దైవం వరం మే యదేకం**
**సుచైతన్యమేతత్త్వదన్యం న మన్యే**
**యతోఽభూదమేయం వియ ద్వాయు తేజో**
**జలోర్వ్యాది కార్యం చరం చాచరం చ॥**

ఇట్టిదని తెలుపరాని ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, భూమి మొదలయినదియు, ఆ భూతకార్యమయిన చరాచర ప్రపంచము దేని నుండి బయలుదేరినదో విశుద్ధ చైతన్య రూపము నద్వితీయమునగు నట్టి పరదైవము నాకు నీవే. నీకంటె నితరులను నేను తలంపను.

**12.** **నమ స్సచ్చిదానందరూపాయ తస్మై**
**నమో దేవ దేవాయ రామాయ తుభ్యమ్**
**నమో జానకీ జీవితేశాయ తుభ్యం**
**నమః పుండరీకాయతాక్షాయ తుభ్యమ్ ॥**

సచ్చిదానంద స్వరూపుడైన ఆ పరమాత్మునకు నమస్కారము. దేవ దేవుడవయిన రామచంద్రా! నీకు నమస్కారము. జానకీ ప్రాణనాథుఁడవయిన నీకు నమస్కారము. పుండరీక విశాల నేత్రుఁడ వయిన నీకు నమస్కారము.

**13.** **నమో భక్తి యుక్తాను రక్తాయ తుభ్యం**
**నమః పుణ్య పుంజైక లభ్యాయ తుభ్యమ్**
**నమో వేదవేద్యాయ చాద్యాయ పుంసే**
**నమ స్సుందరాయేందిరా వల్లభాయ॥**

భక్తి గలిగిన వారియెడల ప్రీతిగల నీకు నమస్కారము. పుణ్య సమూహము చేతను మాత్రమే లభింపఁదగిన నీకు నమస్కారము. వేదములచే తెలియదగిన వాడవు, ఆదిపురుషుఁడవయిన నీకు నమస్కారము. సుందరుఁడవు లక్ష్మీపతివి అయిన నీకు నమస్కారము.

**14.** **నమో విశ్వకర్త్రే నమో విశ్వహర్త్రే**
**నమో విశ్వభోక్త్రే నమో విశ్వమాత్రే**
**నమో విశ్వనేత్రే నమో విశ్వజేత్రే**
**నమో విశ్వపిత్రే నమో విశ్వమాత్రే ॥**

విశ్వకర్తవయిన నీకు నమస్కారము. విశ్వహర్తవయిన నీకు నమస్కారము. ప్రపంచమంతటిని అనుభవించు నీకు నమస్కారము. విశ్వమంతయు తెలియు నీకు నమస్కారము. ప్రపంచమంతటికి నాయకుఁడవైన నీకు నమస్కారము. ప్రపంచమంతటిని జయించు నీకు నమస్కారము. విశ్వమునకు తండ్రివైన నీకు నమస్కారము. విశ్వమునకు తల్లి వైన నీకు నమస్కారము.

**15.** **నమస్తే నమస్తే సమస్త ప్రపంచ**
**ప్రభోగ ప్రయోగ ప్రమాణ ప్రవీణ !**
**మదీయం మనస్త్వత్పదద్వంద్వ సేవాం**
**విధాతుం ప్రవృత్తం సుచైతన్య సిద్ధ్యై ॥**

సమస్త ప్రపంచముయొక్క ప్రభోగమునందు ప్రయోగమునందు ప్రయాణము నందు నేర్పరి వైనవాఁడా! నీకు నమస్కారము. మంచి చైతన్యము సిద్ధించుటకై నా మనస్సు నీ పాదపద్మ సేవను చేయుటకు సిద్ధమయినది.

**16. శిలాపి త్వదంఘ్రి క్షమాసంగిరేణు**
**ప్రసాదాద్ధి చైతన్య మాధత్త రామ!**
**నర స్త్వత్పదద్వంద్వ సేవా విధానా**
**త్సుచైతన్య మేతీతి కిం చిత్ర మత్ర ? ॥**

రామా! ఱాయికూడ నీ పాదతలముక్రింద భూమియందున్న రేణువులు తాకుటవలన చైతన్యమును పొందినది (రామపాద రజస్స్పర్శచే ఱాయి చైతన్యము నంది అహల్యగా మాఱినదనుట). నరుఁడు నీపాద ద్వంద్వమును సేవించుట వలన విశుద్ధ చైతన్యము నందు ననుటలో చిత్రమేమున్నది ?

**17. పవిత్రం చరిత్రం విచిత్రం త్వదీయం**
**నరా యే స్మరం త్యన్వహం రామచంద్ర !**
**భవన్తం భవాన్తం భరంతం భజన్తో**
**లభన్తే కృతాంతం నపశ్యన్త్యతోఽన్తే ॥**

రామచంద్రా ! పవిత్రమై విచిత్రమయిన నీ చరిత్రమును ఏ మనుజులు ప్రతిదినము స్మరించెదరో వారు పోషకుడై సంసార నాశనమును కలిగించు నిన్ను సేవించువారై నిన్ను పొందుదురు. తన్మూలమున అంతకాలమున వారు యముని జూడరు.

**18. స పుణ్యః స్స గణ్యః శ్శరణ్యో మమాయం**
**నరో వేద యో దేవచూడామణిం త్వామ్**
**సదాకారమేకం చిదానందరూపం**
**మనోవాగగమ్యం పరంధామ! రామ! ॥**

రామా! పరంధామా! సత్స్వరూపము అద్వితీయము, చిత్స్వరూపము ఆనంద స్వరూపము. మనస్సునకు వాక్కులకు గోచరముగాని దేవతలకు శిరోభూషణమయిన నిన్ను ఏ నరు డెఱుంగునో అతఁడు పుణ్యాత్ముఁడు. అతఁడే నరులలో లెక్క పెట్ట దగినవాడు. అట్టివాఁడు నాకు రక్షకుఁడు.

**19. ప్రచండ ప్రతాప ప్రభావాభిభూత**
**ప్రభూతారివీర! ప్రభో! రామచంద్ర!**
**బలం తే కథం వర్ణ్యతేఽ తీవ బాల్యే**
**యతోఽఖండి చండీశ కోదండ దండమ్ ॥**

తీక్షణమయిన ప్రతాప ప్రభావముచే అనేకమంది శత్రువీరులను తిరస్కరించిన రామచంద్ర ప్రభూ! మిక్కిలి చిన్నతనమునందే శివధనుర్దండమును విఱిచిన నీ బలమెట్లు వర్ణింప వీలుపడును ?

**20. దశగ్రీవముగ్రం సుపుత్రం సమిత్రం**
**సరిద్దుర్గమధ్యస్థ రక్షోగణేశమ్**
**భవన్తం వినా రామ! వీరో నరో వా**
**సురో వా మరో వా జయేత్క స్త్రిలోక్యామ్? ॥**

పదితలలు గలిగి భయంకరుఁడయి పుత్ర మిత్రులతో గూడి జలదుర్గ మధ్య స్థుఁడై రాక్షసగణముల కధిపతియయిన రావణుని రామా! నీవుగాక వీరుఁడయిన నరుఁడుగాని, రాక్షసుఁడుగాని, దేవుఁడు గాని జయించువాఁడు ఈ మూఁడు లోకములందు నెవఁడున్నాఁడు ?

**21. సదా రామరామేతి నామామృతం తే**
**సదారామ మానన్ద నిష్యంద కందమ్**
**పిబ న్తం నమ న్తం సుద న్తం హస న్తం**
**హనూమన్త మన్తర్భజే తం నితాన్తమ్ ॥**

రామ రామ అని శాశ్వత సుఖస్వరూపము ఆనంద ప్రవాహమునకు మూల కందమయిన నీ నామామృతమును గ్రోలుచు, నమస్కరించుచు పళ్ళు బయటఁబడు నట్లు నవ్వుచున్న హనుమంతు నెల్లప్పుడు నా హృదయాంతరమున సేవింతును. (హనుమ ద్భక్తిసంధానము రామభక్తి సంపాదకము.)

**22. సదా రామరామేతి నామామృతం తే**
**సదారామ మానన్ద నిష్యన్ద కన్దమ్**
**పిబ న్నన్వహం న న్వహం నైవ మృత్యో**
**ర్బిభేమి ప్రసాదాదసాదాత్తవైవ ॥**

రామా! రామ! రామ! యనునట్టి శాశ్వత సుఖరూపము ఆనంద ప్రవాహమునకు మూలకందమయిన నీ నామామృతమును అనుదినము గ్రోలుచు సమగ్రమయిన నీ యనుగ్రహమువలన నేను మృత్యువు నుండి యేపాటియు భయపడను.

**23. అసీతాసమేతై రకోదండభూషై**
**రసౌమిత్రివంద్యై రచండప్రతాపై :**
**అలంకేశకాలై రసుగ్రీవమిత్రై**
**రరామాభిధేయై రలం దైవతై ర్నః ॥**

సీతాసమేతులుగాని, కోదండాలంకారులుగాని, లక్ష్మణునిచే నమస్కరింపబడని, తీక్షణమయిన ప్రతాపములేని, రావణునకు మృత్యువుకాని, సుగ్రీవుఁడు మిత్రుఁడుగా లేని, రాముఁడను పేరు పిలువఁబడని దేవతలతో మనకు పనిలేదు.

**24. అవీరాసనస్థై రచిన్ముద్రికాఢ్యై**
**రభక్తాంజనేయాది తత్త్వ ప్రకాశైః**
**అమందారమాలై రమందారమూలై**
**రరామాభిధేయై రలం దైవతై ర్నః ॥**

వీరాసనమందుండని, చిన్ముద్ర ధరింపని, భక్తులయిన ఆంజనేయాదులకు తత్త్వము నుపదేశింపని, కల్పవృక్ష పుష్పమాలికలు ధరింపని, కల్పవృక్ష మూలమునందుండని రాముడను పేరులేని దేవతలతో మనకు పనిలేదు.

**25. అసింధు ప్రకోపై రవన్ద్య ప్రతాపై**
**రబంధు ప్రయాణై రమన్ద స్మితాఢ్యైః**
**అదండ ప్రవాసై రఖండ ప్రబోధై**
**రరామాభి ధేయై రలం దైవతై ర్నః ॥**

సముద్రునిమీద కోపింపని, నమస్కరింపఁదగిన ప్రతాపము లేని, బంధు ప్రయాణము లేని, మందహాసముతో నిండియుండని, దండకారణ్యమున ప్రవాసము చేయని, అఖండ జ్ఞానస్వరూపులుగాని, రాముడను పేరులేని, దేవతలతో మనకు పనిలేదు.

**26. హరే! రామ! సీతాపతే! రావణారే!**
**ఖరారే! మురారేఽసురారే! పరేతి**
**లపన్తం నయన్తం సదా కాల మేవం**
**సమాలోక యాలోక యాశేషబంధో ॥**

హరి! రామ! సీతాపతీ! రావణవైరీ! ఖరాసురవైరీ! మురాసురవైరీ ! రాక్షసారీ! పరాత్పరా! అని హరినామస్మరణ మెల్లపుడు చేయుచు కాల మీ విధముగ గడుపుచున్న నన్ను అందఱకు బంధువయిన రామచంద్రా! దయతో బాగుగ చూడుము.

**27. నమస్తే సుమిత్రా సుపుత్రాభి వంద్య !**
**నమస్తే సదా కైకయీనందనేడ్య !**
**నమస్తే సదా వానరాధీశ వంద్య !**
**నమస్తే నమస్తే సదా రామచంద్ర ! ॥**

సుమిత్రకు పుత్రుఁడయిన లక్ష్మణునిచే నెలప్పుడు నమస్కరింపఁబడువాడా! ఎలప్పుడు భరతునిచే స్తుతింపఁబడువాఁడా! వానరాధిపుడైన సుగ్రీవున కెల్లప్పుడు నమస్కరింపఁ దగినవాఁడా! రామచంద్రా! నీ కెప్పుడును నమస్కారము.

**28. ప్రసీద ప్రసీద ప్రచండ ప్రతాప!**
**ప్రసీద ప్రసీద ప్రచండారికాల!**
**ప్రసీద ప్రసీద ప్రపన్నానుకంపిన్ ।**
**ప్రసీద ప్రసీద ప్రభో! రామచంద్ర !**

తీక్షణప్రతాపముగల రామచంద్రా ! ప్రసన్నుఁడవగుము, తీవ్రమయిన శత్రువులకు అంతకుఁడా! ప్రసన్నుఁడవు కమ్ము, శరణాగతులందు దయగలవాఁడా! ప్రసన్నుఁడ వగుము. రామచంద్ర ప్రభూ! ప్రసన్నుఁడవు కమ్ము.

**29. భుజంగ ప్రయాతం పరం వేదసారం**
**ముదా రామచంద్రస్య భక్త్యా చ నిత్యమ్**
**పఠన్సంతతం చిన్తయన్స్వాన్తరంగే**
**న ఏవ స్వయం రామచంద్రస్స ధన్యః ॥**

ఉత్తమము, వేదసారము అగు శ్రీరామచంద్ర భుజంగ ప్రయాత స్తోత్రమును సంతుష్టితో, రామచంద్ర భక్తితో నెల్లప్పుడు చదువుచు తన హృదయములో మననము చేయుచు నెవఁడుండునో అతఁడు స్వయముగ రామచంద్రుడే. అతఁడు ధన్యుఁడు.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం శ్రీరామ భుజంగ ప్రయాత స్తోత్రం సంపూర్ణమ్.***

## లక్ష్మీనృసింహ కరుణారస స్తోత్రమ్

1. **శ్రీమత్పయోనిధి నికేతన! చక్రపాణే !**
**భోగీన్ద్ర భోగమణిరాజిత! పుణ్యమూర్తే!**
**యోగీశ! శాశ్వత! శరణ్య! భవాబ్ధిపోత!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

శోభాయుక్తమైన క్షీరసముద్రమున నివసించువాడా! చేతియందు సుదర్శనమను చక్రాయుధమును ధరించినవాడా! ఆదిశేషుని పడగలయందలి మణులచే ప్రకాశింప చేయబడినవాడా! పుణ్యవిగ్రహా! యోగీశ్వరా! శాశ్వతుడా! సర్వలోక రక్షకుడా! సంసార సాగరమును దాటించుటకు నావ వంటి వాడవగు ఓ లక్ష్మీ నరసింహ దేవా! నాకు చేయూతనిచ్చి కాపాడుము.

2. **బ్రహ్మేంద్ర రుద్ర మరుదర్క కిరీటకోటి**
**సంఘట్టితాంఘ్రి కమలామలకాంతి కాంత!**
**లక్ష్మీ లసత్కుచ సరోరుహ రాజహంస!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

బ్రహ్మదేవుడు, ఇంద్రుడు, రుద్రుడు, వాయువు, సూర్యుడు మొదలగు దేవతా ప్రభువుల యొక్క కిరీటపు అంచులచే స్పృశింపబడిన పాదపద్మముల యొక్క విమలమగు కాంతులతో మనోహరమైన స్వరూపము గలవాడా! లక్ష్మీదేవి యొక్క వక్షోజములను పద్మములయందు రాజహంసవలె ప్రీతితో సంచరించువాడా! ఓ లక్ష్మీ నరసింహదేవా! నాకు చేయూత నిచ్చి కాపాడుము.

3. **సంసార దావ దహనాకుల భీకరోరు**
**జ్వాలావలీభిరతిదగ్ధ తనూరుహస్య**
**త్వత్పాదపద్మసరసీం శరణాగతస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

సంసారమను దావానలము యొక్క భయంకరమగు జ్వాలా సముదాయముల చేత మిక్కిలి దగ్ధమైన అవయవములు కలిగి రక్షణమును గోరి నీ పాదపద్మములను సరోవరమును చేరిన నాకు ఓ లక్ష్మీనృసింహదేవా! నీవు చేయూత నిచ్చికాపాడుము.

4. **సంసార జాల పతితస్య జగన్ని వాస!**
**సర్వేంద్రియార్థ బడిశాగ్ర ఝషోపమస్య**
**ప్రోత్కంపిత ప్రచుర తాలుక మస్తకస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

ఓ జగన్నివాసా! సంసారమను వలలో చిక్కుకొని సర్వేంద్రియములకు విషయములగు శబ్ద-స్పర్శ - రూప - రస - గంధములను గాలముల కొన నున్న ములికికి తగుల్కొనిన చేపవలె నున్న, వణకిపోవుచున్న దవడలు, తల గలిగిన నాకు ఓ లక్ష్మీనరసింహ దేవా! నీవు చేయూత నిచ్చి రక్షింపుము.

**5. సంసార కూప మతిఘోర మగాథమూలం**
**సంప్రాప్య దుఃఖశత సర్ప సమాకులస్య**
**దీనస్య దేవ! కృపయా పదమాగతస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

అతి భయంకరమైన అడుగు తెలియబడక, మిక్కిలి లోతైన సంసార మనునూతిలో బడి దుఃఖము లనెడి బహుసంఖ్యాకములగు సర్పములచే చుట్టబడిన వాడనై, దీనుడనై, నీ పాదముల సన్నిధికి శరణార్థియై వచ్చిన నాకు ఓ లక్ష్మీనృసింహ దేవా! నీవు చేయూతనిచ్చి కాపాడుము.

**6. సంసార భీకర కరీంద్ర కరాభిఘాత**
**నిష్పీడ్యమాన వపుష స్సకలార్తినాశ!**
**ప్రాణప్రయాణ భవభీతి సమాకులస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

సర్వవిధములగు దుఃఖములను నశింపజేయునట్టి ఓ దయామయా! సంసారమను భయంకరమగు మదపు టేనుగుయొక్క తొండపు దెబ్బలచే పీడింపబడుచున్న దేహము కలిగి జననమరణాది భయములచే వ్యాకుల చిత్తుడనైన నాకు ఓ నరసింహదేవా! నీవు చేయూత నిచ్చి కాపాడుము.

**7. సంసార సర్ప విషదిగ్ధ మహోగ్ర తీవ్ర**
**దంష్ట్రాగ్ర కోటి పరిదష్ట వినష్టమూర్తేః**
**నాగారివాహన! సుధాబ్ధినివాస! శౌరే!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

సంసారమను మహాసర్పము యొక్క విషయుక్తమై మిక్కిలి భయంకరమగు కోరలచే కాటువేయబడి మూర్ఛనొందిన దేహము గలిగిన నాకు సర్పవినాశకుడగు గరుత్మంతుని వాహనముగా గలిగి అమృత సముద్రమున నివసించు ఓ శౌరీ! ఓ లక్ష్మీ నరసింహదేవా! నీవు చేయూత నిచ్చి కాపాడుము.

**8. సంసారవృక్ష మఘబీజ మనంతకర్మ**
**శాఖాయుతం కరణపత్ర మనంగ పుష్పమ్**
**ఆరుహ్య దుఃఖఫలితం చకితం దయాళో!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

పాపమను విత్తనము నుండి మొలకెత్తి అంతములేని కర్మములను కొమ్మలతో గూడి ఇంద్రియములను ఆకులుగలిగి మన్మథుడను పుష్పములు కలిగి దుఃఖములను ఫలములతో విలసిల్లుచున్న సంసార మను వృక్షము నధిరోహించి మహాభయముతో వణకిపోవుచున్న నన్ను ఓ దయామయా! ఓ లక్ష్మీనరసింహదేవా! నీవు చేయూత నిచ్చి కాపాడుము.

**9. సంసార సాగర విశాల కరాళ కాల**
**నక్ర గ్రహ గ్రసిత నిగ్రహ విగ్రహస్య**
**వ్యగ్రస్య రాగనిచయోర్మి నిపీడితస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

సంసారమను సముద్రము నందలి విశాలము భయంకరము నగు కాలమను మొసలిచేత మ్రింగబడి పట్టుబడిన దేహము గలిగి కలవరపడి ఆశా సముదాయ మను తరంగములచే మిక్కిలి పీడింపబడిన నాకు ఓ లక్ష్మీనృసింహ దేవా! నీవు చేయూత నిచ్చి రక్షింపుము.

**10. సంసార సాగర నిమజ్జన ముహ్యమానం**
**దీనం విలోకయ విభో! కరుణానిధే! మామ్**
**ప్రహ్లాదఖేద పరిహార పరావతార!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

సంసారమను సముద్రమునందు మునిగి మూర్ఛపోయి దీనుడనగు నన్ను చూడుము. ఓ ప్రభూ! ఓ దయానిధీ! ప్రహ్లాదుని దుఃఖమును పరిహరించుటకై భూలోకమున నవతరించిన ఓ లక్ష్మీనృసింహదేవా! నీవు చేయూత నిచ్చి రక్షింపుము.

**11. సంసార ఘోర గహనే చరతో మురారే !**
**మారోగ్ర భీకర మృగ ప్రచురార్దితస్య**
**ఆర్తస్య మత్సర నిదాఘ సుదుఃఖితస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

ఓ మురారీ! సంసారమను భయంకర మహారణ్యమున పరిభ్రమించుచు, మన్మథుడను భయంకర మృగముచే మిక్కుటముగ పీడింపబడుచు, మాత్సర్యమను మండు వేసవిచేత విశేషముగ దుఃఖితుడనై ఆర్తినొందిన నాకు ఓ లక్ష్మీనరసింహదేవా! నీవు చేయూత నిచ్చి రక్షింపుము.

**12. బద్ధ్వా గలే యమభటా బహు తర్జయన్తః**
**కర్షన్తి యత్ర భవపాశ శతైర్యుతం మామ్**
**ఏకాకినం పరవశం చకితం దయాళో!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

కంఠమున త్రాడుపోసి కట్టి బహువిధములుగా భయ పెట్టుచు బలత్కారముగా నన్ను యమభటులు లాగుచున్న కాలములో వందలకొలదిగ నున్న సంసార పాశములతో కూడుకొని చిక్కుపడి సహాయము చేయువా రెవరును లేక ఒంటరి వాడనై భయముచే వణకిపోవుచున్న నన్ను ఓ దయామయా! లక్ష్మీ నరసింహదేవా! నీవు చేయూత నిచ్చి రక్షింపుము.

**13. లక్ష్మీపతే! కమలనాభ! సురేశ! విష్ణో!**
**యజ్ఞేశ! యజ్ఞ! మధుసూదన! విశ్వరూప!**
**బ్రహ్మణ్య! కేశవ! జనార్దన! వాసుదేవ!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

ఓ లక్ష్మీపతీ! బొడ్డున కమలము గలిగియున్న వాడా! దేవదేవా! సర్వవ్యాపకుడవగు విష్ణుదేవా! యజ్ఞేశ్వరా! యజ్ఞ స్వరూపా! మధు నామకుడగు రాక్షసుని సంహరించివాడా! సర్వలోక స్వరూపా! బ్రహ్మణ్యా! కేశవా! జనార్ధనా! వాసుదేవా! ఓ లక్ష్మీనరసింహదేవా! నీవు చేయూత నిచ్చి రక్షింపుము.

**14. ఏ కేన చక్రమపరేణ కరేణ శంఖ**
**మన్యేన సిన్ధుతనయా మవలంబ్య తిష్ఠన్**
**వామేతరేణ వరదాభయ పద్మచిహ్నం**
**లక్ష్మీనృసింహ! మమ దేహి! కరావలంబమ్ ॥**

ఎడమవైపున ఒక చేతిలో చక్రమును మరియొక చేతిలో శంఖమును ధరించి క్షీరసాగర పుత్రిక యగు మహాలక్ష్మీదేవిని చేపట్టి నిలబడియున్నవాడై కుడివైపున వరదాభయ చిహ్నములను ధరించి లోకానుగ్రహము చేయుచున్న ఓ లక్ష్మీనరసింహదేవా! నీవు చేయూత నిచ్చి నన్ను రక్షింపుము.

**15. అన్ధస్య మే హృత వివేక మహాధనస్య**
**చోరైర్మహాబలిభిరిన్ద్రియ నామధేయైః**
**మోహాన్ధకారకుహరే వినిపాతితస్య**
**లక్ష్మీనృసింహా! మమ దేహి! కరావలంబమ్ ॥**

ఇంద్రియములను పేరు గలిగియున్న మహా బలవంతులగు దొంగలచేత నా యొక్క వివేకమను మహాధనము దొంగిలింపబడినది. గ్రుడ్డివాడను మోహము (అజ్ఞానము) అను చీకటి గోతిలో పడవేయబడితిని. అట్టి నాకు ఓ లక్ష్మీనరసింహదేవా! నీవు చేయూత నిచ్చి రక్షింపుము.

**16. ప్రహ్లాద నారద పరాశర పుండరీక**
**వ్యాసాది భాగవత పుంగవ హృన్నివాస!**
**భక్తానుర క్త! పరిపాలన పారిజాత!**
**లక్ష్మీనృసింహా! మమ దేహి! కరావలంబమ్ ॥**

ప్రహ్లాదుడు, నారదుడు, పరాశరుడు, పుండరీకుడు, వ్యాసుడు మొదలుగా గల భాగవత శ్రేష్ఠుల హృదయములందు నివసించువాడా! భక్తులయందు అనురాగము గలవాడవై పారిజాత వృక్షమువలె సమస్త కోరికల నొనగూర్చి రక్షించువాడా! (దేవలోకమునందు కోరువారి కోరికల నెల్ల నిచ్చు వృక్షములైదు కలవు. వానికి కల్ప వృక్షములని పేరు. అందు పారిజాత వృక్షము ఒకటి.) ఓ లక్ష్మీనరసింహదేవా! నీవు చేయూత నిచ్చి కాపాడుము.

**17. లక్ష్మీనృసింహ చరణాబ్జ మధువ్రతేన**
**స్తోత్రం కృతం శుభకరం భువి శంకరేణ**
**ఏ తత్పఠన్తి మనుజా హరిభక్తి యుక్తా**
**స్తే యాన్తి తత్పద సరోజ మఖండరూపమ్ ॥**

లక్ష్మీనరసింహదేవుని పాద పద్మములను తుమ్మెదవలె ప్రీతితో సేవించు స్వభావముగల శంకరులచే చేయబడిన ఈ శుభకరమగు స్తోత్రమును ఈ భూలోకమున నే మనుజులు శ్రీహరిభక్తి సంపన్నులై పఠింతురో వారు అఖండితమగు స్వరూపముతో నొప్పు లక్ష్మీనరసింహదేవుని పాద పద్మములను పొందగలరు.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం లక్ష్మీనృసింహ కరుణారస స్తోత్రం సంపూర్ణమ్.***

# లక్ష్మీనరసింహ పంచరత్నమ్

**1. త్వత్ప్రభు జీవ ప్రియమిచ్ఛసి చేన్నరహరి పూజాం కురు! సతతం**
**ప్రతిబింబాలంకృతి దృశి కుశలో బింబాలంకృతి మాతనుతే**
**చేతోభృంగ! భ్రమసి వృథా భవ మరుభూమౌ విరసాయాం**
**భజ! భజ! లక్ష్మీనరసింహానఘ పదసరసిజ మకరందమ్ ॥**

ఓ మనోభృంగమా! రసహీనమైన సంసార మనెడి ఎడారిభూమిలో వ్యర్థముగా తిరిగెదవేల? శ్రీ లక్ష్మీనరసింహ స్వామి వారి పాద పద్మములలోని మకరందము నాదరముతో సేవింపుము. ప్రతిబింబము (జీవుని) నలంకరించి చూచు నేర్పరి ముందుగా బింబము (భగవంతు) నలంకరించును గదా! – అట్లే నీ ప్రభువగు జీవునకు ప్రియమును కోరినచో ముందుగా శ్రీ లక్ష్మీనరసింహస్వామిని విడువక పూజింపుము.

**2. శుక్తౌ రజత ప్రతిభా జాతా కటకాద్యర్థ సమర్థా చేత్**
**దుఃఖమయీ తే సంసృతిరేషా నిర్వృతిదానే నిపుణా స్యాత్**
**చేతోభృంగ ! భ్రమసి వృథా భవ మరుభూమౌ విరసాయాం**
**భజ! భజ! లక్ష్మీనరసింహానఘ పదసరసిజ మకరందమ్ ॥**

భ్రమచే శుక్తియందు తోచిన వెండితో కడియాలు మురుగులు చేయించు కొనుట కుదిరినచో ఈ దుఃఖమయ సంసారము నిక్కమయిన ఆనందము నిచ్చుట యున్నూ కుదురువచ్చును. కాని అట్లు జరుగదుగదా! ఓ మనోభృంగమా! రసహీనమయిన సంసార మనెడి ఎడారిభూమిలో వ్యర్థముగా తిరిగెదవేల! శ్రీ లక్ష్మీనరసింహ స్వామివారి పాదపద్మములలోని మకరందము నాదరముతో సేవింపుము.

**3. ఆకృతిసామ్యాచ్ఛాల్మలికుసుమే స్థలనలినత్వ భ్రమమకరోః**
**గంధరసావిహ కిము విద్యే తే విఫలం భ్రామ్యసి భృశ విరసేఽ స్మిన్**
**చేతోభృంగ ! భ్రమసి వృథా భవ మరుభూమౌ విరసాయాం**
**భజ! భజ! లక్ష్మీనరసింహానఘ పదసరసిజ మకరందమ్ ॥**

ఆకారము సమముగానున్నదని బూరుగుపూవును చూచి మెట్టతామర పూవను కొంటివి. విరసమగు బూరుగుపూవులో గంధముగాని మకరందరసముగాని కలదా? వ్యర్థముగా భ్రమపడితివి. కనుక ఓ మనోభృంగమా! రసహీనమగు నీ సంసార మనెడి ఎడారిభూమిలో వ్యర్థముగా తిరిగెద వేల! శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి పాదపద్మములలో మకరందము నాదరముతో సేవింపుము.

**4. ప్రక్చందన వనితాదీన్ విషయాన్ సుఖదాన్ మత్వా తత్ర విహరసే**
**గంధఫలీ సదృశా నను తే౽మీ భోగానంతర దుఃఖకృతః స్యుః**
**చేతోభృంగ! భ్రమసి వృథా భవ మరుభూమౌ విరసాయాం**
**భజ! భజ! లక్ష్మీనరసింహానఘ పదసరసిజ మకరందమ్ ॥**

పూలమాలలు, మంచి గంధములు, అందమైన స్త్రీలు మొదలైన విషయములు సుఖప్రదములనుకొని వానియందు విహరించుచున్నావు. కాని ఇవి నీకు సంపెంగపూవులవలె భోగానంతరము అనంత దుఃఖ ప్రదము లగును సుమా! ఓ మనోభృంగమా! రసహీనమగు నీ సంసారమనెడి ఎడారి భూమిలో వ్యర్థముగా తిరగెదవేల? శ్రీ లక్ష్మీనరసింహస్వామి వారి పాదపద్మములలోని మకరందము నాదరముతో సేవింపుము.

**5. తవ హిత మేకం వచనం వక్ష్యే శృణు! సుఖకామో యది సతతం**
**స్వప్నే దృష్టం సకలం హి మృషా జాగ్రతి చ స్మర! తద్వదితి**
**చేతోభృంగ! భ్రమసి వృథా భవ మరుభూమౌ విరసాయాం**
**భజ! భజ! లక్ష్మీనరసింహానఘ పదసరసిజ మకరందమ్ ॥**

నీవు నిజముగా సుఖము కోరినచో నేనొక్క మంచిమాట చెప్పుచున్నాను వినుము. "స్వప్నమున చూచినదెల్లయు నెట్లు మృష (కల్ల) యగుచున్నదో అట్లే జాగ్రదవస్థలోని సమస్తమున్ను మృత (కల్ల) యే యని" స్మరింపుము. ఓ మనో భృంగమా! రసహీనమగు నీ సంసారమ నెడి ఎడారిభూమిలో వ్యర్థముగా తిరిగెద వేల? శ్రీ లక్ష్మీనరసింహస్వామి వారి పాదారవిందములలోని మకరందరసము నాదరముతో సేవింపుము.

**ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం శ్రీ లక్ష్మీనరసింహ పంచరత్నమ్ సంపూర్ణమ్.**

## జగన్నాథాష్టకమ్

**1. కదాచిత్కాళిందీ తట విపిన సంగీతక వరో**
**ముదా గోపీనారీ వదన కమలాస్వాద మధుపః**
**రమా శంభు బ్రహ్మామరపతి గణేశార్చితపదో**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

ఒకానొక సమయమున యమునా తీరమున బృందావనములో నృత్యగీత వాద్యముల మహోత్సవములందు నేర్పరియై గోపికావదన కమలాస్వాద మధుపమై యుండి లక్ష్మి శివ బ్రహ్మేంద్ర గణనాథాదులచే సేవింపబడిన పాదపద్మములుగల శ్రీ జగన్నాథస్వామి నా కనులకు ప్రత్యక్షమగునుగాక !

**2. భుజే సవ్యే వేణుం శిరసి శిఖిపింఛం కటితటే**
**దుకూలం నేత్రాంతే సహచరకటాక్షం విదధతే**
**సదా శ్రీమద్బృందావన వసతి లీలా పరిచయో**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

ఎడమచేత వేణువును, శిరమున నెమలి పింఛమును, కటి ప్రదేశమున దుకూలమును దాల్చి క్రీగంటిచూపుల బరపుచు ఎల్లప్పుడు బృందావనమునందు పరిచితములైన లీలలను చూపుచున్న శ్రీ జగన్నాథస్వామి నాకు ప్రత్యక్షమగుగాక !

**3. మహాంభోధే స్తీరే కనకరుచిరే నీలశిఖరే**
**వసన్ ప్రాసాదాంత స్సహజ బలభద్రేణ బలినా**
**సుభద్రా మధ్యస్థః సకలసుర సేవావసరదో**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

మహాసముద్ర తీరమున కనక రుచిరమగు నీలాద్రి శిఖరమునందలి దివ్య ప్రాసాదమున సుభద్రా బలభద్ర మధ్యభాగమున నివసించుచు సకల దేవతలకు పర్యాయ సేవలొసంగుచున్న శ్రీ జగన్నాథస్వామి నాకు ప్రత్యక్షమగుగాక !

**4. కృపాపారావారః సజల జలద శ్రేణి రుచిరో**
**రమా వాణీ సోమ స్ఫురదమల పద్మోద్భవముఖైః**
**సురేంద్రైరారాధ్యః శ్రుతిగణశిఖా గీతచరితో**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

కృపాసముద్రుడును, సజల జలద నీల శరీరుడును, రమా వాణీ సోమ బ్రహ్మాది దేవతలచే నారాధ్యుడును ఉపనిషత్తులచే వినుతింపబడిన చరిత్రము గల శ్రీ జగన్నాథస్వామి నాకు ప్రత్యక్షమగుగాక !

**5. రథారూఢో గచ్ఛన్ పథి మిలిత భూదేవపటలైః**
**స్తుతిప్రాదుర్భావం ప్రతిపదముపాకర్ణ్య సదయః**
**దయాసింధు ర్బంధుః సకలజగతాం సింధుసుతయా**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

వేదవేత్తలగు విప్రులు మార్గమునందుకలసి సకలలోక బంధువనియు, దయా సముద్రుడనియు స్తుతించుచుండగా దయతో వినుచు లక్ష్మీ దేవితో రథారూఢుడై యూరేగుచున్న శ్రీ జగన్నాథస్వామి నాకు ప్రత్యక్షమగుగాక!

**6. పరబ్రహ్మాపీడః కువలయదళోత్ఫుల్ల నయనో**
**నివాసీ నీలాద్రౌ నిహిత చరణోఽనంత శిరసి**
**రసానన్దో రాధా సరసవపురాలింగన సుఖో**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

నీలాచల నివాసియై శేష శిరస్సున పాదముల నుంచి, నల్లకలువ రేకులవంటి నేత్రములతో రసానందియై రాధాలింగన సుఖము ననుభవించుచు పరబ్రహ్మమూర్తియగు శ్రీ జగన్నాథస్వామి నాకు ప్రత్యక్షమగుగాక !

**7. న వై ప్రార్థ్యం రాజ్యం న చ కనకతా భోగవిభవే**
**నయాచేఽహం రమ్యాం నిఖిలజనకామ్యాం వరవధూమ్**
**సదా కాలేకాలే ప్రమథపతినా గీత చరితో**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

నేను రాజ్యమునుగాని, ధన కనకములనుగాని, భోగ వైభవములనుగాని, త్రిభువన సుందరియగు వధువునుగాని కోరను. సర్వకాలములయందు నీశ్వరుడే స్వామి చరిత్రములను గానముచేయుచుండునో అట్టి జగన్నాథస్వామి నా కనులముందు సాక్షాత్కరించుగాక !

**8. హర! త్వం సంసారం ద్రుతతరమసారం సురపతే!**
**హర! త్వం పాపానాం వితతి మపరాం యాదవపతే!**
**అహో! దీనానాథం నిహితమచలం పాతుమనిశం**
**జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే॥**

ఓ దేవదేవా! అపారమగు నీ జన్మ మరణ ప్రవాహమును శీఘ్రముగా హరింపుము. ఓ యాదవనాథా! నా పాప సమూహమును గూడ హరింపుము. ఈ కదలలేని దీనుని, అనాథుని రక్షించుటకై శ్రీ జగన్నాథస్వామి నాకు ప్రత్యక్షమగుగాక !

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం జగన్నాథాష్టకం సంపూర్ణమ్.***



## శ్రీ విష్ణు భుజంగ ప్రయాత స్తోత్రమ్

**1. చిదంశం విభుం నిర్మలం నిర్వికల్పం**
**నిరీహం నిరాకార మోంకార గమ్యమ్**
**గుణాతీత మవ్యక్తమేకం తురీయం**
**పరంబ్రహ్మ యం వేద తస్మై నమస్తే ॥**

ఓ ఆచ్యుతా! సర్వవ్యాపకునిగాను నిర్మల నిర్వికల్ప నిరీహ నిరాకార జ్ఞాన శరీరునిగాను గుణాతీతమగు అవ్యక్తముగాను జాగ్ర త్స్వప్న సుషుప్తుల కావలి చతుర్థమగు పరబ్రహ్మముగాను కేవల ప్రణవధ్యాన గమ్యునిగాను తెలియబడునట్టి నీ కొఱకు నమస్కారము.

**2. విశుద్ధం శివం శాంతమాద్యంతశూన్యం**
**జగజ్జీవనం జ్యోతిరానందరూపమ్**
**అదిగ్దేశకాల వ్యవచ్ఛేదనీయం**
**త్రయీ వక్తియం వేద తస్మై నమస్తే ॥**

స్వామీ! వేదములు మూడును నిన్ను ఆద్యంతములు లేని దిగ్దేశకాలావధులు లేని విశుద్ధ శాంతి శివానందజ్యోతి స్స్వరూపుడవని జగజ్జీవనము నీవే అని తెలిసి కొని చెప్పుచున్నవి. అట్టి నీ కొఱకు నమస్కారము.

**3. మహా యోగపీఠే పరిభ్రాజమానే**
**ధరణ్యాది తత్త్వాత్మ కే శక్తియుక్తే**
**గుణాహస్కరే వహ్ని బింబార్థమధ్యే**
**సమాసీన మోంకర్ణి కేఽ ష్టాక్షరాబ్జే ॥**

నీవు ప్రభావిరాజమానమై పృథివ్యాది తత్వాత్మకమై అణిమాదిశక్తి యుక్తమై గుణవిశేషమున సూర్యాగ్ని బింబార్ధ మధ్యమున ప్రణవమే కర్ణికగాగల అష్టాక్షర పద్మ మహాయోగపీఠమున సమాసీనుడవై.

**4. సమానోది తానేక సూర్యేందుకోటి**
**ప్రభాపూర తుల్య ద్యుతిం దుర్నిరీక్షమ్**
**న శీతం న చోష్ణం సువర్ణావదాతం**
**ప్రసన్నం సదానంద సంవిత్స్వరూపమ్ ॥**

ఒక్కమారే ఉదయించిన అనేకకోట్ల సూర్యచంద్రుల కాంతి ప్రవాహమువలె చూడశక్యముగాని ప్రకాశము గలిగి శీతోష్ణములులేని సువర్ణమువలె పచ్చనై ప్రసన్నమగు సదానంద సంవిత్స్వరూపముతో.

**5. సునాసాపుటం సుందర భ్రూలలాటం**
**కిరీటోచితాకుంచిత స్నిగ్ధ కేశమ్**
**స్ఫుర త్పుండరీకాభి రామాయతాక్షం**
**సముత్ఫుల్ల రత్న ప్రసూనావతంసమ్ ॥**

సుందరమగు నాసాపుటము, అందములచిందు కనుబొమలతో విశాలమగు లలాటము, కిరీటముంచుటకై ముడిచిన నిగనిగలాడు కేశపాశము, మెఱయుచున్న తెల్ల తామరలవలె ప్రీతిజనకములగు విశాల నేత్రములు, శిరమున ప్రకాశమానముగల రత్న కుసుమాభరణములు కలిగి.

**6. లస త్కుండలామృష్ట గండస్థలాంతం**
**జపారాగ చోరాధరం చారుహాసమ్**
**అలివ్యాకులామోది మందారమాలం**
**మహోరస్స్ఫుర త్కౌస్తుభోదార హారమ్ ॥**

కుండలములతో నొరయు గండస్థలములు, జపాకుసుమరాగచోరమగు అధర బింబముపై చిఱునగవు తుమ్మెదలుమూగి పరిమళముల చిమ్ము మందారమాలిక, వక్ష స్థలమున కౌస్తుభమణిహారమును గలిగి.

**7. సురత్నాంగదై రన్వితం బాహుదండై**
**శ్చతుర్భి శ్చలత్కంకణాలంకృతాగ్రైః**
**ఉదారోదరాలం కృతం పీతవస్త్రం**
**పదద్వంద్వ నిర్ధూత పద్మాభిరామమ్ ॥**

రత్నాంగదములతో కంకణములతో నలంకృతములైన చతుర్బాహు దండములతో ఉదరమున పీతాంబరముతో పద్మశోభను పరిహసించు పాదద్వయముతో.

**8. స్వభక్తేషు సందర్శి తాకార మేవం**
**సదా భావయన్ సన్ని రుద్ధేంద్రియాశ్వః**
**దురాపం నరో యాతి సంసారపారం**
**పరస్మై పరేభ్యో ఽపి తస్మై నమస్తే ॥**

భక్తజనుల కొఱకు సందర్శింపజేయు ఈ దివ్యమంగళ రూపమును ఇంద్రి యాశ్వముల నరికట్టి ఎల్లప్పుడు భావించినవారు పొందరాని సంసారమును చేరగలరు. పెద్దలకుగూడ పెద్దవైన నీ కొఱకు నమస్కారము.

**9.** **శ్రియా శాతకుంభ ద్యుతి స్నిగ్ధ కాంత్యా**
**ధరణ్యా చ దూర్వాదళ శ్యామలాంగ్యా**
**కళత్ర ద్వయేనాముానా తోషితాయ**
**త్రిలోకీ గృహస్థాయ విష్ణో! నమస్తే ॥**

బంగారు కాంతులతో వెలుగు లక్ష్మీదేవితోను, దూర్వాదళ శ్యామలాంగి యగు భూదేవితోను ఈ యిద్దరు భార్యలతో తృప్తిపడిన ఓ త్రిలోకీ గృహస్థుడా ! అచ్యుతా! నీకు నమస్కారము.

**10.** **శరీరం కళత్రం సుతం బంధువర్గం**
**వయస్యం ధనం సద్మ భృత్యం భువం చ**
**సమస్తం పరిత్యజ్య హా! కష్ట మేకో**
**గమిష్యామి దుఃఖేన దూరం కిలాహమ్ ॥**

నేను శరీరమును, భార్యను, బిడ్డలను, బంధుమిత్రులను, ధనగృహారామ భృత్య వర్గమును విడిచి ఒక్కడనై దుఃఖముతో దూర ప్రయాణము చేయవలసి యున్నది గదా!

**11.** **జరేయం పిశాచీవ హా! జీవతో మే**
**వసామత్తి రక్తం చ మాంసం బలం చ**
**అహో! దేవ! సీదామి దీనానుకంపిన్ !**
**కిమద్యాపి హంత! త్వయోదాసితవ్యమ్ ॥**

ఈ ముసలితనము పిశాచివలె నేను బ్రతికియుండగానే రక్తమాంసములను బలవీర్యములను తిని వేయుచున్నది. ఓ దీనదయాళో ! చాల బాధపడుచున్నాను. ఇప్పటికీ నీవు ఉదాసీనుడవగుట తగదు.

**12.** **కఫవ్యాహతోష్ణోల్బణ శ్వాసవేగ**
**వ్యథా విస్ఫుర త్సర్వ మర్మాస్థి బంధామ్**
**విచి న్త్యాహమంత్యా మసంఖ్యామవస్థాం**
**బిభేమి ప్రభో! కిం కరోమి? ప్రసీద॥**

ఓ ప్రభూ! కఫవ్యాహతమగు నుష్ణముచే శ్వాస వేగ మధికమై బాధించుటచే సర్వశరీరాస్థిబంధము వణుకుచుండునట్టి వర్ణింపరాని అంత్యావస్థను తలంచి భయపడుచున్నాను. ఏమి చేయుదును? నన్ను ప్రసన్నుడవై రక్షింపుము.

**13. లప న్న చ్యుతానంత! గోవింద! విష్ణో!**
**మురారే! హరే! నాథ! నారాయణేతి**
**యధాను స్మరిష్యామి భక్త్యా భవన్తం**
**తథా మే దయాశీల! దేవ! ప్రసీద ॥**

ఓ అచ్యుతా ! అనంతా! గోవిందా! విష్ణో! మురారే! హరే! నాథ! నారాయణా, అని ఆ యవస్థలో నీ నామములను పలుకుచు నిన్ను మనసార భక్తితో స్మరించునట్లు దయాశీలుడవగు దేవా! అనుగ్రహింపుము.

**14. భుజంగ ప్రయాతం పఠేద్యస్తు భక్త్యా**
**సమాధాయ చిత్తే భవంతం మురారే!**
**స మోహం విహాయాశు యుష్మ త్ప్రసాదా**
**త్సమాశ్రిత్య యోగం వ్రజత్యచ్యుతం త్వామ్ ॥**

ఓ మురారీ! చిత్తమునందు నిన్ను నిలుపుకొని భక్తితో ఈ విష్ణు భుజంగ ప్రయాత స్తోత్రమును పఠించినవారు నీ యనుగ్రహమువలన వెంటనే మోహమును వదలి యోగమునాశ్రయించి అచ్యుతుడవైన నిన్ను చెందగలరు.

*ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం శ్రీ విష్ణు భుజంగ ప్రయాత స్తోత్రం సంపూర్ణమ్.*





## ప్రాత స్స్మరణ స్తోత్రమ్

**1. ప్రాతస్స్మరామి హృది సంస్ఫుర దాత్మతత్త్వం**
**సచ్చిత్సుఖం పరమహంస గతిం తురీయమ్**
**య త్స్వప్న జాగర సుషుప్త మవైతి నిత్యం**
**తద్బ్రహ్మ నిష్కలమహం న చ భూతసంఘః ॥**

ఏ వస్తువు జాగ్రత్స్వప్న సుషుప్తువులను అవస్థలను మూడింటిని నిత్యము గుర్తించుచునున్నదియో, ఎయ్యెది నిరవయవమో, నిత్యమైనదియో అయ్యది బ్రహ్మ వస్తువు. ఆ బ్రహ్మవస్తువే నేను; అంతియే కాని పంచభూత సంఘుతాత్మకమగు దేహాదికము మాత్రము నేను కాను. (అనగా ఆత్మ (నా) యొక్క యథార్థతత్త్వము (స్వరూపము) బ్రహ్మే ఖన్న భిన్న మేకాని మరియొకటి కాదని తాత్పర్యము). అట్టి సచ్చిదానందాత్మకమైన, పరమహంసలగు మహాత్ములచే పొందదగిన, అవస్థాత్రయమునకును అతీతమైన సర్వప్రాణుల యొక్క హృదయములయందు బాగుగా ప్రకాశించుచుండు నా (ఆత్మ) తత్త్వమును నేను ప్రాతః కాలమున (నిదురనుండి మేల్కాంచగనే) నిత్యము స్మరింతును!

**2. ప్రాతర్భజామి మనసాం వచసామగమ్యం**
**వాచో విభాన్తి నిఖిలా యదనుగ్రహేణ**
**యం నేతి నేతి వచనై ర్నిగమా అవోచన్**
**తం దేవ దేవ మజ మచ్యుత మాహు రగ్ర్యమ్ ॥**

వాగింద్రియము, నేత్రేంద్రియము మొదలగు సమస్తేంద్రియములును ఎవని యనుగ్రహమున తమ తమ కార్యములను (పలుకుట, చూచుట మొదలగు వానిని) చేయగలవి యగుచు ప్రకాశించుచున్నవో - ఎవడు మనోవృత్తులకుగాని, వాక్కులకు గాని అందనివాడై యుండెనో - (అనగా మనస్సుతో నూహింప నలవికాని వాడును, శబ్దములచే వర్ణింప నలవికాని వాడును అని యర్థము). ఎవనిని వేదములు సాక్షాత్తుగ వర్ణింప జాలక "నేతి, నేతి" యను వాక్యములలో "ఇది కాదు ఇది కాద"నుచు సర్వ దృశ్య పదార్థములను నిషేధించుచు, ఆ నిషేధములకు అవధిగనుండు వానినిగ బోధించుచున్నవో; అట్టివానిని వేదవిదులు దేవదేవు డనియు, అజు (ఉత్పత్తి లేనివా) డనియు, అచ్యుతు (నాశనమును పొందనివా) డనియు, సర్వ శ్రేష్ఠుడనియు నందురు. అట్టి పరమాత్మను నేను ప్రాతః కాలమున (నిదురనుండి మేల్కాంచగనే) నిత్యము సేవింతును.

**3. ప్రాతర్నమామి తమసః పరమర్కవర్ణం**
**పూర్ణం సనాతనపదం పురుషోత్త మాఖ్యమ్**
**యస్మి న్నిదం జగదశేష మశేషమూర్తౌ**
**రజ్జ్వాం భుజంగమ ఇవ ప్రతిభాసితం మే ॥**

భ్రాంతుడగు వానికి త్రాడునందు పాము గోచరించునట్లు సర్వాత్మకుడును, సర్వ ప్రధానుడును అగు ఏ పరమాత్మయందు ఈ సమస్త ప్రపంచమును అజ్ఞానము వలన నాకు ప్రతిభాసించుచున్నదో; అట్టి అజ్ఞానమునకు వెలుపలివాడైన సూర్య భగవానునివలె స్వయం ప్రకాశమానుడై వెలుగొందుచున్న పరిపూర్ణుడై, అనాది కాలము నుండియు సర్వప్రాణులకును ప్రాప్యమైన పురుషోత్తముడను పేరుతో శాస్త్రములందు వ్యవహరింపబడుచున్న ఆ పరమాత్మను నేను ప్రాతఃకాలమును (నిదురనుండి మేల్కాంచగనే) నిత్యము నమస్కరింతును.

**4. శ్లోక త్రయ మిదం పుణ్యం లోకత్రయ విభూషణమ్**
**ప్రాతః కాలే పఠే ద్యస్తు సగచ్ఛేత్పరమం పదమ్ ॥**

ముల్లోకములకును అలంకార భూతమగు పవిత్రమైన ఈ శ్లోకత్రయమును ఎవడు నిత్యము పఠించునో వాడు పరమపదమగు మోక్షమును పొందగలడు.

***ఇతి శ్రీ శంకరాచార్య కృత ప్రాత స్స్మరణ స్తోత్రమ్ సంపూర్ణమ్***

## షట్పదీ స్తోత్రమ్

**1. అవినయ మపనయ! విష్ణో !**
**దమయ! మన, శ్శమయ! విషయ మృగతృష్ణామ్,**
**భూతదయాం విస్తారయ!**
**తారయ! సంసార సాగరతః ॥**

ఓ విష్ణు మూర్తీ! అవినయము పోగొట్టుము. మనస్సును నియమింపుము. విషయము లనెడి ఎండమావులను రూపుమాపుము. భూతదయను పెంపొందింపుము. సంసారమనెడి సాగరము నుండి దాటింపుము.

**2. దివ్యధునీ మకరం దే**
**పరిమల పరిభోగ సచ్చిదానం దే**
**శ్రీపతి పదారవిం దే**
**భవ భయ ఖేదచ్ఛిదీ వం దే ॥**

దేవనది (గంగానది) యను తేనె చిందునవియు, పరిమళించు పరిపూర్ణ సచ్చిదానందము గలవియు, సంసార భయదుఃఖముల నడంచునవియు శ్రీపతి చరణారవిందములను మ్రొక్కెదను.

**3. సత్యపి భేదాపగమే**
**నాథ! తవాహం న మామకీన స్త్వమ్**
**సాముద్రో హి తరంగః**
**క్వచన సముద్రో న తారంగః ॥**

భేదముపోయి అద్వైతస్థితి యనుభవమునకు వచ్చినపుడు గూడ నాథ! నేను నీలోని వాడను, నీవు మాత్రము నాలోనివాడవుగావు. తరంగము సముద్రమునకు సంబంధి యగునుగాని యేనాటికి సముద్రము తరంగమునకు సంబంధించునది గాజాలదు.

**4. ఉద్ధృతనగ! నగభిదనుజ!**
**దనుజ కులామిత్ర! మిత్రశశిదృష్టే!**
**దృష్టే భవతి ప్రభవతి**
**న భవతి కిం భవ తిరస్కారః? ॥**

గోవర్ధనగిరి యెత్తినవాడా! నగభేది (ఇంద్రుని) తమ్ముడా! (ఉపేంద్ర!) రాక్షసకులశత్రూ! సూర్యచంద్ర నేత్రుడా! సమర్థుడవగు నీవు ప్రత్యక్షమైతి వేని సంసారము అంతర్ధానము కాకుండునా ?

**5. మత్స్యాదిభి రవతారై**
**రవతారవతాఽవతా సదా వసుధామ్**
**పరమేశ్వర! పరిపాల్యో**
**భవతా భవ తాప భీతోఽహమ్ ॥**

మత్స్యాద్యవతారములు దాల్చి అవనిని రక్షింప నవతరించిన పరమేశ్వరా! భవతాపమున భయమందుచున్న నేను నీచే కాపాడదగి యున్నాను.

**6. దామోదర! గుణమందిర!**
**సుందర వదనారవింద, గోవింద!**
**భవజలధి మథన మందర!**
**పరమం దర మపనయ! త్వం మే ॥**

ఓ దామోదరా! ఓ సుగుణమందిరా! ఓ చక్కని ముఖారవిందము గలవాడా! గోవిందా! సంసార సాగరమును మథించు మందరగిరీ ! నా తీవ్రమైన భయము నెల్ల పోగొట్టుము.

**7. నారాయణ! కరుణామయ!**
**శరణం కరవాణి తావకౌ చరణౌ**
**ఇతి షట్పదీ మదీయే**
**వదన సరోజే సదా వసతు ॥**

నారాయణా ! కరుణా మూర్తీ ! నీ చరణములు శరణుపొందెద, ఇట్లీ "షట్పదీ స్తోత్ర" మెల్లపుడు నా వదనారవిందమున నెలవుకొనుగాక! షట్పది యనగా తుమ్మెద, తుమ్మెద అరవిందమునందుండుట లోకసిద్ధము.

**ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం షట్పదీ స్తోత్రం సంపూర్ణమ్.**

# కాశీసారము

1. **అధికాశి కాలపరిపాక మీయుషా**
   **మురగీభ వేయు రుపవీతతంతవః**
   **వసనం దిశో నివసనం పరేతభూ**
   **రశనం విషం చ యది గచ్ఛ రోచతే ॥**

కాశీక్షేత్రమున మృతిఁబొందిన వారలకు సర్పములు జందెములును, వల్లకాడునికి పట్టును దిశలే వస్త్రములును, విషమే భోజనమును నగును. ఇట్లగుట నీకిష్టమైనచో నచ్చటికిఁ బొమ్ము. (శివస్వరూపము కలుగునని భావము).

2. **మూర్ఛాను మూర్ఛాసు ముహుస్స్ను రంతి**
   **సంజ్ఞాసు సంజ్ఞాసుచ సంకుచంతి**
   **కపాల మిందుః కరిచర్మ నాగాః**
   **కాశ్యా మహో! కంఠగతాసు జంతోః**

కాశీనగరమునఁ గంఠగతప్రాణులకుఁ బ్రతిమూర్ఛయందును సర్పములు, గజచర్మము, చంద్రుఁడు, కపాలము గనఁబడుచు తెలివి కలిగినపు డెల్ల మాయమగు చుండును. ఔరా! (ప్రాణోత్క్రమణ సమయమున నరులకుఁ కాశీ క్షేత్రమున శంకరుఁడు ప్రత్యక్ష మగునని భావము.)

3. **అధికాశి మహచ్చిత్ర మహినా కబలీకృతః**
   **మండూక స్తేన బధ్నాతి కపర్దం దృఢ మాత్మనః**

కాశీ నగరమునం దొక విచిత్రము కలదు. అచటఁబాముచే మ్రింగఁబడిన కప్ప తిరిగి తన జటాజూటము నా పాముచేతనే కట్టి బిగించుకొనుచున్నది. (కాశిలో మరణించిన తిర్యగ్జంతువులు సైతము శివస్వరూపమును బొందునని భావము.)

4. **లతా కాపి తరుః కోఽపి కాశ్యా మాశ్చర్యదంపతీ**
   **సా చాపర్ణా సచ స్థాణు ర్దదాతే వాంఛితం ఫలమ్ ॥**

వారణాసియం దొక్క లతకును నొక్క వృక్షమునకును విచిత్రమైన దాంపత్యము కలదు. ఆ లత యపర్ణ (ఆకులు లేనిది. అపర్ణ = పార్వతి) ఆ భూరూహము స్థాణువు. (మొద్దు. స్థాణువు = ఈశ్వరుడు) కాని కోరిన కోర్కెల నన్నింటి నాదంపతు లొసంగుచుందురు. (వారణాసిలో నుమామహేశ్వరు లను దంపతులు భక్తులు కోరిన కోర్కెల నెల్ల సఫలము గావింతురని భావము.)

**5. గచ్ఛామి కాశీం శివరాజధానీం**
**స్నాస్యామి గంగాసలిలే శుభావహే**
**ద్రక్ష్యామి విశ్వేశ్వర మాదిదైవం**
**యాస్యామి ముక్తిం సుకృతై స్త్వలభ్యామ్.**

మహేశ్వరుని నగరమైన కాశీపట్టణమునకుఁ బోవుదును. మంగళకరమైన గంగాతోయమునందు స్నానము సేయుదును. అద్యుని శివుని గన్నుల కఱవుదీఱఁ గనుగొందును. సకల సుకృతములచేతను దుర్లభమైన ముక్తిని జూఱఁ గొందును.

6. **అనిలో మృగనాభిరేణుగంధి ర్హర వామాంగకుచోత్తరీయజన్మా**
**హరతే మరణశ్రమం జనానా మధికాశి ప్రణవోపదేశకాలే.**

మనోజ్ఞమై కస్తూరికా రేణుగంధిలమై శివుని వామాంగకుచోత్తరీయ సంజనితమైన పిల్లగాడ్పు కాశీపురమందుఁ బ్రణవోపదేశసమయమున దేహుల మరణశ్రమ మరపించుచు లాలించుచున్నది (ఉత్క్రమణ సమయమున దేహునకు శంకరుఁడుమా సమేతుఁడై ప్రణవోపదేశము సేయునవి భావము).

**7. సంవర్త్యతే కైః కిల కాశికేయం**
**జంతో స్థితస్యాస్య యతోఽంతకాలే**
**పచేళిమైః ప్రాక్తనకర్మభావై**
**రోంకార మోంకారయతీందుమౌళిః.**

పరిపక్వ పూర్వకర్మ వశగులైన మానవులచేత నంతమందెచ్చట శంకరుండు ప్రణవమంత్రము నోంకరింపఁజేయునో యట్టి కాశీక్షేత్ర మహాత్మ్యమును వర్ణింప నెవ్వనికిఁ దరము ?

**8. కాశ్యా మవశ్యం త్యజతాం శరీరం శరీరిణాం నాస్తి పునశ్శరీర మ్**
**యద్యస్తి కంఠే గరళం లలాటే విలోచనం చంద్రకళా చ మౌళౌ.**

కాశీక్షేత్రమున మృతిఁబొందువారలకు ముఖ్యముగాఁ దిరిగి శరీరము కల్గదు. కలుగుటయే సంభవించినచోఁ గంఠమున విషమును, ఫాలభాగమున మిక్కిలి కన్నును, మూర్ధమందుఁ జంద్రకళయును గలుగును. (కాశియందు మరణించిన వారికి మరల జన్మము కలుగనే కలుగదు. కలిగినను శివస్వరూపమే కలుగునని భావము.)

**9. అయమర్థో మృషా గంగే! యథాబీజ స్తథాంకురః**
**జంతుబీజ స్త్వయా సిక్తో జాయతే శంకరాంకురః**

యథాబీజ స్తథాంకురయను పూర్వోక్త నియందబద్ధమైనది. ఓ జాహ్నవీ! అది నిజమగునేని నీయందు మునిఁగిన జంతుబీజము శంకరాంకురము నెట్లీనఁగలదు ? (జాహ్నవీ జలసిక్తమైన జంతువు శంకర స్వరూపము నొందుచున్నదని భావము.)

**10. అహో ! వాణిజ్య సంపత్తిః కాశీపురనివాసినాం**
**ఏకః పంచత్వ మాపన్నో జాయతే పున రష్టధా.**

ఆహా! కాశీపట్టణవాస్తవ్యుల ప్రసిద్ధమైన వాణిజ్యవైభవ మేమని చెప్పవచ్చును ? ఒకటి యైదయి తిరిగి యెనిమిదిగాఁ బుట్టుచున్నది. (కాశీపట్టనమున మరణించిన వాఁడష్టమూర్తి (శివుడు) యగుచున్నాఁడని భావము. శివుని అష్ఠమూర్తులు ప్రుధ్వీ, నీరు, అగ్ని, వాయు, ఆకాశ, రవి, చన్ద్ర, ఆత్మలు)

**11. విమలం పరిలఘు శిశిరం గంగే ! తవ వారి కథ మహం గాహే**
**మలినయతి కంఠమూలం జటిలయతి శిరో నిటల ముష్ణయతి.**

గంగా! పరిశుద్ధయును, మిగులఁదేలికయైనదియును, నత్యంతము శీతల స్వభావముకలదియు నైన నీజలములయం దెట్లు మునుఁగుదును ? ముఁనిగిన వెంటనే కంఠమూలము నీలముగా నగుచున్నవి తల జటిలమౌను. పాలభాగము వేఁడియెక్కును. (గంగాజలములందు మునిఁగినవాఁడు శివస్వరూపము జెందునని భావము.)

**12. శశకోఽహం పురా మతంగజోఽహం మనుష్యోఽహం**
**ఇత్యన్యోన్యం జల్పంతః కా పురనూతనపశుపతయః**

వారణాసిలో నవీనముగా బయలు వెడలుచున్న శంకరులు తామొక రొకరితోఁ దొలిజన్మమును నేను గుందేలుననియు, నేను దోమననియు, నేను మనుష్యుఁడననియు, నేను దంతావళముననియు నీవిధముగా మాటలాడుకొనుచుందురు. (కాశీపురమునఁ బంచత్వమును బొందిన శశక, మశక, గజ, మనుష్యులు సమానముగ శంకరస్వరూపమును బొందుచున్నారని భావము.)

**13. కాశీ భూసారోవా య దమరతటినీ జలస్వభావో వా**
**పతితం యత్రశరీరం ప్రభవతి నారీనరాత్మకం రూపమ్.**

గంగాజల స్వభావమో లేక కాశీక్షేత్ర భూసారమో యెఱుఁగరాదు గాని యచ్చట మరణించినవారు స్త్రీ పురుషమిశ్రితమైన రూపమును దాల్చుచున్నారు. (అర్ధనారీశ్వరులగుచున్నారని భావము.)

**14. కళత్ర సంసర్గ నితాంతభీతాః కాశీంగతాః కాలవశాన్మనుష్యాః**
**కళత్రిన స్తేపి కళేబరార్ధే వహం త్యహో! వారినిధేః కళత్రమ్.**

నరుఁ డొకభార్య సంసర్గమువలన తీవ్రమైన భీతిచేతఁ కాశీనగరమున కేగి యచ్చట మరణించి సగము శరీరమునం దొక భార్యను ధరించి పైఁగా శిరము పై వేరొక భార్యను వహించుచున్నాఁడు. ఔరా! ఎంత చోద్యము ! (శంకరుఁడగుచున్నాడని భావము.)

**15. వారణాసీవాసవతాం జనానాం సాధారణే శంకరలాంఛనేపి**
**పార్థప్రహారవ్రణ ముత్తమాంగే ప్రాచీన మీశం ప్రకటీకరోతి.**

వారణాసీపురమున నివసించెడు వార లందఱకును శివచిహ్నములు సమానములే యైనను పార్థ గాండీవ ప్రహారమువలనఁ దలపైఁగలిగిన బొప్పిచేఁ బ్రాచీనుఁడైన పరమేశ్వరుని గుర్తింపనగును. (వారణాసియందు వసించు వారెల్లరును శంకర లాంఛనములతో నలరారుచుందురనియుఁ బ్రాచీనుఁడైన శంకరుని గనుగొనవలసి వచ్చినచోఁ బూర్వ మర్జునునితోఁ గిరాత వేషమున సమరమొనరించినప్పుడు తలపై బడిన గాయముచేతనే కనుగొనవలయేనని భావము.)

**16. కతి సురసరితః కతీందు రేఖాః**
**కతికతి సంతి కరోటయో విధీనామ్**
**అభినవగిరిశాన్ ప్రసాదయంత్యాః**
**ప్రతిదివసం తవ కాశి ! కోశగేహే.**

కాశీనగరమా ! క్రొత్త క్రొత్త శంకరుల నందఱ నలంకరింపఁ జేయుటకై నీ భాండాగారమున బ్రహ్మకపాలములును, జంద్రకళలును, మందాకినులు నెన్ని కలవో కదా !

**17. గంతవ్యా మదనాంతకస్య నగరీ దేవస్య వారాణసీ**
**స్నాతవ్యం జనఘోరపాపమథనే భాగీరథీపాథసి**
**కర్తవ్యం గృహమేధినాం పటకుటీవాటీషు బిక్షాటనం**
**మర్తవ్యం మణికర్ణి కాతటభువి ప్రాప్తవ్య మాద్యం మహః**

మహేశ్వరుని రాజధానియైన కాశీపురమునకు పోవలయును, సర్వ జనుల మహాపాతకముల నెల్ల హరించు భాగీరథీ పవిత్రోదకముల యందే మునుంగవలయును. కాశీక్షేత్రము నందు నివసించు గృహమేధుల ముంగిళుల యందే బిక్షాటనము సలుపవలయును. మహామహిమోపేతమగు మణికర్ణికా తటము నందే మేను దొరంగవలయును. జగద్రక్షాదక్షమును బ్రసన్నతాపూర్తిచే భక్త జనుల ననుసరించియున్న భవతాపమును బాపఁజాలునది యును నైన యాది తేజమునే కన్నుల కఱపుదీఱఁ గాంచవలయును. (ఇయ్యదియే జన్మమునకు ఫలములని భావము.)

**18. వారాణసీ మీశ్వరరాజధానీం వసంతు విశ్వేశ్వర మర్చయంతు**
**శ్వపాచకా నాహుతి పాచకాన్వా ముక్త్యంగనా యత్ర సమంవృణితే.**

ఏ పురవరమునందు యాయజుకులతో సమముగ శ్వపచులను (చండాలును) సైతము ముక్తికాంత వరించుచున్నదో యట్టి శివుని పురమైన కాశీ క్షేత్రము నందే నివసింపుఁడు పాపరహితులారా! శంకరునే భక్తిచె బూజింపుఁడు.

**19. సంప్రాప్య కాశీం శివరాజధానీం**
**కింయాసి రే మూఢ ! దిగంతరాణి**
**నిధానకుంభం చరణేన హత్వా**
**చండాల సేవాం ప్రకటీకరోషి.**

మహేశ్వరుని నగరమైన కాశీపురమును జేరియును మూర్ఖుఁడా! దిక్కుఁలను బరిభ్రమించు కోర్కెను విడువవేల ? పెన్నిధికుంభమును గాలిచేఁ గూల దాఁచి చండాలసేవను బ్రకటించుకొనియెదవేల ? (కాశీక్షేత్రమును జేరియు నితర క్షేత్రములను గూర్చి పరిభ్రమింప నిశ్చయించుట పెన్నిధిని గాలితోఁదన్ని చండాల సేవ సేయఁ గోరుట వంటిదని భావము.)

**20. కాశివాసిని జనే వనేచరే ద్వి(త్రిభుజ్యపి సమీరభోజనే**
**స్వైరచారిణి జితేంద్రియేఽ_ప్యహో! కాశివాసిపురుషే విశిష్టతా.**

వాయుభక్షణసేయుచు నిర్జితేంద్రియుఁడై వనములందు నిరంతరము తపస్సు సేయువానికంటె స్వేచ్ఛాసంచారియై దినమునకు రెండుమూడు సారులు భుజించు వాఁడైనను కాశీవాసియగు పురుషునియందే విశిష్టత్వము కలదు. (ఇతర ప్రదేశ ములయందున్న నియమబద్ధుడై తపస్సు చేయువానికన్నఁ కాశీక్షేత్రవాసియగు పురుషుడెట్టి వాడైనను వాఁడే శ్రేష్ఠుడఁని భావము.)

**21. మగ్నార్థకాయో మణికర్ణి కాయాం**
**సంచితయ న్నాత్మని విశ్వనాథమ్**
**పంచాక్షరావర్తనతత్పరస్సన్**
**ముంచే మదంగం ముదితః కదాహమ్.**

మణికర్ణికయందుఁ గటిదఘ్నంబుగా మునిఁగి పంచాక్షరీధ్యాన పరుఁడనై మహేశ్వరుని దలఁచికొనుచు మహానందభరిత మానసుఁడనై యెన్నడీ దేహత్యాగము సేయుదునో కదా ?

**22. చరణౌ చరతాం పురా జరాయా**
**పుర మిష్టాం పురశాసనస్య కాశీమ్**
**పురతో మృతేవ యత్ర పశ్చా**
**న్మ్రియమాణ ప్రణవోపదేశదక్షః**

చరణములారా! తొలుత మరణించినవారు వెనుక మరణించు వారి కేపురంబునఁ బ్రణవోపదేశమును జేయ సమర్థులగుచున్నారో.యా శివేష్టపురమగు వారణాసికి వృద్ధత్వము రాకమున్నె పొందు.

**23.** **అపునర్భవ వైభవాభిలాషా దధివారణాసి యః కరోతి వాసం**
**స పునర్భవేవ జంతు రంతే తదితర ఘట్టకుటీప్రభాత మాసీత్**

తిరిగి పుట్టకుండుటయను మహావైభవమును గోరినవాఁడై యెవ్వఁడు వారణాసీపురమున వాసము చేయునో వాఁడంతమునం బునర్భవుఁడగుచునే యున్నాఁడు. ఇదియేకదా ఘట్టకుటీ ప్రభాత న్యాయము ! (ఎవ్వఁడు మోక్షమును గాంక్షించి కాశీవాసము సేయుచున్నాఁడో వాఁడు మరణించి తిరిగి భవుఁడే (ఈశ్వరుఁడే) యగుచున్నాఁడని భావము.)

(ఒకఁడు సుంకము నెగవేయఁదలంచి యర్ధరాత్రమున బయలు దేరి దారి తెలియక రాత్రియంతయు నిటునటుం తిరిగి తెల్లవారు నప్పటికి సుంకమును వసూలు చేయు చావడివద్దకే చేరును. ఇదియే ఘట్టకుటీ ప్రభాతన్యాయము.)

**24.** **కదా వారాణస్యా మమరతటినీరోధసి వసన్**
**వసానః కౌపీనం శిరసి నిదధానోఽఞ్జలిపుటమ్**
**అయే ! గౌరీనాథ ! త్రిపురహర ! శంభో ! త్రినయన !**
**ప్రసీదేత్యాక్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్.**

దేవగంగా తీరమునందు కౌపీనము ధరించినవాఁడనై శిరమునందు మోడ్పుగేలు గీలించి సదాశివ! శూలి ! మహేశ్వర ! పార్వతీవల్లభా ! నాయెడ బ్రసన్నుఁడగుమా యనుచు నెప్పుడు కాశీనగరమున నిమిషంబులంబోలె దినంబులను వెళ్ళఁబుచ్చఁగలనో కదా !

**25.** **దోషాపనుత్తయే కాశీం గత్వాత్యక్త్వా కళేబరమ్**
**తత్రాయం జాయతే చిత్రం దోషాకరశిరోమః**

దోషసంక్షాళనార్థమై వారణాసికిం జని యచట మరణించి తిరిగి నరుఁడు దోషాకరశిరోవతంసుఁడై జన్మించుచున్నాఁడు. ఆహా! ఇట్టి విచిత్ర సంఘటన మెచ్చటనైనఁగలదా ? (వారణాసియందు మృతిఁబొందిన మనుజుఁడు దోషాక శిరోవతంసుడుఁ చంద్రుఁడే శేఖరముగాఁ గలవాఁ (ఈశ్వరుఁ) డగుచున్నాఁడని భావము.)

**26.** **శ్రీమద్విశ్వేశ ! కాళీ గిరివరతనయా సాచ గంగేతి తిస్రః**
**ప్రేయస్య స్తత్రకాశ్యాం త్వమసి కృతరుచి ర్నేతరత్రో భయోర్యత్**
**తత్రాద్యా త్వత్సరూపాన్ ధృతగరళగళాన్ ఫాలనేత్రాన్ ప్రసూతే**
**పుత్రా నర్ధేందుమౌళీ నహహ! కథ ముభే తేగజాస్యం షడాస్యమ్.**

విశ్వనాథా ! నీకుఁ గాశియను నామెయు, గిరిరాజకుమారియగు పార్వతియు, గంగయు నిల్లాండ్రు. వారి ముగ్గురలోఁ కాశీసతియందు మిగుల ననురాగ యుక్తుడవై యుందువు. ఏలయన నామె నిన్నుఁబోలిన చంద్రశేఖరులను గరళ గ్రీవులను

ఫాలనేత్రులను జన్మనిచ్చుచున్నది. గౌరియు గంగయు నన్ననో నీకు విరుద్ధ స్వరూపులైన గజవదనుని షడాననునిc జన్మకారకులైన భార్యల కంటెను ప్రీతికరమైయున్నది. (కాశియం దెల్లరును శంకర స్వరూపులని భావము.)

**27. గమిష్యామః కాశీనగర మగరాజస్య తనయా**
**కరాందోల ద్దర్వీతల సుల భభిక్షామృతరసమ్**
**యదంతర్వాస్తవ్యై స్సతత ముపనిద్రై స్సుకృతిభి**
**ర్నిశాసు శ్రూయంతే హరవృషభ ఘంటాఘణఘణాః**

ఏ పట్టణమునం దాకొనియున్న వారలకు నగాత్మజాత దర్విచే మనోహరమైన హస్తముతో సుధారసభిక్షను బెట్టుచున్నదో, యే పురవరంబున సుకృతవశంబున ననారతము శంభువాహనమైన నందీశ్వరుని ఘంటానాదము శ్రవణ పేయముగ విననగుచున్న యట్టి కాశీపురమున కేగెదము.

**28. ఆకంఠం సలిలే నిమజ్య పులినాభోగోపధానే శిరః**
**కృత్వా శైలసుతాపతే ! పురరిపో ! గంగాధరేత్యాలపన్**
**గృహ్ణన్ కర్ణపుటే శివేన కృపయా ప్రత్యాహృతం తారకం**
**తీరే జాహ్నవి ! జహ్నునందని ! కదా మోక్షే శరీరం ముదా.**

గంగా ! నీజలములం దాకంఠము మునింగి శిరంబును యిసుకతిన్నెలను తలగడయందుc జేర్చికొని శంభూ ! పార్వతీ రమణా ! పురహరా! గంగాధరా! యని వాకొనుచుc గృపతోడ శివుండు గర్ణపుటమునందు సూచించు మహనీయమగు తారకమంత్రమును గ్రహించి సంతృప్తుcడనై యెన్నcడీ దేహమును దృజియించెదనో కదా ?

**29. కాశ్యాం నవీనరుద్రాణాం భూషాయై భోగిమండలే**
**అశేషే నిర్గతే శేష శ్శేషేஉభూ న్న ఫణీశ్వరః.**

కాశికా నగరమందలి క్రొత్తరుద్రుల యలంకారార్థమై పాతాళమునందలి సర్ప సమూహ మంతయుం గదలిపోవ నాదిశేషుcడు, శేషుcడే (మిగిలినవాcడే) యాయ్యెc గాని ఫణీశ్వరుడు మాత్రము గాకపోయెను. సర్పము లుండినcగదా శేషుcడు ఫణీశ్వరుడగుట ? సర్పములన్నియుం బోయిన పిమ్మట శేషుcడు మాత్రముగాక వేనికి రాజగును? కాcడనుట.

**30. ధ్యేయః కాశీవిశ్వనాథో మహేశో**
**రుద్రాక్షోవై భూతి రామ్నాయవేద్యా**
**మంత్రాధీశో భాతి పంచాక్షరీయం**
**నిస్తుల్యోஉయం శుద్ధకైవల్యమార్గ ః**

మహేశ్వరుఁడే ధ్యానింపఁదగినవాఁడు. వేదచోరితములైన విభూతి రుద్రాక్షలే ధరింపదగినవి. మహామహిమో పేతమగు పంచాక్షరీ మంత్రరాజమే జపింపఁ దగినది. నిరుపమానమును బరమ కైవల్యప్రాప్తికి మార్గమును నిదియే !

**31. క్షేత్రాణి సంతి కతి నాబ్జభవాండమధ్యే**
**నశ్యంతి తాని కథితాని యుగే యుగే చ**
**ఏకా కళాధర కళాధర రాజధానీ**
**కల్పాంతరేషు న వినశ్యతి వారణాసీ.**

**32. మహారాజోఽపి తే తోయే మజ్జ న్భిక్షు ర్దిగంబర**
**గంగే ! తుంగ తరంగాఢ్యే! మాదృశాం కీదృశీ గతిః**

మహిమోపేతములై మనోజ్ఞములై యుత్తుంగములైన భంగములచే నలరారు నో గంగాభవానీ! మహారాజు సైతము నీజలములందు మునింగి సర్వము త్యజించి భిక్షువును దిగంబరుండును నగునన నింక మాబోటుల గతి యేమియో యెవ్వరు చెప్పఁగలరు ? (శంకరుఁడగునని భావము.)

**33. కదా శయానో మణికర్ణి కాయాం**
**కర్ణే జప త్యక్షర మిందుమౌళౌ**
**అవాప్య నిద్రాం గతమోహముద్రాం**
**నాలోకయామీహపునః ప్రపంచమ్.**

మణికర్ణికాతీరమున శయనించియున్న సమయమున శ్రవణపుటమునందు శంకరుఁడు ప్రణవమంత్రము నుపదేశించుచుండఁగాం బోయిన మోహముద్ర గలిగిన నిద్రా సుఖము ననుభవింప మరల నెన్నఁడీ మహోగ్రకలుషసంభరితమైన ప్రపంచమును గాంచకుండుదునోగదా ?

**ఇతి శ్రీ శంకరాచార్య కృత కాశీసారం సంపూర్ణమ్**



## కాశీ పంచకమ్

**1. మనో నివృత్తిః పరమోప శాన్తిః**
**సా తీర్థవర్యా మణికర్ణి కాచ**
**జ్ఞానప్రవాహో విమలాది గంగా**
**సా కాశికాఽహం నిజబోధరూపా.**

(కాశీ క్షేత్రమునకు అవిముక్త క్షేత్ర మని పేరు. అది నాశనము పొందునది కాదు. ప్రళయ కాలమున కూడ త్రిశూలముపై నిడి పరమశివుడు దానిని ప్రళయ

జలరాశినుండి ఉద్ధరించి కాపాడునట. సర్వపదార్థాభావక చైతన్యము ఆ కాశీ క్షేత్రము యొక్క తాత్త్విక స్వరూపము. అదియే నా జీవాత్మ యొక్క యథార్థ తత్త్వము (స్వరూపము). ఇట్టి విజ్ఞానము కలుగుటయే కాశీ క్షేత్ర యాత్రా సారాంశము. ప్రసిద్ధ కాశీ క్షేత్రమున మణికర్ణిక - గంగ మొదలగు పుణ్య తీర్థముల నేకములు కలవు. అవి కాశీ క్షేత్రము యొక్క ఆధి భౌతిక రూప విశేషములు. ఆ పుణ్య తీర్థములు మానవుని శరీరము నందును ఆ యా రూపమున నున్నట్లు భావన కొఱకు పెద్దలు వర్ణించుచుందురు. ఆ భాగములు కాశీ క్షేత్రము యొక్క ఆధ్యాత్మిక రూపములు. ప్రతి క్షేత్రము యొక్క ఈ ఉభయవిధ స్వరూపములను తెలిసికొనుటయు, తాత్త్విక స్వరూపమును గుర్తించుటయు మానవులకు సంసార తరణ సాధనము.)

మనస్సు యొక్క నివృత్తియు-తత్ర్పయుక్త మైన ఉత్కృష్టమగు శాంతియు తీర్థ శ్రేష్ఠమగు మణికర్ణికాతీర్థము - బ్రహ్మ తత్త్వజ్ఞాన సంతతియే విమలమగు ఆది (వృద్ధ) గంగా తీర్థము - ఆత్మజ్ఞానమే స్వరూపముగా గలది కాశీ క్షేత్రము. ఇది కాశీ క్షేత్రముయొక్క తాత్త్విక స్వరూపము. అట్టి కాశీ క్షేత్రము నేనే.

**2. యస్యా మిదం కల్పిత మింద్రజాలం**
**చరాచరం భాతి మనోవిలాసమ్**
**సచ్చి త్సుఖైకా పరమాత్మ రూపా**
**సా కాశికాఽహం నిజబోధ రూపా.॥**

ఏ వస్తువునందు ఇంద్రజాలమువలె మనో విజృంభణ మాత్రమైన భ్రాంతిచే కల్పితమైన ఈ చరాచరాత్మక ద్వైత ప్రపంచ మంతయు భాసించు చున్నదో, సచ్చిదానందాత్మకమైన - అద్వితీయమైన పరమాత్మ స్వరూపమైన ఆ వస్తువు, ఆత్మ జ్ఞానమే స్వరూపముగా గల కాశీ క్షేత్రమే. అట్టి కాశీ స్వరూపుడను నేనే.

**3. కోశేషు పంచ స్వధి రాజమానా**
**బుద్ధి ర్భవానీ ప్రతి దేహ గేహమ్**
**సాక్షీ శివ స్సర్వగతోఽ న్తరాత్మా**
**సా కాశికాఽహం నిజబోధరూపా. ॥**

సమస్త ప్రాణుల యొక్క దేహముల నెడి గృహములయందు అన్న మయాది పంచకోశముల నధిష్ఠించి ప్రకాశించుచున్న పంచకోశములను తెలియజేయునదియై పంచకోశాతీతమైయున్న బుద్ధి వృత్తి యేది కలదో అది అన్నపూర్ణా విశాలాక్షీ ఇత్యాది నామములతో వ్యవహరింపబడు కాశీ క్షేత్రాధిష్ఠాత్రి యగు దేవతా మూర్తి భవానీదేవి. సర్వగతుడైన అంతరాత్మయగు సర్వసాక్షి చైతన్య మూర్తియౌ శివ తత్త్వము కాశీ క్షేత్రాధి దైవమగు విశ్వేశ్వరుడు. ఆత్మ జ్ఞానమే స్వరూపముగా గలది కాశీ క్షేత్రము - ఆ కాశీ స్వరూపుడను నేనే.

**4. కాశ్యాం హి కాశ తే కాశీ, కాశీ సర్వప్రకాశికా**
**సా కాశీ విదితా యేన, తేన ప్రాప్తా హి కాశికా.**

కాశీ క్షేత్రమున "కాశీ" యను నొక దేవత ప్రకాశించుచున్నది. ఆ కాశీ దేవత సర్వ ప్రకాశిక చిద్రూపిణియే అయి యున్నది. ఆ దేవత యొక్క తత్త్వమెవ్వనిచే తెలిసికొనబడునో యాతడే కాశీ క్షేత్రమును చేరినవాడన దగును.

**5. కాశీక్షేత్రం శరీరం త్రిభువన జననీ వ్యాపినీ జ్ఞానగంగా**
**భక్తి శ్శ్రద్ధా గయేయం నిజగురుచరణ ధ్యానయోగః ప్రయాగః**
**విశ్వేశోఽయం తురీయ స్సకల జనమన స్సాక్షి భూతోఽంతరాత్మా**
**దేహే సర్వం మదీయే యది వసతి పున స్తీర్థమన్యత్కిమస్తి.**

కాశీక్షేత్రము నా శరీరము – ముల్లోకములకు తల్లియై, ముల్లోకములను వ్యాపించి యున్న జ్ఞాన రూపమగు గంగ నా చిత్తమున గల భగవద్భక్తి – గయా క్షేత్రము నాకు గల ఆస్తిక్యబుద్ధి – ప్రయాగ క్షేత్రము స్వగురు చరణములను ధ్యానించుటలో నాకు గల చిత్తైకాగ్ర్యమను యోగము– విశ్వేశ్వరుడు (కాశీక్షేత్ర ప్రధానదైవము) సకల జనులయొక్క మానసిక వృత్తులకు సాక్షియైన అంతరాత్మ స్వరూపమగు నా తురీయాత్మతత్త్వము. ఇట్లు నా దేహముననే సర్వతీర్థములును నివసించి యుండగా నాచే సేవింపదగిన పుణ్య తీర్థము మరియొకటి యేమి కలదు. (ఇట్టి భావనము సర్వ తీర్థయాత్రా ఫలదాయకమనియనుట).

*శ్రీ శంకరాచార్య కృత కాశీపంచకము సంపూర్ణమ్.*

## యతి పంచకమ్

**1. వేదాంత వాక్యేషు సదా రమన్తో**
**భిక్షాన్నమాత్రేణ చ తుష్టిమన్తః**
**విశోకవన్తః కరణైకవన్తః**
**కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః.**

వేదాంత వాక్య విచారమునందే ఎల్లప్పుడు కాలము గడుపుచు ఆనందించు చుండువారును, భిక్షాన్నము మాత్రముననే (మధురాహారముల కోరకయే) సంతుష్టులై యుండువారును, శోకము ఏ మాత్రమును లేక యుండువారును, నేత్రము, శ్రోత్రము హస్తము, పాదము మొదలగు తమ ఇంద్రియములే తప్ప ఇతర పదార్థ సంగ్రహము లేక యుండువారును, కౌపీనమును మాత్రము ధరించినవారును అగు యతివర్యులే లోకమున మహా భాగ్యశాలురుగ నెన్నదగినవారు.

2. మూలం తరోః కేవల మాశ్రయన్తః
పాణిద్వయం భోక్తు మామంత్రయన్తః
కన్థా మివ శ్రీ మపి కుత్సయన్తః (కౌపీన పంచకమ్)
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః

నివాసమునకై సౌధాదులే కాంక్షించక వృక్షమూలములను మాత్రము ఆశ్రయించి యుండువారును, తమ చేతులనే భోజన పాత్రలుగ జేసికొనువారును (అనగా భోజనము కొఱకైననూ పాత్రలు వగైరాలను సంగ్రహించుకొను స్వభావము లేని వారని యర్థము) మహదైశ్వర్యము ప్రాప్తించినను చినిగిపోయిన పాత గుడ్డపీలికనువలె ఏ వగించుకొనువారును, కౌపీనమును మాత్రము ధరించినవారును అగు యతివర్యులే లోకమున మహాభాగ్యశాలురుగ నెన్నదగినవారు.

3. దేహాదిభావం పరమార్జయన్తః
ఆత్మాన మాత్మ న్యవలోకయన్తః
నాన్తం నమధ్యం నబహి స్స్మరన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః

దేహేంద్రియాదులయందు నేను అనెడి ఆత్మభావమును (తాదాత్మ్యాభిమానమును) నిర్మూలింప జేయుచున్న వారును, ఆత్మ తత్త్వమును అంతః కరణము నందు చక్కగా సాక్షాత్కరింప జేసుకొన్నవారును, పరిపూర్ణాత్మత త్వానుసంధాన తత్పరులగుటం జేసి ఆది మధ్య అంతములను భావములను గాని, లోపల వెలుపల అను భావములను గాని స్మరింపక యుండు వారును, కౌపీనమును మాత్రము ధరించిన వారును నగు యతివర్యులే లోకమున మహా భాగ్యశాలురుగ నెన్నదగిన వారు.

4. స్వానందభావే పరితుష్టిమన్తః
సంశాన్త సర్వేంద్రియ దృష్టిమన్తః
అహర్నిశం బ్రహ్మణి యే రమన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః ॥

ఆత్మయొక్క నిజ స్వరూపమైన ఆనంద భావమున ఎల్లప్పుడు సంతుష్టులై యుండువారును, సమస్తేంద్రియ వ్యాపారముల నుడిగింప జేసికొని యున్నవారును అగుచు ఎవరు రాత్రిం బవళ్ళు బ్రహ్మతత్త్వమునందే రమించుచుందురో అట్టి కౌపీన ధారులగు యతివర్యులే లోకమున మహాభాగ్యశాలురుగ నెన్నదగినవారు.

5. పంచాక్షరం పావన ముచ్చరన్తః
పతిం పశూనాం హృది భావయన్తః
భిక్షాశనా దిక్షు పరిభ్రమన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః.

పరమ పావనమగు పంచాక్షర మంత్రమును జపించుచు పశుపతియగు పరమ శివుని నిరంతరము హృదయమున ఆత్మ స్వరూపునిగ భావన చేయుచు, భిక్షాన్నమాత్ర భోజనులై నానా దిక్కులయందు స్వేచ్ఛగ సంచరించుచు (కృతకృత్యు లగుటచే వారికి ఏ చోటుననూ కర్తవ్యమగు కార్యము ఉండదు. కాన ఏకత్ర నివాసము వారి కావశ్యకము కాదు), కౌపీనమును మాత్రము ధరించు యతివర్యులే లోకమున మహా భాగ్యశాలురుగ నెన్నదగినవారు.

*శ్రీ శంకరాచార్యకృత యతి పంచకము సంపూర్ణమ్.*

## ధన్యాష్టకమ్

**1. త్ జ్ఞానం ప్రశమకరం య దింద్రియాణాం**
**త్ జ్ఞేయం యదుపనిష త్సునిశ్చితార్థమ్**
**తేధన్యా భువి పరమార్థ నిశ్చి తేహాః**
**శేషాస్తు భ్రమనిలయే పరిభ్రమన్తి ॥**

ఇంద్రియములకు ప్రశాంతిని కలుగజేయు జ్ఞానమేదియో అదియే ముఖ్యమగు జ్ఞానము అనియే చెప్పదగినది. అట్లే సర్వోపనిషత్తుల యందు ఏకరూపముగ నిశ్చయింపబడిన జీవాత్మా పరమాత్మా భేదము అను విషయమే ముఖ్యముగ తెలిసికొనదగిన విషయము. పరమార్థమగు మోక్షమును పొందుటకు శాస్త్రములయందు నిశ్చయింపబడిన వ్యాపారములను మాత్రము చేయుచు నుండువారే ఈ లోకమున ధన్యులుగ చెప్పదగినవారు. అట్టివారు కాక మిగిలినవారందరు భ్రమ నిలయమగు సంసార చక్రమున నిరంతరము తిరుగాడుచుండువారే యగుదురు.

**2. ఆదౌ విజిత్య విషయాన్ మదమోహరాగ**
**ద్వేషాది శత్రుగణ మాహృతయోగరాజ్యాః**
**జ్ఞాత్వామతం సమనుభూయ పరాత్మవిద్యా**
**కాన్తాసుఖం వనగృహే విచరన్తి ధన్యాః ॥**

మొదట రూప రసాది విషయములను జయించి (విషయములం దాసక్తిచే గల్గు చిత్త విక్షేపములను పరిహరింపగల్గి) అట్లే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను శత్రు వర్గమును గూడా జయించి, ధ్యాన యోగమను రాజ్యమును సంపాదించుకొన్న వారై, ఆ తరువాత వృద్ధ సమ్మతమగు పరమ సిద్ధాంతమును తెలిసికొని (పరోక్ష జ్ఞానమును సంపాదించి), అటు పిమ్మట పరమాత్మతత్త్వ విజ్ఞానము వలన సుఖము (పరతత్త్వ సాక్షాత్కారము వలన పరమానంద భావమును పొంది) ననుభవించి విజనారణ్యములను గృహమునందు ధన్యాత్ములు స్వేచ్ఛగ సంచరించు చుందురు.

3. త్యక్త్వా గృహే రతి మధోగతి హేతు భూతా
మాత్మేచ్ఛయోపనిషదర్థ రసం పిబన్తః
వీతస్పృహా విషయభోగ పదే విరక్తా
ధన్యాశ్చరన్తి విజనేషు విముక్తసంగాః ॥

అధోగతికి హేతువైన గృహములయం దాసక్తిని పరిత్యజించి ఆత్మతత్త్వము నధిగమింప తీవ్రమగు వాంఛ గలిగి, ఉపనిషచ్ఛ్రుతిపాదికమైన బ్రహ్మాత్మైక్య రూపమగు విషయమును తెలిసికొని, బ్రహ్మానంద రసమును ననుభవించుచున్నవారై, నిష్కాములై విషయ భోగములయందు దృఢమగు వైరాగ్యము కలవారై నిస్సంగులై విజనారణ్యముల యందు ధన్యాత్ములు స్వేచ్ఛగ సంచరించుచుందురు.

4. త్యక్త్వా మమాహమితి బంధకరే పదేద్వే
మానావమాన సదృశాః సమదర్శినశ్చ
కర్తార మన్య మవగమ్య తదర్పితాని
కుర్వన్తి కర్మపరిపాక ఫలాని ధన్యాః ॥

సంసార బంధమును కలుగజేయు "అహం-మమ" "నేను-నాది" యను రెండు పదములను పరిత్యజించి అహంకార మమకార శూన్యులై మానావమానముల యందు సమానభావము గలవారై, సమ దర్శనము గలవారై - అనగా ఉచ్చావచములగు పదార్థముల యందంతటను ఆత్మాభిన్న బ్రహ్మతత్త్వము దర్శించు స్వభావము కలవారై తన కంటె వేరైన ప్రారబ్దకర్మాంకిత మగు అంతఃకరణమును నిఖిల కార్యకర్తగ తెలిసికొని ధన్యాత్ములు అట్టి అంతఃకరణముచే సమర్పింపబడిన కర్మ పరిపాక ఫలముల ననుసరించి ఆ యా కర్మల నాచరించుచున్నవారై యుందురు. ఆరబ్ధా కర్మానుగుణ క్రియాకారిత్వమే కాని ఆత్మ తత్త్వవేత్తలకు స్వేచ్ఛా కల్పిత క్రియా కారిత్వ ముండదని భావము.

5. త్యక్త్వైషణాత్రయ మవేక్షిత మోక్షమార్గా
భైక్షామృతేన పరికల్పిత దేహయాత్రాః
జ్యోతిః పరాత్పరతరం పరమాత్మ సంజ్ఞం
ధన్యా ద్విజా రహసి హృద్యవలోకయన్తి ॥

దారైషణ, ధనైషణ, పుత్రైషణములను పరిత్యజించి మోక్షమార్గమును తెలిసికొననవారై, అమృత సమానమగు భైక్షముచేత దేహయాత్రను నడుపుకొను చున్నవారై, ధన్యాత్ములగు ద్విజవర్యులు ఏకాంత దేశమున నుండి తమ హృదయాంతరమునందు పరమాత్మ సంజ్ఞకమగు, పరాత్పర తరమగు పరమాత్మ జ్యోతిస్సును స్వాత్మాభిన్నముగ సంతతము సందర్శించుచుందురు.

6. నాసన్న సన్న సదసన్న మహన్నచాణు
నస్త్రీ పుమాన్నచ నపుంసక మేకబీజమ్
యైర్బ్రహ్మ తత్సమ ముపాసిత మేకచిత్తై
ర్ధన్యా విరేజు రితరే భవపాశ బద్ధాః ॥

అసత్తు (తుచ్ఛము–కుందేటి కొమ్ము, వంధ్యా పుత్రుడు మొదలగు వస్తు జాతము వంటిది) కానిదై, సత్తు (అభివ్యక్తనామ రూపాత్మకము) కానిదై, సదస దుభయాత్మకమును కానిదై, మహత్తు కానిదై, అణువు కానిదై, పురుషుడు కానిదై, నపుంసకము కానిదై, సర్వదృశ్య ధర్మ వివర్జితమైన సర్వబ్రహ్మాండములకును ఏకైక కారణమైన, సమమైన ఆ బ్రహ్మతత్త్వము సమాహిత చిత్తులైన ఎవరిచే నిరంతర ముపాసింపబడుచున్నదో వారే ఈ లోకమున ధన్యాత్ములై వెలుగొందుచుందురు. తదితరులు ధన్యులు కారు. వారు సంసారపాశ బద్ధులే అగుచున్నారు.

7. అజ్ఞాన పంక పరిమగ్న మపేతసారం
దుఃఖాలయం మరణజన్మ జరావసక్తమ్
సంసార బంధన మనిత్య మవేక్ష్య ధన్యా
జ్ఞానాసినా తదవశీర్య వినిశ్చయన్తి ॥

సంసార బంధము అజ్ఞానమను పంకమున (బురదలో) మునిగియున్నది, సారరహితమైనది, దుఃఖములకు నిలయమైనది, జన్మ జరా మరణములతో గూడుకొనియున్నది, అనిత్యమైనది అని తెలిసికొని ధన్యాత్ములు జ్ఞానమను ఖడ్గముతో దానిని ఖండించి సంసార విలక్షణమగు పరమాత్మ తత్త్వమును ప్రాప్యముగ నిశ్చయించు కొనుచుందురు.

8. శాన్తై రనన్య మతిభి ర్మధుర స్వభావై
రేకత్వ నిశ్చితమనోభి రపేతమోహైః
సాకం వనేషు విదితాత్మ పదస్వరూపై
స్తద్వస్తు సమ్య గనిశం విమృశన్తి ధన్యాః ॥

శాన్త స్వభావులును, సమాహిత చిత్తులును, మధుర స్వభావులును, జీవాత్మ పరమాత్మలకు గల వాస్తవికమగు ఏకత్వము (అభేదము) నందు నిస్సందిగ్ధమైన నిశ్చితమైన మనస్సు గలవారును, అపగతాజ్ఞానులును, (ఎవరికి అజ్ఞానము నిశ్శేషముగ తొలగిపోయినదో వారు) ప్రాప్యమగు ఆత్మ (స్వరూపమును) తత్త్వమును తెలిసి కొనినవారును, అగు మహాత్ములతో కలసి ధన్యులగువారు విజనారణ్య భూముల యందు ఆ పరబ్రహ్మ వస్తువును గూర్చి నిరంతరము విమర్శించుచు నానందించుచుందురు.

**శ్రీ శంకరాచార్యకృత ధన్యాష్టకము సంపూర్ణమ్.**

## మనీషా పంచకమ్

1. జాగ్ర త్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరాయా సంవిదుజ్జృంభతే
యా బ్రహ్మాది పిపీలికాన్త తనుషు ప్రోతా జగత్సాక్షిణీ
సై వాహం నచ దృశ్య వస్త్వితి దృఢ ప్రజ్ఞాపి యస్యాస్తి చే
చ్చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురు రిత్యేషా మనీషామమ ॥

(వారణాసీ క్షేత్రమున గంగానదీతీరమున తనను సమీపించి వచ్చిన చండాల వేషధారి యగు వేదవ్యాస భగవానునితో కొంత సంవాదము జరిగిన పిమ్మట ఈ వచ్చినవాడు తన గురువగు వేదవ్యాస భగవానుడే యని గుర్తించిన పిమ్మట శ్రీ శంకర భగవత్పాదులు తమ హార్దమగు భావమును ఇట్లు ఆవిష్కరించుచున్నారు.)

జాగ్రత్, స్వప్న, సుషుప్తులను అవస్థాత్రయమునందునూ, ఏ సంవిత్కళ (విజ్ఞానకళ) అనుసరించి వర్తించుచు నున్నదో; ఏ విజ్ఞానకళ బ్రహ్మ మొదలు చీమ వరకు గల ఉచ్చావచదేహముల యందు అనుస్యూతమై వ్యాపించి యుండెనో – ఏ విజ్ఞానకళ సర్వజగత్సాక్షియై యుండెనో – దృఙ్మాత్రస్వభావకమగు ఆ విజ్ఞానమే నేను. కాని దృశ్య (చూడదగిన) వస్తువును మాత్రము కాను, అని దృఢమగు అనుభూతి యెవనికి గలదో అట్టివాడు ఉపాధి (దేహము) వలన చండాలుడు గాని, ద్విజుడుగాని యెవడైననూ వాడు గురుమూర్తియే యని నా నిశ్చయము.

2. బ్రహ్మై వాహ మిదం జగచ్చ సకలం చిన్మాత్ర విస్తారితం
సర్వం చైత దవిద్యయా త్రిగుణయాఽ శేషం మయా కల్పితమ్
ఇత్థం యస్య దృఢా మతి స్సుఖతరే నిత్యే పరే నిర్మలే
చ్చండాలోఽస్తు సచతు ద్విజోఽస్తు గురు రిత్యేషా మనీషామమ ॥

నేను బ్రహ్మవస్తువునే కాని యన్యుడను కాను. ఈ జగత్తంతయు చిన్మాత్రమగు బ్రహ్మవస్తువు యొక్క విస్తృతియే (జగత్తు బ్రహ్మయందు అవిద్యచే కల్పితము గాన నది బ్రహ్మాభిన్నమే యని యనదగును. కల్పితవస్తువులకు అధిష్ఠాన వస్తువులతో అ భేదము అధిష్టాన వస్తుసత్తను బట్టి శాస్త్రజ్ఞులచే చెప్పబడుచున్నది). ఈ జగత్తంతయు త్రిగుణాత్మకమగు అవిద్యా సహాయమున అత్యంత సుఖాత్మకమును, త్రికాలా బాధ్యమును, సర్వోత్కృష్టమును, నిర్మలమును నగు తత్త్వమునందు నాచే (అవిద్యోపాధికుడగు జీవాత్మచే) కల్పింపబడినది. నేను సర్వ జగత్కల్పనాధిష్ఠాన స్వరూపుడను అని ఎవరికి దృఢమగు విజ్ఞానము కలదో అట్టివాడు ఉపాధి (దేహము) వలన చండాలుడు గాని, ద్విజుడు గాని యెవడైననూ వాడు గురుమూర్తియే యని నా నిశ్చయము.

3. **శశ్వ న్నశ్వర మేవ విశ్వ మఖిలం నిశ్చిత్య వాచా గురో**
**ర్నిత్యం బ్రహ్మ నిరంతరం విమృశతా నిర్వ్యాజ శాన్తాత్మనా**
**భూతం భావి చ దుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే**
**ప్రారబ్ధాయ సమర్పితం స్వవపు గురు రిత్యేషా మనీషా మమ॥**

సద్గురువుల యుపదేశ వాక్యముల ననుసరించి ఈ సమస్త ప్రపంచము నశించు స్వభావము కలదియే కాని ఎన్నడు నిత్యమైనది కాదని నిశ్చయించుకొని నిత్యమైన బ్రహ్మ తత్త్వమును నిరంతరము విమర్శించుచు (శ్రవణ మనన నిది ధ్యాసనములు గావించుచు) లయవిక్షేపరహితమై ప్రశాన్తమైన చిత్తము కలవాడై బ్రహ్మతత్త్వ సాక్షాత్కారమును సంపాదించి, ఆ బ్రహ్మతత్త్వ విజ్ఞాన మను మహాగ్నియందు సంచితాగామి కర్మలను నిశ్శేషము దహింపజేసిన మహాత్ముని చేత తన శరీరము ప్రారబ్ధకర్మము కొఱకే సమర్పింప బడుచున్నది - అనగా బ్రహ్మతత్త్వ విధులు తమకు లబ్ధమైన ఈ బ్రాహ్మణ చండాలాది దేహములు ఆరబ్ధకర్మ సంప్రాపితములే యను భావము కలవారై- ఆ దేహాదులయందు అహం మానాభిమానములను తొలగించుకొని పూర్ణాత్మభావ సంపన్నులై యుందురని నా నిశ్చయము.

4. **యా తిర్య జ్నర దేవతాభి రహ మిత్యన్తస్స్ఫుటా గృహ్యతే**
**యద్భాసా హృదయాక్ష దేహ విషయా భాన్తి స్వతోఽచేతనాః**
**తాం భాస్యైః పిహితార్క మండల నిభాం స్ఫూర్తిం సదాభావయన్**
**యోగీ నిర్వృతమానసోహి గురు రిత్యేషా మనీషా మమ॥**

ఏ సంవిత్కళ దేవతలు, మానవులు, పశువులు, పక్షులు, మొదలగు సర్వ ప్రాణుల చేతను "అహం అహం" "నేను నేను" అని బుద్ధి గుహాంతరాళమున స్పష్టముగ గ్రహింప బడుచున్నదో; ప్రకాశాత్మకమగు ఏసంవిత్తు యొక్క ప్రకాశము చేత స్వతః అ చేతనములు జడములు నైన అప్రకాశ స్వరూపములైన హృదయము ఇంద్రియములు దేహములు మొదలగు సర్వ విషయములును ప్రకాశించుచున్నవో, తనచే భాసింపజేయబడు భాస్యములగు వస్తువులచే మూసివేయ బడిన సూర్య మండలమువలె నున్న ఆ సంవిత్కళను స్వాత్మతత్త్వముగ భావించుచు బ్రహానంద తుందిల మానసుడైన యోగి పుంగవుడు గురుమూర్తియేయని నా నిశ్చయము.

(అద్దపు ముక్కలు స్వయముగ ప్రకాశించునవికావు. చీకటిలో నవి ప్రకాశించ నేరవుగదా! కాన నవి దీపభాస్యములు. దీప భాస్యములగు ఆ అద్దపు ముక్కలచే కప్పబడినప్పుడును ఆ దీపము ప్రకాశించుచు నుండునే గాని ఆ దీపము యొక్క స్వరూపమును మాత్రము అజ్ఞానులు యథాతథముగా గ్రహింపక మూతలుగ నున్న అద్దపు ముక్కల యొక్క రంగు కలదిగనే దీప స్వరూపమును గుర్తించుచుందురు. విజ్ఞు లట్లుగాక అద్దపు ముక్కల రంగును మినహాయించి వాస్తవమగు దీప స్వరూపమును

మాత్రమే గ్రహింతురు. అట్లే ఆత్మతత్త్వ ప్రకాశ్యములగు దేహేంద్రి యాధ్యుపాధులచే కప్పివేయబడిన (పిహితమైయున్న) స్వయం ప్రకాశమానమగు ఆత్మ తత్త్వమును (సంవిత్కళను) అజ్ఞులు దేహేంద్రియాది స్వరూపముగనే గ్రహించుచు వానినే ఆత్మగ గ్రహించి వానితో వ్యవహరించుచు సంసార మగ్నులగుచుందురు. తత్త్వవిదులట్లుకాక ఉపాధి తద్ధర్మములనుండి తద్భాసక సంవిత్కళను పృథక్కరించి నిరుపాధికమగు ఆ సర్వావభాసక బ్రహ్మ స్వరూపమగు సంవిత్కళను (చిత్కళను) ఆత్మతత్త్వముగ గ్రహించి, సర్వ వ్యవహార వివర్జితులై నిష్క్రియ నిష్ప్రపంచ బ్రహ్మ భావము నొంది స్వస్వరూపానంద నిర్భర మానసులగుచుందురు అని భావము. అట్టి యోగివర్యుడు సాక్షాత్ గురుమూర్తియే యని శ్రీ శంకరుల నిశ్చయము.)

**5. యత్సౌఖ్యాంబుధి లేశ లేశత ఇమే శక్రాదయో నిర్వృతా**
**యచ్చిత్తే నితరాం ప్రశాంత కలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః**
**యస్మి న్నిత్యసుఖాంబుధౌ గళితధీ ర్బ్రహ్మైవ నబ్రహ్మ వి**
**ద్యః కశ్చిత్స స్సురేంద్రవందితపదో నూనం మనీషా మమ॥**

ఏ బ్రహ్మ వస్తువు యొక్క స్వరూప భూతమగు ఆనందమను సాగరము నందలి అల్పాల్ప కణమాత్ర లాభముచేతనే దేవేంద్రాదులును ఆనందమును పొంద గల్గుచున్నారో, మిక్కిలి ప్రశాన్తమై యొప్పు (విక్షేప లయ వివర్జితమైన) చిత్తమునందు ఏ బ్రహ్మతత్త్వమును పొంది నియమిత సర్వేంద్రియ మనోవృత్తియౌ యతి వర్యుడు ఆనంద సంభరితుడగు చున్నాడో, నిత్య సుఖ సముద్రాత్మకమైన ఏ బ్రహ్మ వస్తువునందు వలీనమైన చిత్తముగల మహాత్ముడు (అమనస్క యోగి) బ్రహ్మ విదుడగుటగాక సాక్షాత్ ఆపర బ్రహ్మ వస్తువే తానగుచున్నాడో, అట్టి బ్రహ్మ భావమును పొందిన మహితుడు ఉపాధిచే ద్విజుడైననూ, చండాలుడైనను అతడే నిజముగ సురేంద్ర వందిత పాదార విందుడగు పరమాత్మయని, గురుమూర్తియని నా నిశ్చయము.

*శ్రీ శంకరాచార్యకృత మనీషా పంచకము సంపూర్ణమ్.*

## సాధన పంచకం

**1. వేదోనిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం**
**తేనేశస్య విధీయతాం అపచితిః కామ్యే మతిస్త్యజ్యతాం**
**పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసంధీయతాం**
**ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతాం ॥**

నిత్యం వేదాధ్యయనం చేయాలి. ఉపనిషత్తులలో గల శక్తివంతమైన భావాలను చదివి మననం చేసుకోవాలి. అందుచేత ముముక్షు హృదయం ఎల్లవేళలా ఉత్తేజితమై ఉండుటకు వీలు కలుగుతుంది. ఇంద్రియాలను వ్యామోహపరచే విషయాలతో కూడిన

ప్రపంచంలో, ఈ ముముక్షువు జీవించాల్సి వుంది. సంఘంలో ఎల్లవేళలా బాధ్యతారహితమైన స్వేచ్ఛతో జీవిస్తున్న ఇతర వ్యక్తుల మధ్య జీవించాలి. అటువంటి జనులమధ్య అటువంటి విషయాల మధ్య జీవిస్తుంటే అవి తాత్కాలికమైన ఆనందోద్రేకాలను ఎగజిమ్ముతాయి. ముముక్షువు యొక్క మనస్సు ఎల్లప్పుడు విశాలదృష్టితో జీవితం యొక్క ఉన్నతమైన విలువలవైపు మరల్చి ఉత్తేజితమొనర్పకపోతే, ఆ భౌతికానందాలను త్రోసిపుచ్చుట చాలా కష్టమౌతుంది. భాషా పటుత్వంతో ఆధ్యాత్మికదృష్టిని నిలుపగల సాహిత్యం ఒక్క ఉపనిషత్తులు. వేదముల వంటి గ్రంథాలలో మాత్రమే ఉంది. కావున వేదములకు చివర భాగములైన ఉపనిషత్తులను నిత్యం అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

**2. సంగః సత్సువిధీయతాం భగవతో భక్తిర్ధృఢాధీయతాం**
**శాంత్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాసు సంత్యజ్యతాం**
**సద్విద్వానుపసృప్యతాం అనుదినం తత్పాదుకా సేవ్యతాం**
**బ్రహ్మైకాక్షరమర్ధ్యతాం శృతి శిరోవాక్య సమాకర్ణ్యతాం ॥**

సత్పురుషులతో, జ్ఞానులతో సహవాసం చేయాలి. నిశ్చలమైన భగవద్భక్తితో అమానిత్వం, శాంతి ఇత్యాది జీవితపు విలువలతో బ్రతకాలి. స్వార్ధకర్మలు త్యజించాలి. సద్గురువును ఆశ్రయించాలి. ఓంకారధ్యానం చేయాలి. ఉపనిషద్ వాక్యాల్ని సూక్ష్మదృష్టితో అవగాహన చేసుకోవాలి.

**3. వాక్యార్ధశ్చ విచార్యతాం శృతిశిరః పక్షః సమాశ్రీయతాం**
**దుస్తర్కాత్సువి రమ్యతాం శృతిమత స్తర్కోనుసంధీయతాం**
**బ్రహ్మోస్మీతి విభావ్యతాం అహరహగ్గర్వః పరిత్యజ్యతాం**
**దేహేఒహంమతి రుజ్ఝ్యతాం బుధజనైర్వాదః పరిత్యజ్యతాం ॥**

ఉపనిషత్తులలోని మహావాక్యాలను మననం చేసి స్వరూపనిష్ఠ పొందాలి. శృతుల్ని శ్రవణ మననములు చేయడం ద్వారా శాస్త్రదృష్టి పొందాలి. కుతర్కాన్ని వీడాలి. శృతి ప్రతిపాదిత తర్కాన్ని బాగా అర్థం చేసుకోవాలి. 'అహంబ్రహ్మాస్మి' ఇతి స్ఫురణతో మెలగాలి. గర్వాన్ని వదలాలి. దేహమే నేనను మిథ్యాభావాన్ని రూపుమాపాలి. విజ్ఞులతో తర్కించడం పూర్తిగా మానుకోవాలి.

**4. క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం**
**స్వాద్వన్నం నతు యాచ్యతాం విధివశాత్ ప్రాప్తేన సంతుష్యతాం**
**శీతోష్ణాది విషహ్యతాం నతు వృధా వాక్యం సముచ్చార్యతాం**
**ఔదాసీన్యమభీప్స్యతాం జనకృపా నైష్ఠుర్యము త్సృజ్యతాం ॥**

రోగం నయం కావాలంటే ఔషధం సేవించాలి. దానికి భిక్ష ఔషధమట. రుచ్యమైన మృష్టాన్నం కోరకూడదు. లభించిన భిక్షతో భగవంతుని తల్చుకుని తృప్తి పడాలి. ద్వంద్వాల్ని సహించాలి. వ్యర్థప్రసంగము చేయకూడదు. ఉదాసీనంగా వ్యవహరించాలి. ఇతరుల దయపై ఆధారపడకూడదు.

5. ఏకాంతే సుఖమాస్యతాం పరతరే చేత స్సమాధియతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగదిదం తద్బాధితం దృశ్యతాం
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితి బలాన్నా ప్యుత్త రైశ్లీష్యతాం
ప్రారబ్ధం త్విహభుజ్యతాం అథపరబ్రహ్మాత్మనా స్థీయతాం ॥

ఏకాంతంలో సుఖంగా ఉండాలి. భగవద్భావనలో మనస్సును శాంతింపచేయాలి. సర్వాత్మభావం పొందాలి. ప్రపంచం మిథ్యని గ్రహించాలి. ధర్మాచరణ ద్వారా గత జన్మల కర్మ ఫలప్రభావం నుండి విముక్తి పొందాలి. జ్ఞానం ద్వారా సాక్షిత్వంతో ఆగామి కర్మలబంధం త్రెంచుకోవాలి. ప్రారబ్ధఫలాన్ని శాంతంగా అనుభవించాలి. బ్రహ్మాస్మి భావంలో బ్రతకాలి.

*శ్రీ శంకరాచార్యకృత సాధన పంచకము సంపూర్ణమ్.*

## శ్రీ తోటకాష్టకమ్

1. విదితాఖిల శాస్త్ర సుధా జలధే
మహితోపనిష త్కథితార్థనిధే
హృదయే కలయే విమలం చరణం
భవ శంకర! దేశిక ! మే శరణమ్.

తెలియబడిన సముద్రములవంటి సమస్త శాస్త్రామృతములు గలవాడా! పూజ్యములైన యుపనిషత్తులచే బోధితమైన యాత్మతత్త్వమునకు నిధియైనవాడా! స్వచ్ఛమైన నీ పాదమును నా హృదయమునందు భావింతును. ఆచార్యా! శంకరా! నాకు రక్షకుడవు (శరణు) కమ్ము.

2. కరుణా వరుణాలయ! పాలయ మాం
భవసాగర దుఃఖ విదూన హృదం
రచయాఖిల దర్శన తత్త్వవిదం
భవ శంకర! దేశిక! మే శరణమ్.

దయాసముద్రుఁడా! సంసార మనెడి సముద్రము నందలి దుఃఖములచే మిక్కిలి పరితపించు హృదయము గల నన్ను పాలించుము. సమస్త శాస్త్రముల తత్త్వ మెఱింగిన వానినిగ చేయుము. ఆచార్యా! శంకరా! నాకు రక్షకుఁడ వగుము.

3. భవతా జనతా సుహితా భవితా
నిజబోధ విచారణ చారుమతే
కలయేశ్వర జీవ వివేక విదం
భవ శంకర! దేశిక! మే శరణమ్.

ఆత్మతత్త్వ విచారణమునందు ప్రశస్తమైన బుద్ధిగలవాడా ! జనసముదాయము నీచే చక్కగ తీర్చబడగలదు. జీవేశ్వర తత్త్వము నెఱింగినవానినిగ నన్ను చేయుము. ఆచార్యా! శంకరా! నాకు శరణు కమ్ము.

**4. భవ ఏవ భవానితి మే నితరాం**
**సమజాయత చేతసి కౌతుకితా**
**మమ వారయ మోహమహాజలధిం**
**భవ శంకర! దేశిక! మే శరణమ్.**

నీవే పరమేశ్వరుడవని నా మనస్సు నందు కుతూహల మేర్పడెను. నా యొక్క అజ్ఞానమనెడి మహాసముద్రమును నివారింపుము. ఆచార్యా! శంకరా! నాకు రక్షకుడ వగుము.

**5. సుకృతేఽధికృతే బహుధా భవతో**
**భవితా సమదర్శన లాలసతా**
**అతిదీన మిమం పరిపాలయ మాం**
**భవ శంకర! దేశిక! మే శరణమ్.**

అనేక విధములుగ తమ సేవ నాచరింపగా ఆత్మ దర్శనమునం ధభిరుచి కలుగును, మిక్కిలి దీనుడనగు నన్ను పరిపాలించుము. ఆచార్యా! శంకరా! నాకు రక్షకుడు వగుము.

**6. జగతీ మవితుం కలితాకృతయో**
**విచరంతి మహామహ సశ్ఛలతః**
**అహిమాంశు రివాత్ర విభాసి పురో**
**భవ శంకర! దేశిక! మే శరణమ్.**

జగత్తును రక్షించుటకై రూపమును ధరించిన మహాతేజోరూపులు ఒక నెపముతో తిరుగుచుందురు. నా యెదుట నీవు సూర్యునివలె ప్రకాశించుచున్నావు. ఆచార్యా! శంకరా! నాకు రక్షకుఁడ వగుము.

**7. గురుపుంగవ! పుంగవ కేతన! తే**
**సమతామయతాం నహి కోఽపి సుధీః**
**శరణాగత వత్సల! త త్త్వనిధే**
**భవ శంకర! దేశిక! మే శరణమ్.**

గురురాజా! పరమేశ్వరా! నీతో సామ్యమును ఏ బుద్ధిమంతుడును పొందజాలడు. శరణు పొందినవారి యందు వాత్సల్యము గలవాడా! ఆత్మ తత్త్వమునకు నిలయమైనవాడా! ఆచార్యా శంకరా! నాకు రక్షకుడ వగుము.

**8. విదితా న మయా విదితైక కలా**
**న చ కించన కాంచన మస్తి గురో!**
**ద్రుతమేవ విధేహి కృపాం సహజాం**
**భవ శంకర! దేశిక! మే శరణమ్.**

గురో! ఒక్క కళకూడ వివరముగ నాకు తెలియదు. ధనమా లేశ మైనను లేదు. శీఘ్రముగ నీవు స్వభావసిద్ధమైన కరుణను నా యందు పరపుము. ఆచార్యా! శంకరా! నాకు రక్షకుడ వగుము.

**ఇతి తోటకాచార్య కృతం, తోటకాష్టకం సంపూర్ణమ్.**

## దశశ్లోకీ

శ్రీ శంకరుల స్తుతి వాక్యాలను చక్కగా ఆలకించిన శ్రీగోవింద యతీంద్రుడు, ప్రసన్నదృష్టితో 'నీ వెవ్వడవు' (కస్త్వమితి) అని ప్రశ్నించారు. మహామహితాత్ముడు, అద్వైతమూర్తి అయిన శ్రీబాలశంకరులు ఈ విధంగా పలికారు.

శ్రీ శంకరులు స్వయంప్రబోధ జ్ఞానంచేత, అఖండపరబ్రహ్మ స్వరూపులు కనుక, గురుదేవులకు తన నిజస్వరూపాన్ని ఈ క్రింది పది శ్లోకాలలో తెలుపుతున్నారు. ఈ శ్లోకాలే 'నిర్వాణదశకం' మనీ 'దశశ్లోకీ' అనీ ప్రసిద్ధి చెందాయి.

**1. న భూమిః, నతోయం, న తేజో, న వాయుః,**
**న ఖం, నేంద్రియం వా, నా తేషాం సమూహః,**
**అనైకాంతికత్వాత్, సుషుప్త్యేకసిద్ధః**
**తదేకోఽ వశిష్టః శివః కేవలోఽహమ్.**

నేను – భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, ఇంద్రియం, ఇంద్రియ సమూహం – ఇవేవీ కాను. కారణం వీటి అనైకాంతికత్వం అంటే ఇవేవీ ఏకాంతికత్వం – ఏకత్వస్థితి కలిగినవి కావు. మార్పునకు లోనయ్యే స్వభావం కలిగినవి, వినాశ శీలమైనవి. అయితే నేను సుషుప్తికి (గాఢనిద్రకు) ఏకమాత్ర సాక్షిగా సిద్ధుడనై ఉన్నాను. కనుక ద్వైత వస్తువులన్నీ తొలగిపోగా అవశిష్టమైన – మిగిలినదేదో అదే అద్వితీయమైన – ఏకమైన – నేను. ఆ నేను కేవల శివ (శుభ – జ్ఞాన) స్వరూపుడను.

**2. న వర్ణా న వర్ణాశ్రమాచారధర్మా**
**న మే ధారణా ధ్యానయోగాదయోఽ పి,**
**అనాత్మాశ్రయాహంమమాధ్యాసహానా**
**త్తదేకోఽవశిష్టః శివః కేవలోఽ హమ్.**

నాకు బ్రాహ్మణాది జాతులు లేవు. జాతులకు, బ్రహ్మచర్యాది ఆశ్రమాలకు సంబంధించిన ఆచార ధర్మాలు లేవు. ధారణాయోగం, ధ్యానయోగం మొదలైనవి లేవు. అంటే బాహ్యలక్షణాలు గాని, అంతఃకరణ లక్షణాలు గాని ఏవీ నాకు లేవని అర్థం. దీనికి కారణం అనాత్మ (అవిద్యకు ఆశ్రయమైన అహం-మమ (నేను-నాది) అనే అధ్యాస (భ్రాంతి) తొలగిపోవడమే. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపుడనే నేను.

**3. న మాతా, పితా వా, న దేవా, న లోకా,**
**న వేదా, న యజ్ఞా, న తీర్థం బ్రువంతి,**
**సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వాత్,**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

నాకు తల్లి లేదు, తండ్రి లేడు, దేవతలు లేరు, లోకాలు లేవు, వేదాలు యజ్ఞాలు లేవు, తీర్థం లేదు. దీనికి కారణం గాఢ నిద్రలో అతిశూన్యస్థితి కూడా లేకపోవడం. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన నేను కేవల శివస్వరూపుడను.

**4. న సాంఖ్యం, న శైవం, న తత్పాంచరాత్రం,**
**న జైనం, న మీమాంసకాదేర్మతం వా,**
**విశిష్టానుభూత్యా విశుద్ధాత్మకత్వాత్**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

నాకు - సాంఖ్యం, శైవం, పాంచరాత్రం, జైనం, మీమాంసకం మొదలైన మతాలు ఏవీ లేవు. దీనికి కారణం వీటికంటే విశిష్టమైన అనుభూతితో విశుద్ధమైన ఆత్మ సిద్ధించి ఉండడం. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన నేను కేవల శివస్వరూపుడను.

**5. న శుక్లం, న కృష్ణం, న రక్తం, న పీతం,**
**న పీనం, న కుబ్జం, న హ్రస్వం, న దీర్ఘమ్,**
**అరూపం తథా జ్యోతిరాకారకత్వాత్**
**తదేకోఽవిశిష్టః శివః కేవలోఽహమ్.**

నాకు తెలుపు, నలుపు, ఎరుపు, పసుపు (రంగులు) లేవు. మరుగుజ్జు తనం, బలుపు, పొట్టి, పొడుగు (కొలతలు) లేవు. దీనికి కారణం అరూపం - రూపమే లేకపోవడం, అంతేగాక రూపాన్ని తోపింపజేసే సూర్యాది జ్యోతులకు ఆకారాన్నిచ్చింది కూడా అదే కావడం. కనుక అద్వితీయంగా మిగిలిన ఆ కేవల శివస్వరూపమే నేను.

**6. న జాగ్రత్, న మే స్వప్నకో వా సుషుప్తిః**
**న విశ్వో, న వా తైజసః, ప్రాజ్ఞకో వా,**
**అవిద్యాత్మకత్వాత్త్రయాణాం తురీయం**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

నాకు జాగ్రత్, స్వప్న, సుషుప్తులు లేవు. వాటిని అభిమానించే విశ్వుడను గాను. తైజసుడను గాను, ప్రాజ్ఞుడను గాను. దీనికి కారణం – ఈ త్రయం అవిద్యా కల్పితం కావడం. నేను వీటికి అతీతుడనైన తురీయుడను (నాల్గవ వాడను) కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపుడనే నేను.

**7. నా శాస్తా, న శాస్త్రం, న శిష్యో, న శిక్షా,**
**న చ త్వం, న చాహం, న చాయం ప్రపంచః,**
**స్వరూపావ బోధాద్వికల్పా సహిష్ణుః**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

నాకు గురువు, శాస్త్రం, శిష్యుడు, శిక్షణ – ఇవేవి లేవు. నువ్వు లేవు. నేను లేను. ఈ ప్రపంచమే లేదు. దీనికి కారణం తన సహజస్థితిని తెలుసు కోవటం. అది ఈ విభేదాలను పొందని స్థితి. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపమే నేను.

**8. న చోర్ధ్వం, న చాధో, న చాంతః న బాహ్యం**
**న మధ్యం, న తిర్యఙ్, న పూర్వా పరా దిక్,**
**వియద్ వ్యాపకత్వాదఖండైకరూపః**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

నాకు – పైన, క్రింద, లోపల, వెలుపల, మధ్య, అడ్డము, తూర్పు, పడమర (అనే ప్రదేశ భేదాలు) లేవు. దీనికి కారణం అఖండ – ఏక – రూపంతో నేను ఆకాశమంతటా వ్యాపించి ఉండడం. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపమే నేను.

**9. అపి వ్యాపకత్వాది తత్త్వాత్ ప్రయోగాత్**
**స్వత స్సిద్ధభావా దనన్యాశ్రయత్వాత్,**
**జగత్తుచ్ఛ మేత త్సమస్తం తదన్యః**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

సర్వవ్యాపకత్వం సర్వజ్ఞత్వం మొదలైన తత్త్వాలవల్ల, అనుభవం వల్ల స్వతస్సిద్ధమైనందువల్ల, అది తప్ప మరొక ఆధారం లేనందువల్ల, సాక్షిగాక తక్కిన ఈ జగత్తంతా తుచ్ఛమైంది – మిథ్య కనుక అద్వితీయంగా మిగిలిన కేవల శివస్వరూపమే నేను.

**10. న చైకం తదన్యద్ద్వితీయం కుతస్స్యాత్**
**న చాకేవలత్వం, న వా కేవలత్వమ్,**
**న శూన్యం, న చాశూన్య మద్వైతకత్వాత్**
**కథం సర్వవేదాంతసిద్ధం బ్రవీమి.**

ఆత్మ అద్వైతం (రెండు కానిది) అవడంవల్ల –ఏకత్వసంఖ్యా విశిష్టం కాదు. ఇక దానికంటె వేరుగా రెండవ వస్తువు ఎక్కడి నుండి వస్తుంది? అది ఏకత్వం కాదు, అనేకత్వము కాదు. అది శూన్యం కాదు, అశూన్యమూ కాదు. అయితే అది ఉపనిషత్తులతో ప్రసిద్ధమైన వస్తువు. దాన్ని గురించి ఎలా (మాటలలో) చెప్పగలను? అది అనుభవైకవేద్యమని భావం.

*శ్రీ శంకరాచార్యకృత దశశ్లోకి సంపూర్ణమ్.*

## ఏకశ్లోకీ

**1) కిం జ్యోతి స్తవ భానునా నహని మే రాత్రౌ ప్రదీపాదికం**
**స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే**
**చక్షు స్తస్య నిమీలనాది సమయే కిం ధీర్ధియో దర్శనే**
**కిం తత్రాహ మతో భవాన్ పరమకం జ్యోతి స్తదస్మి ప్రభో ॥**

(శుక్ల యజుర్వేదాంతర్గతమగు బృహదారణ్య కోపనిషత్తులోని జ్యోతి ర్బాహ్మణము అను గ్రంథము యొక్క సారాంశ మీ శ్లోకములో గురు శిష్య సంవాద రూపముగా సంగ్రహింపబడినది.)

**గురువు:** నాయనా! లోకమున నీకు సర్వార్థములను ప్రకాశింప జేయుచు నుపకరించుచున్న జ్యోతిస్సు (ప్రకాశము) ఏదియో నీకు తెలియునా ?

శిష్యుడు: ఆ తెలియును; నాకు అట్టి జ్యోతిస్సు పగలు సూర్యుడును, రాత్రియందు చంద్రుడు, నక్షత్రములు, దీపములు మొదలుగా గలవియును.

**గురువు:** అవును; అది యట్లే కాని నీకు ఆ సూర్యుని, ఆ దీపాదులను ప్రకాశింప జేయుటకు (చూచుటకు) ఉపయోగపడు జ్యోతిస్సు ఎయ్యేదియో నాకు చెప్పుము ?

శిష్యుడు: అయ్యా! చెప్పెదను; అది నేత్రమే.

**గురువు:** బాగున్నది! ఆ నేత్రమును, మూసికొనినయప్పుడును, నిదురబోవు నప్పుడును జ్యోతిస్సు (పదార్థ ప్రకాశక వస్తువు) నీకు లేనట్లేనా ?

శిష్యుడు: కాదు స్వామి! అప్పుడును మరొక జ్యోతిస్సు కలదు – అది బుద్ధి. ఆ బుద్ధియే సర్వార్థావభాసక జ్యోతిస్సు.

**గురువు:** బాగున్నది! ఆ బుద్ధిని ప్రకాశింప జేయున దేదియైన కలదా? ఉన్ననది యేది ?

శిష్యుడు: అట్టి బుద్ధిని ప్రకాశింప జేయునది నే నే స్వామి!

**గురువు:** ఐనచో బాహ్యాంభ్యంతర సర్వపదార్థ భాసకమైన పరమాత్మరూపకమగు పరమ జ్యోతిస్సు నీవే కదా! నాయనా!

శిష్యుడు: అవును మహాప్రభూ! అంతే నే నే.

ఆ సర్వావభాసక పరిపూర్ణ చిజ్జ్యోతిస్స్వరూపుడగు పరమాత్మను నేనే అని తెలిసికొని శిష్యుడు బ్రహ్మాత్మైక్యావబోధమును (బ్రహ్మ సాక్షాత్కారమును) పొంది పరబ్రహ్మాత్మనా సంస్థితి (తాను పరబ్రహ్మ రూపుడే అయియుండుట) యను మహామోక్ష సామ్రాజ్యమును పొందగల్గెను.

***శ్రీ శంకరాచార్యకృత ఏకశ్లోకి సంపూర్ణమ్.***

## భజగోవింద స్తోత్రమ్

కాశీనగరమున ఉన్నపుడొకసారి శ్రీ శంకర భగవత్పాదులు శిష్యులతో కలసి అరుణోదయమున గంగాస్నానమునకు పోవుచుండగా, వ్యాకరణపండితుడొకడు 'డుకృఞ్ కరణే' అని వ్యాకరణ పాఠమును వల్లెవేయుచూ కనపడెను. ఆచార్యులవారు అతనికి తరుణోపాయం చూపించ సంకల్పించి 'భజగోవిందం... డుకృఞ్ కరణే' అనునవి పల్లవిగా మంజరులను చెప్పారు. వెంటనే ఆ పండితునికి కొంత శ్రద్ధ కలిగింది. శ్రీశంకర భగవత్పాదుల శిష్యులు కూడా గురువు ఆదేశించినట్లు మంజరులను చెప్పారు. గురు, శిష్యులు చెప్పిన ఈ మంజరులు 'భజగోవింద స్తోత్రము'గా ప్రసిద్ధములు.

అరిషడ్వర్గమునందు ఒకటైన మోహమును నిర్మూలించు భావములతోనున్న రచన కాబట్టి 'మోహముద్గరః' మని కూడా పేరు.

**1. భజ గోవిన్దం భజ గోవిన్దం**
**గోవిన్దం భజ మూఢమతే**
**సంప్రాప్తే సన్నిహితే కాలే**
**నహి నహి రక్షతి 'డుకృఞ్ కరణే'.**

ఓ మూఢమతీ! వేద ప్రతిపాద్యుఁడైన గోవిందుని సేవింపుము, గోవిందుని సేవింపుము, నిత్య సన్నిహితమైన మృత్యువు మీఁదికి వచ్చినపుడు, 'డుకృఞ్ కరణే' అని నీవు వల్లించే ధాతుపాఠము నిన్ను రక్షింపదు. కనుక గోవిందుని భజింపుము.

**2. మూఢ! జహీహి ధనాగమ తృష్ణాం**
**కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్**
**యల్లభసే నిజకర్మోపాత్తం**
**విత్తం తేన వినోదయ చిత్తమ్.**

మూఢుఁడా! ధనము వచ్చిపడునను పేరాసను వదలుము, మనస్సునందు విశేష తృష్ణ లేనట్టి సద్బుద్ధిని గ్రహింపుము. నీ పూర్వకర్మాను సారముగ ఏ పాటి ధనము లభించునో, దానితో నీ మనస్సును సరి పెట్టుకొనుము.

**3. నారీ స్తనభర నాభీదేశం**
**దృష్ట్వా మాగా మోహావేశమ్**
**ఏత న్మాంసవసాది వికారం**
**మనసి విచిన్తయ వారంవారమ్.**

స్త్రీల స్తనభారముతోఁగూడిన నాభిప్రదేశమును చూచి మోహావేశమును పొందకుము, మోహావేశమునకు మూలమైన యీ స్తనభారము, మాంసము, క్రొవ్వు మొదలయిన వికృత పదార్థముల ముద్దయే యని మాటి మాటికి మనస్సులో ఆలోచించుకొనుము.

**4. నలినీదలగత జల మతితరలం**
**తద్వ జ్జీవిత మతిశయచపలమ్**
**విద్ధి వ్యాధ్యభిమాన గ్రస్తం**
**లోకం శోకహతం చ సమస్తమ్.**

తామరాకుమీదనుండు నీరు మిక్కిలి చంచలము. దానివలెనే బ్రతుకుకూడ ఏ పాటియు నిలుకడలేనిది. ఈ దేహము వ్యాధులతోను, దురభిమానముతోను ఆక్రమింపఁ బడినదని తెలిసికొనుము. మఱియు సమస్త జనము దుఃఖముచే కొట్టఁబడియున్నదని తెలిసికొనుము.

**5. యావ ద్విత్తోపార్జన సక్త**
**స్తావ ద్రక్తో నిజపరివారః**
**పశ్చా జ్జీవతి జర్జర దేహే**
**వార్తాం కోఽపిన పృచ్ఛతి గేహే.**

మనుజుఁడు ఎంతవఱకు ధనము నార్జించు పూనికలో నుండునో అంతవఱకే అతని పరివారమంతయు నాతనిని ప్రేమింతురు. తరువాత శిథిలమైన దేహముతో అతడు జీవించిన, ఇంటిలో అతని వార్త నడుగువారెవ్వరు ఉండరు.

**6. యావ త్పవనో నివసతి దేహే**
**తావ త్పృచ్ఛతి కుశలం గేహే**
**గతవతి వాయౌ దేహాపాయే**
**భార్యా బిభ్యతి తస్మిన్ కాయే.**

ఎంతవఱకు దేహములో ప్రాణవాయువుండునో, అంతవఱకే యింటిలోని వారు క్షేమము నడుగుచుందురు. ప్రాణవాయువుపోయి దేహము నశించిపోయినపుడు, ఆ శరీరమును చూచి భార్యయే భయపడును.

**7. బాల స్తావ త్క్రీడాసక్త**
**స్తరుణ స్తావ త్తరుణీసక్తః**
**వృద్ధ స్తావ చ్చిన్తాసక్తః**
**పరే బ్రహ్మణి కోఽపినసక్తః.**

బాలుడైతే ఆటలలో తగుల్కొనియుండును. యువకుఁడైతే యువతియం దాసక్తుడై యుండును. వృద్ధుడు చింతలలో మునిఁగియుండును. పరబ్రహ్మమునం దెవ్వఁడును ఆసక్తుఁడైనవాడుండఁడు.

**8. కా తే కాన్తా? క స్తే పుత్త్రః ?**
**సంసారోఽయ మతీవ విచిత్రః**
**కస్య త్వం? కః? కుత ఆయాత?**
**స్తత్త్వం చిన్తయ యదిదం భ్రాతః !**

సోదరుడా! నీకు భార్య యెవతె? నీకు పుత్త్రుఁ డెవఁడు? (అనగా వారికి, నీకు గల సంబంధమేమి?) ఈ సంసారము చాల విచిత్రమైనది. నీ వెవనికి సంబంధించినవాడవు? ఎక్కడ నుండి వచ్చినావు ? ఈ తత్త్వమును ఆలోచింపుము.

**9. సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం**
**నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్**
**నిర్మోహత్వే నిశ్చల తత్త్వం**
**నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః.**

సత్సహవాసము కలిగిన భౌతిక విషయములతో సాంగత్యము లేకుండుట ఏర్పడును. నిస్సంగత్వము లభించిన మోహము లేకుండుట అలవడును. మోహము లేక పోయిన నిశ్చలమయిన యథార్థ జ్ఞానము కలుగును. నిర్వికల్పజ్ఞాన మలవడిన జీవన్ముక్తి కలుగును.

**10. వయసి గతేకః కామవికారః ?**
**శుష్కే నీరే కః కాసారః ?**
**క్షీణే విత్తే కః పరివారో ?**
**జ్ఞాతే తత్త్వే కః సంసారః ?**

వయస్సు గడిచి పోయిన తరువాత కామవికార మేముండును ? నీరు ఇంకి పోయినపుడు చెఱు వేమిటి ? ధనము తరిగిపోయినపుడు ఇక పరివార మెక్కడ ? ఆత్మ తత్త్వము తెలిసినపుడు జననమరణరూప మయిన సంసార మింకెక్కడ ?

**11. మా కురు ధన జన యౌవన గర్వం**
**హరతి నిమేషా త్కాల స్సర్వమ్**
**మాయామయ మిద మఖిలం హిత్వా**
**బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా.**

మూఢుఁడా! ధనమున్నదని, పరిజనులున్నారని, యువకుడనని, యువతినని గర్వపడకుము. వీనినన్నిటిని మృత్యువు నిమిషములో కబళించి వేయును. మాయా మయమయిన దీనినంతను వదలి, నీవు బాగుగా తెలిసికొని పరబ్రహ్మపదమును ప్రవేశింపుము.

**12. దిన యామిన్యౌ సాయం ప్రాతః**
**శిశిర వసన్తౌ పునరాయాతః**
**కాలః క్రీడతి గచ్ఛ త్యాయు**
**స్తదపి న ముఞ్చ త్యాశావాయుః.**

పగలు, రాత్రి, సాయంకాలము, ప్రాతఃకాలము, శిశిరర్తువు, వసంతర్తువు తిరిగి తిరిగి వచ్చుచున్నవి. కాలము ప్రాణులతో ఆటలాడుచున్నది. ఆ ఆటను చూచిన ప్రాణి కాయుర్దాయము తరుగుచున్నది. అయినను ఆశయను వాయువు వదలి పెట్టుటలేదు.

**13. కా తే కాన్తా ధనగతచిన్తా**
**వాతుల! కిం తవ నాస్తి నియన్తా?**
**త్రిజగతి సజ్జన సంగతి రేకా**
**భవతి భవార్ణవ తరణే నౌకా.**

చపలుఁడా! కాంతా కనకములను గూర్చిన చింత నీకేమిటి ? నిన్నడ్డువాఁడు లేడా ? ఈ మూడు లోకములలోను సంసార సముద్రమును దాటుటకు ఓడయనునది సజ్జన సహవాస మొక్కటియే.

**14. జటిలీ ముణ్డీ లుఞ్చిత కేశః**
**కాషాయాంబర బహుకృత వేషః**
**పశ్య న్నపి చ న పశ్యతి మూఢో**
**హ్యుదర నిమిత్తం బహుకృతవేషః.**

జడలు ధరించియో, తలబోడిచేసికొనియో, వెంద్రుక లూడ బెఱికికొనియో, కాషాయ వస్త్రములు ధరించియో, పలువిధములయిన వేషములు వేసినవాఁడైన మూఢుఁడు, ఉదరపోషణమునకై అనేక వేషములు ధరించినవాడై, చూచు చున్నను చూడలేదు.

**15. అఙ్గం గలితం పలితం ముణ్డం**
**దశనవిహీనం జాతం తుణ్డమ్**
**వృద్ధో యాతి గృహీత్వా దణ్డం**
**తదపి న ముఞ్చ త్యాశాపిణ్డమ్.**

శరీరము శిథిలమై పట్టు తప్పినది, తల పండిపోయినది, నోరు పళ్ళూడి బోసి పోయినది, వృద్ధుఁడు కఱ్ఱపట్టుకొని అడుగులు వేయుచున్నాడు, అయినను కరుడు గట్టిన ఆశ నాతఁడు వదలి పెట్టలేదు.

**16. అగ్రే వహ్నిః పృష్ఠే భానూ**
**రాత్రౌ చుబుక సమర్పితజానుః**
**కరతలభిక్ష స్తరుతలవాస**
**స్తదపి న ముఞ్చ త్యాశాపాశః.**

రాత్రి సమయమున ఎదుట అగ్ని హోత్రము, వెనుక సూర్యుడు, మోకాళ్ళలో గడ్డము, అరచేతిలోభిక్ష, చెట్టు మొదట నివాసము, అయినను అశాపాశ మాతనిని వదులుట లేదు. బాహ్యసంబంధ మంతయు వదలినను ఆశాపాశము మాత్రము సడలదు.

**17. కురుతే గఙ్గా సాగరగమనం**
**వ్రతపరిపాలన మథవా దానమ్**
**జ్ఞానవిహీనః సర్వమతేన**
**ముక్తిం న భజతి జన్మ శతేన.**

జ్ఞానము లేనివాడు గంగానదికి, సముద్రమునకు పోయి స్నానము చేసినను, వ్రతములు పాటించినను, దానములు చేసినను, నూరుజన్మలకైనను అన్ని మతముల చేతను మోక్షమును పొందలేదు.

**18. సురమందిర తరుమూల నివాసః**
**శయ్యా భూతల మజినం వాసః**
**సర్వపరిగ్రహ భోగత్యాగః**
**కస్య సుఖం న కరోతి విరాగ : ?**

దేవాలయములు, చెట్ల మొదళ్ళు నివాసస్థలము, నేల పడకటిల్లు, కృష్ణాజినము కట్టుబట్ట, సకలపరివారమును, భోగములను వదలివేయఁగల వైరాగ్య మెవ్వనికి సుఖము నీయదు ?

**19. యోగరతో వా భోగరతో వా**
**సఙ్గరతో వా సఙ్గవిహీనః**
**యస్య బ్రహ్మణి రమతే చిత్తం**
**నన్దతి నన్దతి నన్దత్యేవ.**

ఎవని చిత్తము పరబ్రహ్మమునందు విహరించుచుండునో, అతడు యోగాభ్యాసమునందు ప్రీతిగలవాఁడైనను, భోగములనుభవించుటలో ప్రీతిగలవాఁడైనను, సత్సాంగత్యమునందు ప్రీతిగలవాఁడైనను, ఏ సాంగత్యము లేనివాడైనను ఆనందించుచునే యుండును.

**20. భగవద్గీతా కిఞ్చి దధీతా**
**గఙ్గాజలలవ కణికా పీతా**
**సకృదపి యేన మురారి సపర్యా**
**క్రియతే తస్య యమేన న చర్చా.**

భగవద్గీత కొంచెము చదివి, గంగాజల లేశమును త్రాగి, ఒక్క మాఱయినను మురారీ సేవ చేసినవాడు యమునితో చర్చ చేయనక్కఱలేదు.

**21. పున రపి జననం పునరపి మరణం**
**పునరపి జననీ జఠరే శయనమ్**
**ఇహ సంసారే బహుదుస్తారే**
**కృపాయాఽపారే పాహి మురారే.**

తిరిగి పుట్టుట, తిరిగి చచ్చుట, తిరిగి తల్లి గర్భములో నివసించుట – ఈ విధముగ ఆవలియొడ్డులేనిది, దాటశక్యముగానిది అయిన సంసారములో (జననమరణ ప్రవాహములో) చిక్కుకొన్న నన్ను మురారీ! రక్షింపుము.

**22. రథ్యా కర్పట విరచిత కన్థః**
**పుణ్యాఽపుణ్య వివర్జితపన్థః**
**యోగీ యోగనియోజిత చిత్తో**
**రమతే బాలోన్మత్తవదేవ.**

వీథిని తుడుచు గుడ్డ పీలికతో తయారు చేసిన బొంతగలవాడు, పుణ్య పాపముల సంబంధము లేని నడవడిగలవాడు అగు యోగి యోగానుసంధానము నందు (ఆత్మానుసంధానము నందు) నియుక్తమైన చిత్తముగలవాఁడై బాలునివలె, పిచ్చివానివలె క్రీడించును.

**23.** **క స్త్వం ? కోఽహం? కుత ఆయాతః ?**
**కా మే జననీ? కో మే తాతః ?**
**ఇతి పరిభావయ సర్వ మసారం**
**విశ్వం త్యక్త్వా స్వప్న విచారమ్.**

నీ వెవడవు ? నే నెవడను? ఎక్కడ నుండి వచ్చినాను? నాకు తల్లి యెవరు? తండ్రి యెవరు ? అని స్వప్నమును బోలియున్న ప్రపంచమును వదలివేసి సమస్తమును సారమును లేనిదానినిగా అంతటను భావింపుము.

**24.** **త్వయి మయి చాన్య త్రైకో విష్ణు**
**ర్వ్యర్థం కుప్యసి మ య్యసహిష్ణుః**
**సర్వస్మి న్నపి పశ్యాత్మానం**
**సర్వత్రోత్సృజ భేదజ్ఞానమ్.**

నీలోను నాలోను అంతటను ఉన్న విష్ణువు (సర్వవ్యాపకుఁడైన పరమాత్మ) ఒకడే. నా మీద అసహనము గలిగి వ్యర్థముగ కోపించుచున్నావు. సమస్తము నందును సర్వవ్యాపకమయిన ఆత్మను చూడుము. అంతటను భేదబుద్ధిని వదలుము.

**25.** **శత్రౌ మిత్రే పుత్రే బంధౌ**
**మా కురు యత్నం విగ్రహసంధౌ**
**భవ సమచిత్తః సర్వత్రత్వం**
**వాఞ్ఛ స్యచిరా ద్యది విష్ణుత్వమ్.**

శత్రువునందు, మిత్రునియందు, పుత్రునియందు, బంధువునందు విరోధము కూర్చుకొనుటకు యత్నము చేయకుము. శీఘ్రముగా నీవు విష్ణువు కావలెనన్న నీ వంతటను సముచితుఁడవైయుండుము.

**26.** **కామం క్రోధం లోభం మోహం**
**త్యక్త్వాత్మానం భావయ కోఽహమ్**
**ఆత్మజ్ఞాన విహీనా మూఢా**
**స్తే పచ్యన్తే నరకనిగూఢాః.**

కామమును, క్రోధమును, లోభమును వదలి 'నే నెవడను'? అని ఆత్మను భావింపుము. ఆత్మజ్ఞానము లేనట్టి మూఢులైనవారు నరకములో రహస్యముగ పడియున్నవారై తపించుచుందురు.

**27.** **గేయం గీతా నామసహస్రం**
**ధ్యేయం శ్రీపతిరూప మజస్రమ్**
**నేయం సజ్జనసఙ్గే చిత్తం**
**దేయం దీనజనాయ చ విత్తమ్.**

భగవద్గీత, సహస్రనామములు కీర్తింపనగును. శ్రీపతియైన శ్రీమహావిష్ణు రూపము నెల్లప్పుడు ధ్యానింపదగును. చిత్తమును సజ్జన సాంగత్యమున ఉంచదగును. దీనజనులకు ధన మీయఁదగును.

**28.** **సుఖతః క్రియతే రామాభోగః**
**పశ్చాద్ధన్త! శరీరే రోగః**
**యద్యపి లోకే మరణం శరణం**
**తదపి న ముఞ్చతి పాపాచరణమ్.**

స్త్రీలతో సంభోగము అనాయాసముగ చేయబడును. అయ్యో! ఆ తరువాత శరీరములో రోగము. ఈ లోకమునం దట్టివానికి మరణమే గతి, అయినను పాపము చేయుటమాత్ర మాతఁడు మానఁడు.

**29.** **అర్థ మనర్థం భావయ నిత్యం**
**నా స్తి తత స్సుఖలేశ స్సత్యమ్**
**పుత్రా దపి ధనభాజాం భీతిః**
**సర్వ త్రైషా విహితా రీతిః.**

ఎల్ల ప్పుడు ధనము బాధాకరమని భావింపుము, దానివలన లేశ మాత్రము సుఖము లేదనుట నిశ్చయము, ధనమున్న వారికి కన్న కొడుకు నుండియు భయమే, ఈ పద్ధతి సర్వకాలములందు అన్ని చోట్లను ఉన్నదియే.

**30.** **ప్రాణాయామం ప్రత్యాహారం**
**నిత్యాఽనిత్య వివేక విహారమ్**
**జాప్యసమేత సమాధివిధానం**
**కుర్వవధానం మహదవధానమ్.**

ప్రాణాయామమును, ప్రత్యాహారమును, నిత్యానిత్య వస్తువివేకమును గూర్చిన ఆలోచనను, జపించుటతోఁగూడిన సమాధిని సావధానముగఁ జేయుము, మహావ ధానముతో (గొప్ప ఏకాగ్రతతో) జేయుము.

**31.** **గురుచరణామ్బుజ నిర్భర భక్తః**
**సంసారా దచిరా ద్భవ ముక్తః**
**సేన్ద్రియ మానస నియమా దేవం**
**ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్.**

గురు పాదపద్మములందు గాఢభక్తి గలవాడవై, సంసారము నుండి శీఘ్రముగ విడువఁబడినవాఁడవగుము. ఇంద్రియ మనోనిగ్రహముల నీ విధముగ సాధించిన నీ హృదయమందున్న దేవుని నీ వీ తీరుగ చూడగలవు.

***ఇతి శ్రీమచ్ఛంకర భగత్పాద కృతః భజగోవింద స్తోత్రమ్ / మోహముద్గరః సంపూర్ణమ్.***

## గుర్వష్టకమ్

**1. శరీరం సురూపం తథా వా కలత్రం**
**యశశ్చారు చిత్రం ధనం మేరు తుల్యమ్ ।**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా: మంచి శరీరముండి రూపవతుడై, అట్లే భార్యయుండి గొప్ప యశస్సు కలవాడై మేరు పర్వతతుల్యమైన ధనరాశులుండియు (యివి యన్నియు పూర్వకర్మ ఫలితములే గాని శాశ్వతములు కావని గుర్తింపక సంతోషముగా కాలమును గడుపును కాని) తన మనస్సును (గురువు) భగవంతుని (గురుర్ బ్రహ్మా... తస్మై శ్రీ గురవే నమః - గురువనగా భగవంతుడే) పాదపద్మములందుంచి ధ్యానించుటలేదే! ఇవి యన్నియు నశించిన పిదప తన గతియేమి అని చింతన అవసరము. పిదపయేమి ? (తతః కిం అని నాలుగుసార్లు చెప్పుట ఆదరోక్తి ముఖ్యమైన విషయమని).

**2. కలత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం**
**గృహం బాన్ధవాః సర్వ మేతద్ధి జాతమ్ ।**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా: భార్య, ధనము, పుత్రపౌత్రాది సంపత్తు, బంధువులు మొదలైన సంపదలన్నిటిని కలిగియుండియు యీ సంసార సంపదలు పూర్వకర్మ ఫలితములే గాని, శాశ్వతములు కావని గుర్తింపక సంతోషముగా కాలము గడుపును కాని, తన మనస్సును భగవంతుని (గురుర్ బ్రహ్మా... తస్మై శ్రీ గురవే నమః) పాదపద్మములందుంచి ధ్యానము చేయుటలేదే! ఇవి అన్నియు నశించిన పిదప తన గతియేమి అని చింతన అవసరము. పిదపయేమి? (నాలుగుసార్లు చెప్పుట ఆదరోక్తి ముఖ్య విషయమని).

**3. షడఙ్గాది వేదో ముఖే శాస్త్రవిద్యా**
**కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా:  షడంగయుక్తమగు వేదము అధ్యయనము చేయబడిన ముఖమునందు శాస్త్రవిద్య ప్రకాశించుచున్నది. గద్య పద్య కవిత్వాదులు వశ్యవాక్కులుగా నున్నవి. అయిననేమి లాభము. ఇవి ఏవియు శాశ్వతములు కావు కదా ! తన మనస్సును భగవంతుని (గురు) పాదపద్మములందుంచి ధ్యానము చేయుటలేదే! ఇవి అన్నియు నశించిన పిదప తన గతియేమి? అని చింతన అవసరము. పిదపయేమి? (నాలుగుసార్లు చెప్పుట ఆదరోక్తి ముఖ్య విషయమని).

**4. విదేశేషు మాన్యః స్వదేశేషు ధన్యః**
**సదాచార వృత్తేషు మత్తో న చాన్యః**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా: విదేశములందు మాన్యత, స్వదేశమునందు ధన్యత, సదాచార వృత్తులందు ప్రబలత్వము, ప్రథమ గణ్యత కలిగినను లాభమేమి ? ఇవి శాశ్వతములు కావు. భగవంతుని (గురు) పాదపద్మములందు మనస్సును లగ్నము చేసి ధ్యానింపనిచో లాభమేమి? ఇవి అన్నియు పోయిన పిదప తన గతియేమి ?

**5. క్షమామణ్డలే భూప భూపాలబృన్దైః**
**సదా సేవితం యస్య పాదారవిన్దమ్**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా: భూమండలమున రాజులు, రారాజులు తన పాదములను సేవించుచున్నారు. అయిననేమి లాభము ? అది శాశ్వతము కాదు. దానివలన నిత్యసుఖము లేదు. భగవంతుని (గురు) పాదపద్మములందు మనస్సును లగ్నము చేయని యెడల ప్రయోజనమేమున్నది ? ఈ గౌరవము పోయిన తర్వాత తన గతియేమి ?

**6. యశో మే గతం దిక్షు దానప్రతాపా**
**జ్జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా: లోకమంతయు తన కీర్తిచేత నిండియున్నది. తాను దానప్రతాపుడు, జగద్వస్తువులన్నియు అర్థులకీయగలడు. అయిననేమి ? ఇవి శాశ్వతములు కావు. భగవంతుని (గురు) పాదపద్మములందు మనస్సును లగ్నము చేసి ధ్యానింపనిచో ప్రయోజనమేమున్నది ? ఇవి అన్నియు పోయిన తర్వాత తన గతియేమి ?

**7. న భోగే న యోగే న వా వాజిరాజౌ**
**న కాన్తా ముఖేనైవ విత్తేషు చిత్తమ్**
**మనశ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా: భోగమునందు గాని, యోగమునందు గాని, అశ్వశ్రేష్ఠమునందు కాని, భార్యాముఖము నందుకాని, ధనమునందు కాని, చిత్తముంచి ప్రయోజనము లేదు. మనస్సును భగవంతుని (గురు) పాదపద్మములందు లగ్నము చేసి ధ్యానింపనిచో తరువాత తన గతియేమి ?

**8. అరణ్యే న వా స్వస్య గేహే న కార్యే**
**న దేహే మనో వర్తతే మేత్వనర్ఘే**
**మనశ్చేన్న లగ్నం గురు రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

తా: అరణ్యమునందు కాని, స్వగృహమునందు కాని, ఏదో కార్యము నందు లేక దేహముపైన నిల్పికొన్న నేమి ఫలితము ? మనస్సును భగవంతుని (గురు) పాదపద్మములందు లగ్నము చేసి ధ్యానము చేయకపోయినచో తరువాత తన గతియేమి?

**9. గురోరష్టకం యః పఠే త్పుణ్యదేహీ**
**యతి ర్భూపతి ర్బ్రహ్మచారీ చ గేహీ**
**లభేద్ వాఞ్ఛితార్థం పదం బ్రహ్మసంజ్ఞం**
**గురో రుక్తవాక్యేమనో యస్య లగ్నమ్ ॥**

తా: పుణ్యజీవి, యతిగాని, భూపతిగాని, బ్రహ్మచారిగాని, గృహస్థుగాని యీ గుర్వష్టకమును పఠించుచు గురుబోధితమైన వాక్యములందు మనస్సు లగ్నము చేసిన వానికి వాంఛితార్థము లభించి, తుదకు బ్రహ్మపద లాభమగును. (ఈ గుర్వష్టకమున గురువు అనగా భగవంతుడని భావము. భగవంతుని పాదము లనగా గురువు పాదములు.)

*ఇతి శ్రీమచ్ఛంకర భగత్పాద కృతః గుర్వష్టకమ్ సంపూర్ణమ్.*

# గౌరీదశకమ్

**1. లీలాలబ్ధ స్థాపిత లుప్తా ఖిల లోకాం**
**లోకాతీతై ర్యోగిభిర న్తశ్చిర మృగ్యామ్**
**బాలాదిత్య శ్రేణి సమాన ద్యుతి పుంజాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

సమస్త లోకముల సృష్టి స్థితి లయములను అనాయాసముగా నొనరించునదియు, లోకోత్తరులగు యోగులచే హృదయమునందు చిరకాలము వెతుకదగినదియు, ఉదయ సూర్య సముదాయమువంటి కాంతి గలదియు, పద్మములవంటి నేత్రములు గలదియు, తల్లియు నగు గౌరీదేవిని స్తుతింతును.

**2. ప్రత్యాహార ధ్యాన సమాధి స్థితి భాజాం**
**నిత్యం చిత్తే నిర్వృతి కాష్ఠాం కలయన్తీమ్**
**సత్యజ్ఞానానన్దమయీాం తాం తనురూపాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులను అష్టాంగ యోగములలో చివరి నాలుగు యోగముల నొందినవారి మనస్సునందు ఆనందమును కలిగించునదియు, సత్య జ్ఞానానంద మయయు నై అతి సూక్ష్మ రూపిణియు పద్మ నేత్రయు నగు గౌరీదేవిని స్తుతింతును.

**3. చన్ద్రా పీడా నన్దిత మన్దస్మిత వక్త్రాం**
**చన్ద్రా పీడా లంకృత నీలాలక భారామ్**
**ఇన్ద్రోపేన్ద్రా ద్యర్చిత పాదామ్బుజ యుగ్మాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

చంద్రశేఖరునిచే ఆనందింపజేయబడినదై చిఱునగవుతో గూడిన ముఖము గలదియు, చంద్రుడనెడి శిరోభూషణముచే నలంకరింప బడిన నల్లని కేశభారము గలదియు, ఇంద్రుడు - విష్ణువు మున్నగువారిచే పూజింపబడిన పాదపద్మ యుగళము గలదియు, పద్మ నేత్రయు నగు గౌరీదేవిని స్తుతింతును.

**4. ఆదిక్షాన్తా మక్షరమూర్త్యా విలసన్తీం**
**భూతే భూతే భూతకదమ్బ ప్రసవిత్రీమ్**
**శబ్దబ్రహ్మానన్దమయీాం తాం తటిదాభాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

'అ' కారాది 'క్ష' కారాంత అక్షరమూర్తితో నొప్పుచు, ప్రతి ప్రాణియందును ననేక ప్రాణుల సృజించుచు శబ్దబ్రహ్మరూపిణియు ఆనంద మయయునై మెఱుపువలె ప్రకాశించు పద్మ నేత్రయగు గౌరీదేవిని స్తుతింతును.

**5. మూలాధారా దుత్థిత వీధ్యా విధిరన్ధ్రం**
**సౌరం చాన్ద్రం వ్యాప్య విహార జ్వలితాంగీమ్**
**యే యం సూక్ష్మా త్సూక్ష్మతను స్తాం సుఖరూపాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

మూలాధారము నుండి బయలుదేరిన మార్గమున బ్రహ్మరంధ్ర పర్యంతము ఇడ పింగళనాడుల యందు వ్యాపించి విహరించుచున్నదై ప్రజ్వలించు శరీరము గలదై అతి సూక్ష్మమై సుఖ రూపమైన పద్మ నేత్రయగు గౌరీదేవిని స్తుతింతును.

**6. నిత్య శ్శుద్ధో నిష్కల ఏకో జగదీశః**
**సాక్షి యస్యా స్సర్వవిధౌ సంహరణేచ**
**విశ్వత్రాణ క్రీడన లోలాం శివపత్నీం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

నిత్యుడు, శుద్ధుడు, నిష్కలుడు, అద్వితీయుడు నగు పరమేశ్వరుడు సాక్షిగా నుండగ సృష్టి స్థితి లయాది సర్వవిధుల నాచరించుచుండు శివపత్నియు పద్మ నేత్రయునగు గౌరీదేవిని స్తుతింతును.

**7. యస్యాః కుక్షౌ లీన మఖండం జగదండం**
**భూయో భూయః ప్రాదురభూ దుత్థిత వ**
**పత్యాసార్థం తాం రజతాద్రౌ విహరన్తీం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

ఏ పర దేవి యొక్క కుక్షియందు లీనమై అఖండ బ్రహ్మాండము మరల మరల పుట్టుచుండునో, రజతగిరి (కైలాసము) యందు భర్తతోగూడ విహరించు పద్మ నేత్ర యగు నా గౌరీదేవిని స్తుతింతును.

**8. యస్యా మోతం ప్రోత మశేషం మణిమాలా**
**సూత్రే యద్వ త్కాపి చరం చాప్య చరంచ**
**తా మధ్యాత్మ జ్ఞాన పదవ్యా గమనీయాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

దారమునందు మణుల సముదాయమువలె ప్రపంచమంతయు నే పరదేవత యందు ఓత ప్రోత భావమున (వస్త్రమునందు దారములు పడుగు పేకగ నున్నట్లు) నుండునో, ఆధ్యాత్మ మార్గముచే చేరదగినదియు పద్మ నేత్రయు నగు నా గౌరీదేవిని స్తుతింతును.

**9. నానాకారై శ్శక్తి కదంబై ర్భువనాని**
**వ్యాప్య స్వైరం క్రీడతి యేయం స్వయ మేకా**
**కల్యాణీం తాం కల్పలతా మానతిభాజాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

ఏ పర దేవత అనేక రూపములైన శక్తి సముదాయములతో లోకముల నెల్ల వ్యాపించి తా నొక తెయై క్రీడించుచుండునో, మంగళ రూపిణియు భక్తులకు కల్పలతయు పద్మ నేత్రయు నగు నా గౌరీదేవిని స్తుతింతును.

**10. ఆశాపాశ క్లేశవినాశం విదధానాం**
**పాదాంభోజ ధ్యానపరాణాం పురుషాణామ్**
**ఈశా మీశార్ధాంగహరాం తా మభిరామాం**
**గౌరీ మమ్బా మమ్బురుహాక్షీ మహ మీడే.**

ఆమె పాదపద్మములు ధ్యానించువారికి ఆశాపాశముల నాశమును కష్టముల నాశమును చేయుచు, తా నధీశ్వరియై శంకరుని అర్ధాంగమును హరించినదియు మనో హరయు పద్మ నేత్రయు నైన ఆ గౌరిని స్తుతింతును.

**11. ప్రాతః కాలే భావవిశుద్ధః ప్రణిధానా**
**ద్భక్త్యా నిత్యం జల్పతి గౌరీదశకం యః**
**వాచాం సిద్ధిం సంపద మగ్ర్యాం శివభక్తిం**
**తస్యాఽ వశ్యం పర్వతపుత్రీ విదధాతి.**

ప్రాతఃకాలమునందు పరిశుద్ధమైన మనస్సు గలవాడై ఏకాగ్రతతో భక్తి పురస్సరముగ గౌరీ దశకస్తోత్రమును పఠించు మానవునకు పార్వతీ దేవి వాక్సిద్ధిని, గొప్ప సంపదను శివ భక్తిని తప్పక కలుగుజేయును.

***శ్రీ శంకరాచార్యకృతమగు గౌరీ దశకము సంపూర్ణమ్.***



## లలితా పంచ రత్నమ్

**1. ప్రాతః స్మరామి లలితావదనారవిన్దం**
**బింబాధరం పృథలమౌక్తిక శోభి నాసమ్**
**ఆకర్ణ దీర్ఘ నయనం మణికుండలాఢ్యం**
**మందస్మితం మృగమదోజ్జ్వల ఫాలదేశమ్.**

దొండపండు వంటి అధరోష్ఠముగల, విలువ గలముత్యముల చేత ప్రకాశించుచున్న ముక్కుగల, కర్ణ పర్యన్తము వ్యాపించిన దీర్ఘనయనములు గల, మణిమయ కుండల సంపన్నమైన, చిరునవ్వుగల, కస్తూరీమదము చేత ప్రకాశించుచున్న నొసలు గల లలితాదేవి వదనకమలమును ప్రాతః కాలమున స్మరించుచున్నాను.

**2. ప్రాతః ర్భజామి లలితా భుజ కల్పవల్లీం**
**రక్తాంగులీయ లసదంగులి పల్లవాఢ్యామ్**
**మాణిక్య హేమ వలయాంగద శోభమానాం**
**పుండ్రేక్షుచాప కుసుమేషు సృణీర్దధానామ్.**

ఎఱ్ఱనైన ఉంగరముల చేత నొప్పుచున్న వ్రేళ్ళను, చిగురుటాకుల చేత సంపన్నమైన మాణిక్య ఖచిత బంగారుకడియములు, భుజకీర్తుల చేతను, ప్రకాశించుచున్న పంగనామాల చెరు కనెడి చాపమును, పుష్పబాణమును, శూలమును ధరించిన లలితాదేవి భుజములను కల్పలతను సేవించుచున్నాను.

**3. ప్రాతః ర్నమామి లలితా చరణారవిందం**
**భక్తేష్ట దాన నిరతం భవ సింధు పోతమ్**
**పద్మాసనాది సురనాయక పూజనీయం**
**పద్మాంకుశ ధ్వజ సుదర్శన లాంఛనాఢ్యమ్.**

భక్తుల కోరికెలను తీర్చుటయందు ఆసక్తిగల, సంసారమను సముద్రమును దాటుటకు తెప్పగా ఐన, బ్రహ్మ మొదలైన సురనాయకుల చేత పూజింపదగిన, పద్మ, అంకుశ, ధ్వజ, చక్ర రేఖలతో కూడుకొనిన లలితాదేవి చరణ కమలమును ప్రాతః కాలమున నమస్కరించుచున్నాను.

**4. ప్రాతః స్తువే పరశివాం లలితాం భవానీం**
**త్రయ్యంత వేద్య విభవాం కరుణానవద్యామ్**
**విశ్వస్య సృష్టి విలయ స్థితి హేతుభూతాం**
**విద్యేశ్వరీం నిగమ వాఙ్మనసాతిదూరామ్.**

ఉపనిషత్తులచే తెలియదగిన విభవముగల, కరుణతో నిండిన సృష్టి, స్థితి, లయ కారణభూతురాలైన, సర్వ విద్యాధీశ్వరియైన, వేదము, వాక్కు, మనస్సులకు అగమ్యమైన, పరానన్ద రూపిణి, భవపత్నియైన లలితాదేవిని ప్రాతఃకాలమున స్తుతించెదను.

**5. ప్రాతః ర్వదామి లలితే! తవ పుణ్యనామ**
**కామేశ్వరీతి కమలేతి మహేశ్వరీతి**
**శ్రీశాంభవీతి జగతాం జననీ పరేతి**
**వాగ్దేవతేతి వచసా త్రిపురేశ్వరీతి.**

ఓ లలితాదేవీ! నీ పుణ్యనామమును కామేశ్వరి, కమల, మహేశ్వరి, శ్రీ శాంభవి, జగజ్జనని, పర, వాగ్దేవత, త్రిపురేశ్వరి అని ప్రాతఃకాలమున వాక్కుతో పలుకుచున్నాను.

**6. యః శ్లోక పంచక మిదం లలితాంబికాయాః**
**సౌభాగ్యదం సులలితం పఠతి ప్రభాతే**
**తస్మై దదాతి లలితా ఝటితి ప్రసన్నా**
**విద్యాం శ్రియం విమలసౌఖ్య మనంత కీర్తిమ్.**

ఎవడు లలితాంబిక యొక్క సౌభాగ్యమును కలుగ చేయునట్టి అత్యంత లలితమైన ఈ శ్లోకపంచకమును ప్రాతఃకాలమున పఠించునో వానికొరకు లలిత ప్రసన్నురాలై శీఘ్రముగా విద్యను, లక్ష్మిని, విమల సౌఖ్యమును, అనంతకీర్తిని ప్రసాదించగలదు.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం లలితా పంచరత్నం సంపూర్ణమ్.***

## భవానీ భుజంగ స్తోత్రమ్

**1. షడాధార పంకేరుహాఽ న్తర్విరాజ**
**త్సుషుమ్నాఽ న్తరాలేఽ తి తేజోల్లస న్తీమ్**
**సుధామండలం ద్రావయన్తీం పిబన్తీం**
**సుధామూర్తి మీడే చిదానంద రూపామ్.**

మూలాధారాది షట్పద్మముల యందు ప్రకాశించు సుషుమ్నా నాడి యందు మిక్కిలి తేజస్సుతో ప్రకాశించుచున్నదై సహస్రారమునందు అమృత మండలమును ద్రవింపజేయుచు అమృతమును గ్రోలుచు నమృతమూర్తియై చిదానందమయమై యొప్పు భవానీ దేవిని స్తుతింతును.

2. జ్వలత్కోటి బాలార్క భాసా౽ రుణాంగీం
సులావణ్య శృంగార శోభాభిరామామ్
మహాపద్మ కింజల్క మధ్యే విరాజత్
త్రికోణే నిషణ్ణాం భజే శ్రీభవానీమ్.

ఉదయించుచున్న కోటి సూర్యుల వెలుగువలె నెఱ్ఱని శరీరము గలదై చక్కని లావణ్యముతోను, సింగారముతోను, కాంతితోను మనోహరమై మహా పద్మము యొక్క కేసరముల మధ్య నొప్పారు త్రికోణ పీఠమున నున్న భవానిని స్తుతింతును.

3. క్వణత్కింకిణీ నూపురో ద్భాసి రత్న
ప్రభా లీఢ లాక్షార్ద్ర పాదాబ్జయుగ్మమ్
అజేశాచ్యుతాద్యై స్సురై స్సేవ్యమానం
మహాదేవి! మన్మూర్ధ్ని తే భావయామి.

ఓ మహాదేవీ! శబ్దించు చిఱు మువ్వలు గల యందెలందలి రత్నకాంతులతో నొప్పుచు లత్తుకతో నార్ద్రమై బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులచే సేవింపబడుచున్న నీ యొక్క పాదపద్మముల ద్వంద్వమును నా శిరస్సునందు తలంచెదును.

4. సుశోణాంబ రాబద్ధ నీవీ విరాజ
న్మహారత్న కాంచీ కలాపం నితంబమ్
స్ఫుర ద్దక్షిణావర్త నాభిం చ తిస్రో
వలీ రమ్య! తే రోమరాజిం భజే౽ హమ్.

ఓ తల్లీ! నేను నీ యొక్క మిక్కిలి యెఱ్ఱనైన వస్త్రముచే కట్టబడిన పోకముడితోను, గొప్ప రత్న మేఖలతోను నొప్పారు కటిప్రదేశమును, ప్రదక్షిణముగ నొప్పు సుడి గల నాభి ప్రదేశమును, ఉదరమునందలి వళిత్రయమును, రోమ రేఖను సేవింతును.

5. లస ద్వృత్త ముత్తుంగ మాణిక్య కుమ్భో
పమశ్రి స్తన ద్వన్ద్వ మంబామ్బుజాక్షీ !
భజే దుగ్ధ పూర్ణాభిరామం తవేదం
మహాహార దీప్తం సదా ప్రస్ను తాస్యమ్.

పద్మములవంటి నేత్రములు గల ఓ తల్లీ! నీ యొక్క గుండ్రనై, మిక్కిలి యున్నతమై, మణికలశముల శోభగలదై, పాలతో నిండి మనోహరమై గొప్ప ముత్యాల హారముతో నొప్పారుచు నెల్లపుడు స్రవించు కొనలు గల కుచద్వంద్వమును సేవింతును.

6. శిరీష ప్రసూనో ల్లస ద్బాహుదండై
    ర్జ్వల ద్బాణ కోదణ్డ పాశాంకుశై శ్చ
చల త్కంకణోదార కేయూర భూషో
    జ్జ్వలద్భి ర్లస న్తీం భజే శ్రీభవానీమ్.

శిరీష పుష్పమువలె సుకుమారములై ప్రకాశించుచున్న బాణము, ధనుస్సు, పాశము, అంకుశములతోను, చలించుచున్న వలయములతోను, కేయూరములతోను నొప్పారు బాహువులతో ప్రకాశించు భావానీదేవిని సేవింతును.

7. శర త్పూర్ణ చన్ద్ర ప్రభా పూర్ణ బింబా
    ధర స్మేర వక్త్రారవిన్దాం సుభాన్తామ్
సురత్నావళీ హార తాటంకశోభాం
    మహాసుప్రసన్నాం భజే శ్రీభవానీమ్.

శరత్కాల పూర్ణచంద్రుని కాంతితో నిండి దొండపండు వంటి పెదవితోను చిరునవ్వుతోను గూడిన ముఖపద్మముతో నొప్పుచు, చక్కని కాంతితో మనోహరమై రత్నహారము, తాటంకముల శోభతో నొప్పారు మిక్కిలి ప్రసన్నమైన భావానీ దేవిని సేవింతును.

8. సునాసాపుటం సున్దర భ్రూలలాటం
    తవౌ ష్ఠశ్రియం దానదక్షం కటాక్షమ్
లలాటే లస ద్గన్ధ కస్తూరి భూషం
    స్ఫుర చ్ఛ్రీముఖామ్భోజ మీడేఽహ మమ్బ.

ఓ తల్లీ! నీ యొక్క చక్కని నాసాపుటమును, కనుబొమ్మలను, ఫాలమును, పెదవులను, వరముల నివ్వగల క్రీగంటిని, ఫాలమునందలి గంధము, కస్తూరికాలంకారమును, శోభతో నొప్పారు ముఖపద్మమును స్తుతింతును.

9. చల త్కున్తలాన్త ర్భ్రమద్భృంగ బృన్దం
    ఘన స్నిగ్ధ ధమ్మిల్ల భూషోజ్జ్వలం తే
స్ఫుర న్మౌలి మాణిక్య బద్ధేన్దు రేఖా
    విలాసోల్లస ద్దివ్య మూర్ధాన మీడే.

ఓ తల్లీ! చలించుచున్న శిరోజములందు తిరుగుచున్న తుమ్మెదల సముదాయము గలదియు, మేఘమువలె మనోహరమైన కేశపాశ మనెడి యలంకారముతో నొప్పారునదియు, ప్రకాశించు శిరోమణిచే నేర్పడిన చంద్రలేఖా విలాసముతో నొప్పునదియు నగు నీ యొక్క దివ్య శిరస్సును స్తుతింతును.

**10. ఇతి స్త్రీ భవాని స్వరూపం తవే దం**
**ప్రపంచాత్పరం చాతి సూక్ష్మ ప్రసన్నమ్**
**స్ఫుర త్వమ్బ! డిమ్భస్య మే హృత్సరోజే**
**సదా వాఙ్మయం సర్వ తేజో మయం చ.**

ఓ తల్లీ! భవానీ! నీ బిడ్డనగు నా యొక్క హృదయ పద్మమునందు ప్రపంచాతీతమై మిక్కిలి సూక్ష్మమైన ప్రసన్నమైన సర్వతేజోమయమైన యీ నీ రూపము, వాఙ్మయమున్ను యెల్లప్పుడు భాసించు గాక !

**11. గణేశాదిముఖ్యా ఖిలై శ్శక్తి బృందై**
**ర్వృతాం వై స్ఫుర చ్చక్ర రాజో ల్లసన్తీమ్**
**పరాం రాజరాజేశ్వరి! త్రైపురి! త్వాం**
**శివాంకోఽ పరిస్థాం శివాం భావయామి.**

రాజరాజేశ్వరీ! త్రిపురసుందరీ! గణేశుడు మున్నగు వారితోను, సమస్త శక్తి సముదాయములతోను ఆవరింపబడి శ్రీ చక్రరాజమున నొప్పారుచు శివుని అంక భాగమునందున్న పరా దేవత వగు నిన్ను ధ్యానింతును.

**12. త్వమర్క స్త్వ మిన్దు స్త్వ మగ్ని స్త్వ మాప**
**స్త్వ మాకాశ భూ వాయవ స్త్వం మహత్త్వమ్**
**త్వ దన్యో న కశ్చి త్ప్రపంచోస్తి సర్వం**
**త్వ మానన్ద సంవి త్స్వరూపాం భజేఽహమ్.**

తల్లీ! సూర్యుడు, చంద్రుడు, అగ్ని, జలము, ఆకాశము, భూమి, వాయువు మహత్తత్త్వము నీవే. నీ కంటె వేరు ప్రపంచము లేదు. సమస్తము నీవే. ఆనంద చిద్రూపమైన నిన్ను సేవింతును.

**13. శ్రుతీనా మగమ్యే! సువేదాగమజ్ఞా**
**మహిమ్నో నజానన్తి పారం తవా మ్బ !**
**స్తుతిం కర్తు మిచ్ఛామి తే త్వం భవాని!**
**క్షమస్వే ద మత్ర ప్రముగ్ధః కిలా హమ్.**

వేదముల కందని ఓ తల్లీ! వేద శాస్త్రముల నెరిగినవారు నీ మహిమ యొక్క యంతము నెఱుంగకున్నారు. అట్టి యెడ నేను నీ స్తుతిని చేయగోరుచున్నాను. నే నీ విషయమున పొరబడితిని. ఓ భవానీ! నా యపరాధమును మన్నింపుము.

**14. గురు స్త్వ శివ స్త్వం చ శక్తి స్త్వ మేవ**
**త్వ మేవాసి మాతా పితా చ త్వ మేవ**
**త్వ మేవా సి విద్యా త్వ మేవా సి బన్ధు**
**ర్గతి ర్మే మతి ర్దేవి! సర్వం త్వ మేవ.**

ఓ దేవీ! నాకు గురువు, శివుడు, శక్తి, తల్లి, తండ్రి, విద్య, చుట్టము, గతి, మతి అన్నియు నీవే.

**15. శరణ్యే! వరేణ్యే! సుకారుణ్యమూర్తే!**
**హిరణ్యోదరాద్యై రగణ్యే! సుపుణ్యే!**
**భవా రణ్య భీతేశ్చ మాం పాహి! భద్రే!**
**నమస్తే నమస్తే నమస్తే భవాని.**

శరణు పొందదగినదానా! కోరదగినదానా! దయామూర్తీ! బ్రహ్మాదులచే గూడ నెన్న శక్యముకానిదానా! ఓ పుణ్యమూర్తీ! మంగళ రూపిణీ! భవానీ! నీకు నమస్కారము. సంసారమనెడి అరణ్యము వలన భయము నుండి నన్ను రక్షించుము.

**16. ఇతి మాం మహ ఛ్ఛ్రీ భవానీ భుజంగ**
**స్తుతిం యః పఠే ద్భక్తి యుక్త శ్చ తస్మై**
**స్వకీయం పదం శాశ్వతం వేదసారం**
**శ్రియం చాష్ట సిద్ధిం భవానీ దదాతి.**

గొప్పదగు నీ శ్రీ భవానీ భుజంగ స్తోత్రమును భక్తితో చదువువానికి భవానీ దేవి వేదసారమగు తన శాశ్వత పదమును సంపదను అణిమాద్యష్ట సిద్ధులను ఇచ్చును.

**17. భవానీ భవానీ భవానీ త్రివారం**
**ముదారం ముదా సర్వదా యే జపన్తి**
**న శోకం న మోహం న పాపం న భీతిః**
**కదా చి త్కథం చిత్కుతశ్చి జ్జనానామ్.**

సంతోషముతో నెల్లప్పుడు భవాని, భవాని, భవాని అని ముమ్మారు జపించు జనులకు శోకము, మోహము, పాపము, భయమున్ను ఎప్పుడును ఏ విధముగను ఎవరి వలనను కలుగవు.

*శ్రీ శంకరాచార్య కృత శ్రీ భవానీ భుజంగ స్తోత్రం సంపూర్ణమ్.*

# శ్రీ త్రిపురసుందరీ స్తోత్రమ్

**1. కదంబ వన చారిణీం ముని కదంబ కాదంబినీం**
**నితంబ జిత భూధరాం సురనితంబినీ సేవితాం**
**నవాంబురుహ లోచనా మభినవాంబుద శ్యామలాం**
**త్రిలోచన కుటుంబినీం త్రిపుర సుందరీ మాశ్రయే.**

కడిమి చెట్ల తోటయందు సంచరించునదియు, మునీశ్వరుల సముదాయమనెడి కడిమి చెట్లకు మేఘమాలవలె వికాస హేతు వై నదియు, పర్వతమును ధిక్కరించు శ్రోణి భారము గలదియు, దేవతా స్త్రీ లచే సేవింపబడునదియు, క్రొత్త తామర పువ్వు వంటి నేత్రములు గలదియు, క్రొక్కారు మబ్బువలె శ్యామల వర్ణము గలదియు త్రినేత్రుని పత్నియు నగు త్రిపురసుందరీ దేవిని ఆశ్రయింతును.

**2. కదంబ వన వాసినీం కనక వల్లకీ ధారిణీం**
**మహార్హ మణి హారిణీం ముఖ సముల్లస ద్వాసినీం**
**దయా విభవ కారిణీం విశదలోచనీం చారిణీం**
**త్రిలోచన కుటుంబినీం త్రిపుర సుందరీ మాశ్రయే.**

కడిమి తోటయందు నివసించునదియు, బంగారు వీణను ధరించునదియు, గొప్ప విలువగల మణులతో ప్రకాశించునదియు, ముఖమునందలరు సువాసన గలదియు, దయను గొలుపునదియు, ప్రసన్నమైన నేత్రములు గలదియు, నర్తకియు, త్రినేత్రుని పత్నియు నగు త్రిపురసుందరీదేవి నాశ్రయించెదను.

**3. కదంబ వన శాలయా కుచభరో ల్లస న్మాలయా**
**కుచోపమిత శైలయా గురు కృపా లస ద్వేలయా**
**మదారుణ కపోలయా మధురగీత వాచాలయా**
**కయాఽపి ఘనలీలయా కవచితా వయం లీలయా.**

కడిమితోట నివాసముగ గలదియు, పాలిండ్లపై నొప్పు పుష్పమాల గలదియు, పర్వతములను మించు స్తనములు గలదియు, కృపాతిరేకమునకు అవధి యైనదియు, మదముచే నెఱ్ఱనైన చెక్కిళ్ళు గలదియు, మధురమైన గీతమును నిరంతర మాలపించునదియు నగు ఒకానొక గొప్ప విలాసముచే మేము అనాయాసముగ కప్పబడితిమి.

**4. కదంబ వన మధ్యగాం కనక మండలోపస్థితాం**
**షడంబురుహ వాసినీం సతత సిద్ధ సౌదామినీం**
**విడంబిత జపారుచిం వికచ చంద్ర చూడామణిం**
**త్రిలోచన కుటుంబినీం త్రిపుర సుందరీ మాశ్రయే.**

కడిమితోటయందొప్పునదియు, హేమ సముదాయమున నొప్పునదియు, మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞా చక్రములయందు వసించునదియు, నెల్లప్పుడు యోగసిద్ధులకు మెఱుపువలె గోచరించునదియు, జపా పుష్ప కాంతిని బోలియుండునదియు, వికసించిన చంద్రుని శిరోరత్నముగ దాల్చినదియు, త్రినేత్రుని రాణియు నగు త్రిపురసుందరీదేవిని ఆశ్రయించుదును.

**5. కుచాంచిత విపంచికాం కుటీల కుంత లాలంకృతాం**
**కుశేశయ నివాసినీం కుటిల చిత్త విద్వేషిణీం**
**మదారుణ విలోచనాం మనసిజారి సంమోహినీం**
**మతంగ ముని కన్యకాం మధుర భాషిణీ మాశ్రయే.**

ఱొమ్మునందొప్పు వీణ గలదియు, వంకరలు తిరిగిన కేశములతో నొప్పారునదియు, పద్మనివాసినియు, కపట చిత్తులను ద్వేషించునదియు, మదముచే నెఱ్ఱనైన నేత్రములు గలదియు, కామ విరోధియగు హరుని మోహింప జేయునదియు, మతంగ మహాముని పుత్రియు, మధురాలాపములు గలదియు నగు త్రిపురసుందరిని నాశ్రయింతును.

**6. స్మరే ప్రథమ పుష్పిణీం రుధిర బిందు నీలాంబరాం**
**గృహీత మధుపాత్రికాం మధు విఘూర్ణ నేత్రాంచలాం**
**ఘన స్తన భరోన్న తాం గలితచూళికాం శ్యామలాం**
**త్రిలోచన కుటుంబినీం త్రిపుర సుందరీ మాశ్రయే.**

రక్త బిందువులతో నొప్పారు నీల వస్త్రమును ధరించి మధుపాత్రను చేత పట్టుకొని మధువుచే కలగ బారిన లోచనాంతములు గలదై స్తనభారముతో నొప్పుచు వీడిన కేశములు గలదై, శ్యామల వర్ణముగలదై, త్రిలోచనుని రాణియై యొప్పు త్రిపురసుందరిని ఆశ్రయింతును. ఆమెయే ప్రథమ పుష్పవతిగ స్మరింపదగినది.

**7. సకుంకుమ విలేపనా మళీక చుంబి కస్తూరికాం**
**సమంద హసి తేక్షణాం స శర చాప పాశాంకుశాం**
**అశేష జన మోహినీ మరుణ మాల్య భూషాంబరాం**
**జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దంబికామ్.**

కుంకుమాంగ రాగముతోను, ఫాలమునందు కస్తూరీ తిలకముతోను, చిఱునగవుతో గూడిన చూపుతోను, బాణము, ధనస్సు, పాశము, అంకుశము వీనితోను నొప్పుచున్నదై సర్వజనులను మోహింపజేయుచు నెఱ్ఱని మాలతోను, అలంకారములతోను, వస్త్రముతోను కూడినదై జపాకుసుమమువలె ప్రకాశించుచున్న శ్రీమాతను జపకాలమున స్మరింపవలెను.

**8. పురందర పురంధ్రికా చికుర బంధ సైరంధ్రికాం**
**పితామహ పతివ్రతాం పటు పటీర చర్చా రతాం**
**ముకుంద రమణీ మణీలస దలంక్రియా కారిణీం**
**భజామి భువనాంబికాం సురవధూటికా చేటికామ్.**

ఇంద్రుని భార్య కేశబంధమును చేయునదిగను, బ్రహ్మదేవుని భార్య మైపూత రచించునదిగను, విష్ణుపత్ని మణుల నలంకరించునదిగను, దేవతా స్త్రీలు చెలులుగను నొప్పు భువనేశ్వరిని సేవింతును.

*శ్రీ శంకరాచార్యకృత త్రిపురసుందరీ స్తోత్రము సంపూర్ణమ్.*



## దేవీభుజంగ స్తోత్రమ్

**1. విరించ్యాదిభిః పంచభి ర్లోకపాలైః**
**సమూఢే మహానన్దపీఠే నిషణ్ణమ్**
**ధనుర్బాణ పాశాంకుశ ప్రోత హస్తం**
**మహ స్త్రైపురం శంకరాద్వైత మవ్యాత్.**

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను లోకపాలురు అయిదుగురి చే నావహింపబడిన ఆనందపీఠము నందున్నదియు, ధనస్సు, బాణము, పాశము, అంకుశము వీనిని హస్తములందు ధరించి యున్నదియు శంకరాభిన్నమును పరమ శివ సంబంధమైనదియు నగు తేజస్సు రక్షించు గాక!

**2. య దన్నాదిభిః పఞ్చభిః కోశజాలైః**
**శిరః పక్ష పుచ్ఛాత్మకై రన్త రన్తః**
**నిగూఢే మహాయోగపీఠే నిషణ్ణం**
**పురారే రథాన్తఃపురం నౌమి నిత్యమ్.**

శిరస్సు, పక్షము, పుచ్ఛము అను రూపములతో నున్న అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ రూప పంచకోశములతో నావరింపబడిన మహా యోగపీఠము నందున్న పరమ శివుని అంతఃపుర కాంతను నిత్యము స్తుతింతును.

**3. విరించ్యాదిరూపైః ప్రపంచే విహృత్య**
**స్వతన్త్రా యదా స్వాత్మా విశ్రాన్తి రేషా**
**తదా మాన మాతృ ప్రమేయా తిరక్తం**
**పరానన్ద మీడే భవాని! త్వదీయమ్.**

ఓ భవానీ! బ్రహ్మాది రూపములతో ప్రపంచమునందు విహరించు స్వతంత్రవై స్వాత్మయందు విశ్రాంతి చెందిన కాలమునందు ప్రమాణ ప్రమేయ ప్రమాత్రాది త్రిపుటి రహితమైన నీదగు ఆనంద మేదికలదో దానిని స్తుతింతును.

**4. వినోదాయ చైతన్య మేకం విభజ్య**
**ద్విధా దేవి! జీవ శ్శివశ్చేతి నామ్నా**
**శివస్యాపి జీవత్వ మాపాదయన్తీ**
**పునర్జీవ మేవం శివం వా కరోషి.**

ఓ దేవీ! ఒకటిగనున్న చైతన్యమును వినోదము కొఱకై జీవుడు శివుడు అను పేరుతో రెండుగ విభజించి శివునకుకూడ జీవ భావమును కలుగ జేయుచు మరల ఈ జీవుని శివునిగా చేయుచున్నావు.

**5. సమాకుంచ్య మూలం హృది న్యస్య వాయుం**
**మనో భ్రూబిలం ప్రాపయిత్వా నివృత్తాః**
**తతః సచ్చిదానన్దరూపే పదే తే**
**భవ న్త్యమ్బ! జీవాః శివ త్వేన కేచిత్. ॥**

ఓ తల్లీ! కొందరు జీవులు మూలాధారమును బిగించి, వాయువును హృదయమున నిలిపి, మనస్సును ఆజ్ఞా చక్రమును పొందించి సచ్చిదానంద రూపమగు నీ పదము నందు మరలినవారై శివభావమును పొందుదురు.

**6. శరీరేఽ తికష్టే రిపౌ పుత్రవర్గే**
**సదా భీతిమూలే కలత్రే ధనే వా**
**నకశ్చి ద్విరజ్య త్యహో! దేవి! చిత్రం!**
**కథం త్వత్కటాక్షం వినా తత్త్వబోధః.**

ఓ దేవీ! అతి కష్టహేతువగు శరీరమునందు గాని, కామక్రోధాది శత్రువు నందుగాని, పుత్ర సముదాయము నందుగాని, యెల్లప్పుడు భయకారణమగు భార్య యందుగాని, ధనమునందుగాని ఒక్కడును విరక్తుడగుట లేదు. ఆహా యేమి చిత్రము! నీ కటాక్షము లేకుండ తత్త్వబోధ యెట్లు కలుగును ?

**7. శరీరే ధనేఽపత్య వర్గే కలత్రే**
**విర క్తస్య సద్దేశికా దిష్టబుద్ధేః**
**య దా కస్మికం జ్యోతి రానన్దరూపం**
**సమాధౌ భవే త్తత్త్వ మస్య మ్బ! సత్యమ్.**

శరీరమునందు, ధనమునందు, సంతతియందు, భార్యయందు విరక్తినొంది సద్గురువుచే శిక్షితమైన బుద్ధి గలవానికి సమాధియందు అయత్న సిద్దముగ గోచరించు ఆనంద రూపమగు జ్యోతిస్సు నీవేయై యుంటివి; ఇది నిజము.

**8. మృషా ఽ న్యో మృషా న్యః పరో మిశ్రమేనం**
**పరః ప్రాకృతం చాపరో బుద్ధిమాత్రమ్**
**ప్రపంచం మిమీతే మునీనాం గణోయం**
**తదే తత్త్వ మేవేతి నత్వాం జహీమః**

ఇతరమైనది అబద్ధము. ముని సముదాయములలో నొక రీ ప్రపంచము మిశ్ర రూపము అనగా చిజ్జడాత్మకమనియు, మరియొకరు ప్రకృతి యొక్క వికారమనియు, మరియొకరు బుద్ధి యందు కల్పితమనియు పరిగణించు చున్నారు. ఇదియంతయు నీవేయగుట చే ఓ తల్లీ! నిన్ను విడువజాలము.

**9. నివృత్తిః ప్రతిష్ఠా చ విద్యా చ శాన్తి**
**స్తథా శాన్త్యతీతేతి పఞ్చీకృతాభిః**
**కలాభిః పరే పంచవింశాత్మికాభిః**
**త్వ మేకైవ సేవ్యా శివా భిన్నరూపా.**

నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీత అనునట్టి యైదుకళల పంచీ కరణముచే ఇరువదియైదయిన కళలచే పరమశివునితో నభిన్న రూపమైన నీ వొక్క తెవే సేవింపదగిన దానవని మరికొందరు చెప్పుచున్నారు.

**10. అగాధేఽ త్ర సంసారపంకే నిమగ్నం**
**కలత్రాదిభారేణ ఖిన్నం నితాన్తమ్**
**మహామోహ పాశౌఘ బద్ధం చిరా న్మాం**
**సముద్ధర్తు మమ్బ! త్వ మేకైవ శక్తా.**

మిక్కిలి లోతైన సంసారమనెడి బురదయందు మునిగి భార్యాది భారముచే మిక్కిలి ఖిన్నుడనై చిరకాలమునుండి గొప్ప మోహమనెడి పాశసముదాయముచే బద్ధుడనై యున్న నన్ను ఉద్ధరించుటకు ఓ తల్లీ! నీ వొక తెవే సమర్థురాలవు.

**11. సమారభ్య మూలం గతో బ్రహ్మచక్రం**
**భవ ద్దివ్య చక్రేశ్వరీ ధామభాజః**
**మహాసిద్ధి సంఘాత కల్పద్రుమాభా**
**నవాప్యామ్బ! నాదానుపాస్తే చ యోగీ.**

ఓ తల్లీ! యోగాభ్యాసపరుఁడు మూలాధార చక్రము నుండి బ్రహ్మ రంధ్రమును చేరి భవదీయ దివ్య చక్రేశ్వరీ స్థానమును చేరుననియు సమస్త సిద్ధుల నొసంగు నట్టి నాదములను పొంది ఉపాసించు చుండును.

**12. గణేశై ర్గ్రహై రమ్బ! నక్షత్రపంక్త్యా**
**తథా యోగినీ రాశి పీఠై రభిన్నమ్**
**మహాకాల మాత్మాన మామృశ్య లోకం**
**విధత్సే కృతిం వా స్థితిం వా మహేశి. ॥**

ఓ మహేశ్వరీ! గణేశులు, గ్రహములు, నక్షత్ర గణములు, యోగినీ గణములు, పీఠములు వీనితో నభిన్నమైన పరమాత్మ రూపుడగు మహాకాలునిచేరి లోకమును సృజింతువు. ఆ లోకమునకు స్థితిని కల్పింతువు. మరియు తిరోధానాది కృతులను కూడా చేయుదానవు నీవే తల్లీ!

**13. లసత్తారహారా మతి స్వచ్ఛ చేలాం**
**వహన్తీం కరే పుస్తకం చాక్షమాలామ్**
**శర చ్చన్ద్ర కోటి ప్రభా భాసురాం త్వాం**
**సకృ ద్భావయ న్భారతీవల్లభః స్యాత్. ॥**

ప్రకాశించు ముత్యాల హారమును, మిక్కిలి స్వచ్ఛమైన వస్త్రమును, హస్తము నందు పుస్తకమును, జపమాలను ధరించు శరత్కాలమునందలి కోటి చంద్రుల కాంతితో ప్రకాశించుచున్న నిన్ను ఒక్క పర్యాయము స్మరించినవాడు సరస్వతీ నాథుడు కాగలడు.

**14. సముద్య త్సహస్రార్క బిమ్బాభ వక్త్రాం**
**స్వభాసైవ సిన్దూరి తాజాండకోటిమ్**
**ధనుర్బాణ పాశాంకుశా న్ధారయ న్తీం**
**స్మరన్త స్స్మరం వాపి సంమోహయేయుః ॥**

ఉదయించుచున్న వేయి సూర్యుల కాంతిగల ముఖము గలదై తన కాంతిచే బ్రహ్మాండ సముదాయముల నెల్ల యెర్రగా జేయుచున్నదై ధనుస్సు, బాణము, పాశము, అంకుశము వీనిని ధరించిన ఆ పరదేవతను స్మరించువారు మన్మధుని కూడ మోహ పెట్టుదురు.

**15. మణి స్యూత తాటంక శోణాస్య బింబాం**
**హరి త్పట్ట వస్త్రాం త్వగుల్లాసి భూషామ్**
**హృదా భావయం స్తప్త హేమప్రభాం త్వాం**
**శ్రియో నాశయ త్యమ్బ! చాంచల్యభావమ్.**

ఓ తల్లీ! నిన్ను మణులచే పొదుగబడిన చెవికమ్మలచే నెర్రనైన ముఖము గల దానినిగను, ఆకుపచ్చని పట్టు వస్త్రముగల దానినిగను, శరీరమున ప్రకాశించు భూషణములుగల దానినిగను, మేలిమి బంగారపు కాంతిగల దానినిగను, హృదయముతో భావన చేయువానికి స్థిరమగు సంపద గలుగును.

**16. మహామన్త్ర రాజా న్త బీజం పరాఖ్యం**
**స్వతో న్యస్త బిన్దు స్వయం న్యస్తహార్దమ్**
**భవ ద్వక్త్ర వక్షోజ గుహ్యాభిధానం**
**స్వరూపం సకృ ద్భావయే త్సత్త్వమేవ.**

ఓ తల్లీ! మహా మంత్ర రాజము యొక్క యంతమునందలి పరాబీజమును నీ ముఖ వక్షోజ గుహ్య రూపముగ భావనచేయు పుణ్యాత్ముడు భగవద్రూపుడే యగును.

**17. తథా న్యే వికల్పేషు నిర్విణ్ణచిత్తా**
**స్తదేకం సమాధాయ బిన్దుత్రయం తే**
**పరానన్ద సంధాన సిన్ధౌ నిమగ్నాః**
**పున ర్గర్భరన్ధ్రం న పశ్యన్తి ధీరాః.**

కొందరు బుద్ధిమంతులు ఇతర వికల్పములందు నిర్వేదము నొందిన మనస్సు గలవారై భవదీయ బిందుత్రయమును గొని బ్రహ్మానంద సాగరమున మగ్నులై తిరిగి గర్భ రంధ్రమును చూడరు. అనగా ముక్తులగుదురు.

**18. త్వ దున్మేష లీలానుబద్ధా ధికారా**
**న్విరించ్యాదికాం స్త్వద్గుణామ్భోధి బిన్దూన్**
**భజన్త స్తితీర్షన్తి సంసార సిన్ధుం**
**శివే! తావకీనా సుసంభావనేయమ్.**

ఓ మంగళరూపిణీ నీ కటాక్షముచే నధికారములను పొంది నీ గుణ సముద్రమున బిందురూపులైన బ్రహ్మాది దేవతలను సేవించి సంసార సముద్రమును తరింప గోరుచుండుట నీ గొప్పతనమునకు నిదర్శనము.

**19. కదా వా భవ త్పాదపోతేన తూర్ణం**
**భవా మ్భోధి ముత్తీర్య పూర్ణాన్తరంగః**
**నిమజ్జన్త మేనం దురాశా విషాబ్ధౌ**
**సమాలోక్య లోకం కథం పర్యుదాస్సే?.**

నీ పాదము లనెడి పడవచే శీఘ్రముగా సంసార మనెడి సముద్రమును దాటి యెప్పుడు పరిపూర్ణ మనోరథుడ నగుదును! దురాశల నెడి విష సముద్రమున మునుగు చున్న యీ జనుని చూచి యెట్లు ఊరకుందువు ?

**20. కదా వా హృషీకాణి సామ్యం భ జేయుః**
**కదా వా న శత్రు ర్న మిత్రం భవాని**
**కదా వా దురాశా విషూచీ విలోపః**
**కదా వా మనో మే సమూలం విన శ్యేత్.**

ఎప్పుడు నా యింద్రియములు సమభావమును పొందగలవో! ఎపుడు శత్రుభావము, మిత్రభావమున్ను నాకు నశించునో! ఎప్పుడు దురాశయనెడి మహారోగము నశించునో! ఎప్పుడు నా మనస్సు సమూలముగ నశించునో.

**21. నమోవాక మాశాస్మహే దేవి! యుష్మ**
**త్పదాంభోజ యుగ్మాయ తిగ్మాయ గౌరి!**
**విరించ్యాది భాస్వ త్కిరీట ప్రతోళీ**
**ప్రదీపాయ మాన ప్రభా భాస్వరాయ.**

ఓ గౌరీ దేవీ! బ్రహ్మాది దేవతల యొక్క ప్రకాశమాన కిరీట పరంపరకు ప్రకాశకమైన కాంతితో వెలింగెడి తీక్షణమైన నీ పాద పద్మయుగమునకు నమస్కారములు పలికెదము.

**22. కచే చన్ద్ర రేఖం కుచే తారహారం**
**కరే స్వాదుచాపం శరే షట్పదౌఘమ్**
**స్మరామి స్మరారే రభిప్రాయ మేకం**
**మదా ఘూర్ణ నేత్రం మదీయం నిధానం.**

శిరమున చంద్రరేఖయు, రొమ్మున ముత్యాలహారము, హస్తమున ఇక్షుచాపము, ధనుస్సునందు తుమ్మెదల పంక్తి గలదియు, మదముచే పరిభ్రమించు నేత్రములు గలదియు, కామజేత (శివుని) యొక్క మనోరథమును నా పెన్నిధియు నగు దేవీ రూపమును తలంతును.

**23. శరేష్వేవ నాసా ధనుష్యేవ జిహ్వా**
**జపాపాటలే లోచనే తే స్వరూపే**
**త్వగేషా భవ చ్చంద్ర ఖణ్డే శ్రవోమే**
**గుణే తే మనోవృత్తి రమ్బ! త్వయి స్యాత్.**

ఓ తల్లీ! నా యొక్క నాసిక నీ బాణము (పుష్పము) లందును, నాలుక నీ ధనుస్సు (చెరుకు) నందును, నేత్రములు జపాకుసుమమువలె కొంచెమెర్రనైన నీ రూపమునందును, చర్మము నీ చంద్ర ఖండమునందును, చెవి నీ గుణమునందును, మనో వ్యాపారము నీయందును నుండు గాక!

**24. జగ త్కర్మ ధీరా న్వచో ధూత కీరాన్**
**కుచ న్యస్త హారా న్కృపా సిన్ధు పూరాన్**
**భవామ్భోధి పారా న్మహా పాపదూరాన్**
**భజే వేదసారాన్ శివప్రేమ దారాన్.**

ప్రపంచ క్రియయందు నిబ్బరము గలదియు, శుకాలాపముల త్రోసిపుచ్చు పలుకులు గలదియు, ఱొమ్మున ముత్యాల హారముల దాల్చినదియు, దయా సముద్రమైనదియు, సంసార సముద్రమును దాటించునదియు, పాపాత్ములకు అందనిదియు, వేదసార భూతమైనదియు, శివుని ప్రేయసియు నగు భవానిని సేవింతును.

**25. సుధా సిన్ధు సారే చిదానన్దనీరే**
**సముత్ఫుల్ల నీపే సురత్నా న్తరీపే**
**మణివ్యూహసాలే స్థితే హైమశాలే**
**మనోజారి వామే నిషణ్ణం మనో మే.॥**

సుధా సముద్ర సారభూతమును చిదానందమనెడి నీరు గలదియు, వికసించిన నీప (కడిమి) వృక్షములు గలదియు, మణుల పన్నుగడలనెడి ప్రాకారములు గలదియు, కనక గృహములు గలదియు నగు మణిమయ ద్వీపమున నున్న కామేశుని వామాంగ భూతమైన పరమేశ్వరి యందు నా మనస్సు లగ్నమైనది.

**26. దృగన్తే విలోలా సుగన్ధీషుమాలా**
**ప్రపంచేంద్ర జాలా విప త్సిన్ధు కూలా**
**ముని స్వాన్తశాలా నమల్లోక పాలా**
**హృది ప్రేమలోలా ఽమృత స్వాదులీలా.**

నేత్రాంతమున చాంచల్యము గలదియు, పరిమళవంతమైన (పుష్ప) బాణ సముదాయము గలదియు, ప్రపంచమనెడి యింద్రజాలము గలదియు, ఆపదలనెడి సముద్రములకు ఒడ్డును (అనగా నిస్తారకము అని భావము), మునీశ్వరుల హృదయములే నివాస గృహములుగ గలదియు, నమస్కరించుచున్న లోకపాలకులు

గలదియు, అమృతము వంటి మధురమైన విలాసములు గలదియు, ప్రేమ పరవశయు నగు పరమేశ్వరి నా హృదయమునందుండుగాక!

**27. జగజ్జాలమేత త్త్వయైవా మ్బ! సృష్టం**
**త్వమేవా ద్యయాసీస్త్రియై రర్థజాలమ్**
**త్వమేకైవ కర్త్రీ త్వమేకైవ భోక్త్రీ**
**న మే పుణ్యపాపే న మే బన్ధమోక్షౌ.**

ఓ తల్లీ! ఈ లోకములన్నియు నీ చేతనే సృష్టింపబడినవి. నీవే (అంతర్యామిగ నుండి) యింద్రియముల ద్వారా విషయములను అనుభవించుచున్నావు. కావున నీవే కర్తవు, భోక్తవు. పుణ్యపాపములు గాని, సంసార మోక్షములుగాని నాకు లేవు.

**28. ఇతి ప్రేమభారేణ కించిన్మయో క్తం**
**న బుద్ధ్వైవ తత్త్వం త్వదీయం మదీయమ్**
**వినోదాయ బాలస్య మౌర్ఖ్యం హి మాత**
**స్తదేత త్ర్పలాప స్తుతిం మే గృహాణ!. ॥**

ఓ తల్లీ! నీ తత్త్వము నెఱుంగకయే భక్తితో నీ విధముగ పలుకబడినది. బాలుని మూర్ఖత వినోదమును కలిగించును కదా! నా యీ ప్రలాపరూప స్తోత్రమును ప్రేమతో గ్రహించుము.

*శ్రీ శంకరాచార్య కృత దేవీ భుజంగ స్తోత్రం సంపూర్ణమ్.*

## అన్నపూర్ణాష్టకమ్

**1. నిత్యానన్దకరీ వరాభయకరీ సౌన్దర్య రత్నాకరీ**
**నిర్ధూతాఖిలదోష పావనకరీ ప్రత్యక్ష మాహేశ్వరీ**
**ప్రాలేయాచల వంశ పావనకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

నిత్యానందము నొసంగుదానవై, వరమును అభయమును నిచ్చుదానవై, సౌందర్య సముద్రమైనదానవై, సమస్త దోషములను పారద్రోలి పవిత్రతను కల్గించు దానవై. కేవలము మహేశ్వరుని యర్ధాంగివై, హిమవంతుని వంశమును పవిత్రము చేయుదానవై, కాశీపట్టణమునకు రాణివై, దయకు నిలయమై తల్లివైన అన్నపూర్ణేశ్వరివగు నీవు నాకు భిక్ష నొసంగుము.

**2. నానారత్న విచిత్రభూషణకరీ హేమామ్బరాడమ్బరీ**
**ముక్తాహార విడంబమాన విలస ద్వక్షోజ కుంభాంతరీ**
**కాశ్మీరాగరువాసితాంగరుచిరా కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

అనేక విధములగు రత్నములచే విచిత్రములైన భూషణములను హస్తములందు ధరించినదియు, సువర్ణ వస్త్రాలంకృతయు, గజకుంభముల వంటి పాలిండ్ల మధ్య ముత్యముల హారములచే ప్రకాశించుచున్నదియు, కుంకుమాగురులచే సువాసితమైన శరీరముచే మనోహరమైనదియు, కాశీపుర రాజ్ఞియు, కరుణానిలయయు, అన్నపూర్ణేశ్వరియు, తల్లియు నగు నీవు నాకు భిక్ష నొసంగుము.

**3. యోగానందకరీ రిపుక్షయకరీ ధర్మైకనిష్ఠాకరీ**
**చన్ద్రార్కానల భాసమాన లహరీ త్రైలోక్య రక్షాకరీ**
**సర్వైశ్వర్యకరీ తపఃఫలకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

యోగముచే కలుగు ఆనందమును కూర్చునదియు, శత్రుక్షయమును చేయునదియు, ధర్మనిష్ఠను కలిగించునదియు, చంద్ర సూర్యాగ్నుల దీప్తితో సమానమగు కాంతిప్రవాహముతో నొప్పారునదియు, సమస్తైశ్వర్యముల నొసంగునదియు, తపః ఫలము నొసంగునదియు, కాశీపుర నాయికయు, కరుణా నిలయయు, అన్నపూర్ణేశ్వరియు, తల్లియు నగు నీవు నాకు భిక్ష నొసంగుము.

**4. కైలాసాచల కన్దరాలయకరీ గౌరీ హ్యుమా శాంకరీ**
**కౌమారీ నిగమార్థగోచరకరీ హ్యోంకారబీజాక్షరీ**
**మోక్షద్వార కవాట పాటనకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

కైలాసపర్వతగుహను నివాసముగ జేసికొనినదానవును, తెల్లని కాంతిగల దానవును, ఉమా (ఓ పార్వతీ! తపస్సు చేయవలదని తల్లి చే నిషేధింపబడుట చే ఉమా అను పేరు వచ్చినదనిన కాళిదాసు.) అను పేర నొప్పుదానవును, శంకరునిపత్నివియు, కౌమారదశ యందున్నదానవును, వేద ప్రతిపాదితార్థమును గోచరింప జేయుదానవును, ప్రణవముచే ప్రతిపాదింపబడుదానవును, మోక్షద్వారపు తలుపులను భేదించు దానవు–అనగా మోక్ష మొసంగు సామర్థ్యము గలదానవును, కాశీపట్టణపు రాణివియు, దయా నిలయవును, తల్లివి, అన్నపూర్ణేశ్వరియు నగు నీవు నాకు భిక్ష నొసంగుము.

5. దృశ్యాదృశ్య విభూతివాహనకరీ బ్రహ్మాండభాండోదరీ
లీలానాటక సూత్రఖేలనకరీ విజ్ఞాన దీపాంకురీ
శ్రీవిశ్వేశ మనః ప్రసాదనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.

ఇతరులకు గోచరము లగునట్టియు, గోచరములు కానట్టియు మహిమలను ధరించిన దానవును, బ్రహ్మాండ సముదాయమును గర్భమున ధరించినదానవును, విలాసమనెడి నాటకము యొక్క సూత్రముతో క్రీడించుదానవును, విజ్ఞానమనెడి దీపమునకు కారణమైనదానవును, శ్రీ విశ్వనాథుని మనస్సును శాంతింప జేయుదానవును, కాశీ పట్టణపు రాణివియు, కరుణా నిలయవును, అన్నపూర్ణేశ్వరివి, తల్లివి యగు నీవు నాకు భిక్ష నొసంగుము.

6. ఆదిక్షాంత సమస్త వర్ణనకరీ శంభుప్రియే శాంకరీ
కాశ్మీర త్రిపురేశ్వరీ త్రినయనీ విశ్వేశ్వరీ శర్వరీ
స్వర్గ ద్వార కవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.

'అ' కారము మొదలు 'క్ష' కార పర్యంతము గల సమస్త వర్ణ రూపమైన దానవు, శివునికి ప్రియురాలవు, శంకరుని పత్నివి, స్వర్గ ద్వారపు తలుపులను భేదించుదానవు, కాశీపట్టణపు రాణివి, దయా నిలయవు, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు నాకు భిక్ష నొసంగుము.

7. ఉర్వీ సర్వజయేశ్వరీ జయకరీ మాతా కృపాసాగరీ
నారీ నీలసమాన కుంతలధరీ నిత్యాన్న దానేశ్వరీ
సాక్షా న్మోక్షకరీ సదా శుభకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.

లోకమునందు సమస్త విజయములకు నాయకురాలివి, విజయమును చేకూర్చు దానవు, తల్లివి, దయాసముద్రమవు, నల్లనై సమానములైన శిరోజములను ధరించిన స్త్రీవి, నిరంతరము అన్నదానముచేయు నాయకురాలివి, సాక్షాత్తుగ మోక్షము నొసంగుదానవు, ఎల్లప్పుడు శుభములను కలుగ జేయుదానవు, కాశీపుర రాణివి, దయా నిలయవు, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి యగు నీవు నాకు భిక్ష నొసంగుము.

**8. దేవీ సర్వవిచిత్రరత్న రుచిరా దాక్షాయణీ సుందరీ**
**వామాస్వాదుపయోధరా ప్రియకరీ సౌభాగ్యమాహేశ్వరీ**
**భక్తాభీష్టకరీ సదా శుభకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

విచిత్రములైన సమస్త రత్నములచే నలంకరింపబడిన దేవివి, దక్ష ప్రజాపతి యొక్క బిడ్డవు, సుందరివి, యౌవనమధ్యస్థవు, మనోహరమైన పాలిండ్లు గలదానవు, ప్రియమును కలుగ జేయుదానవు, సౌభాగ్యదేవతవు, భక్తుల కోరికల నొసంగుదానవు, ఎల్లప్పుడు శుభముల నొసంగుదానవు, కాశీపురపు రాణివి, దయానిలయవు, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు నాకు భిక్ష నొసంగుము.

**9. చంద్రార్కానల కోటి కోటి సదృశీ చందాంశు బింబాధరీ**
**చంద్రార్కాగ్ని సమాన కుండలధరీ చంద్రార్క వర్ణేశ్వరీ**
**మాలా పుస్తక పాశ సాంకుశధరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

కోట్లకొలది చంద్రులతోను, సూర్యులతోను, అగ్నులతోను సమానమైనదియు, సూర్యునిబింబమువలె (ఎఱ్ఱనైన) క్రింది పెదవి గలదియు, సూర్యునితోను, అగ్నితోను సాటియైన కర్ణాలంకారములను ధరించినదియు, చంద్రుని యొక్కయు, సూర్యుని యొక్కయు వర్ణముగల దేవియు, జపమాలను, పుస్తకమును, పాశమును, అంకుశమును (చేతులతో) ధరించునదియు, కాశీపట్టణపు రాణియు, కరుణా నిలయయు, అన్నపూర్ణేశ్వరి రూపయైన తల్లివియు నగు నీవు నాకు భిక్ష నొసంగుము.

**10. క్షత్ర త్రాణకరీ మహాభయకరీ మాతా కృపాసాగరీ**
**సర్వానందకరీ సదాశివకరీ విశ్వేశ్వరీ శ్రీధరీ**
**దక్షాక్రన్దకరీ నిరామయకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

క్షత్ర జాతిని రక్షించునదియు, మిక్కిలి భయమును కలిగించునదియు, దయకు సముద్రమైన తల్లియు, ఎల్లరకు ఆనందమును కల్గించునదియు, ఎల్లప్పుడు శుభమును కలుగజేయునదియు, సమస్త ప్రపంచమునకు రాణియు, శోభను ధరించి నదియు, (సతీదేవి రూపమున తండ్రియగు) దక్ష ప్రజాపతికి (యాగ ధ్వంసముచే) శోకమును కలిగించునదియు, సౌఖ్యమును కలిగించునదియు, కాశీపట్టణపు రాణియు, కరుణకు నిలయమైనదియు, అన్నపూర్ణాదేవతా రూపమైన తల్లివియు నగు నోదేవీ! నీవు నాకు భిక్ష నొసంగుము.

*11. **అన్నపూర్ణే! సదాపూర్ణే! శంకర ప్రాణవల్లభే!**
**జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి!**

ఎట్టి లోపములు లేక ఎల్లప్పుడు నిండుతనముతో నొప్పారుదానా! అన్న సమృద్ధితో నొప్పారుదానా! శంకరునికి ప్రాణముతో సమానముగ ప్రియమైన దానా! ఓ పార్వతీ! నాకు జ్ఞానము - ఐహికాముష్మిక ఫలముల ననుభవించుట యందు విరక్తియు చేకూరుటకై భిక్షము పెట్టుదువు గాక!

**మాతా చ పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వరః**
**బాన్ధవాః శివ భక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్.**

నాకు పార్వతీ దేవియే తల్లి. పరమేశ్వరుడే తండ్రి. శివ భక్తులు చుట్టములు. మూడు లోకములు నా స్వదేశము.

*ఈ శ్లోకమును సన్న్యాసులు భిక్షను స్వీకరించు సమయమున పఠింతురు.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతమ్ అన్నపూర్ణాష్టకం సంపూర్ణమ్.***

## భ్రమరాంబాష్టకమ్

1. **చాంచల్యారుణ లోచనాంచితకృపాం, చంద్రార్క చూడామణిం**
**చారుస్మేరముఖాం చరాచర జగ త్సంరక్షణీం తత్పదామ్**
**చంచచ్చంపక నాసికాగ్ర విలస న్మౌక్తామణీ రంజితాం**
**శ్రీ శైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

చంచలమైన ఎఱ్ఱని నేత్రములయందు ప్రకాశించు దయగలదియు, చంద్ర, సూర్యులు శిరోమణులుగ గలదియు, మనోహరమగు చిఱునగవు మోమున గలదియు, జంగమ స్థావర రూపమగు జగత్తును రక్షించునదియు, తత్పదముచే చెప్పబడునదియు, అనగా పరమాత్మ రూపిణియు, ప్రకాశించు సంపెంగ పువ్వువంటి నాసికయొక్క కొనయందు ప్రకాశించుచున్న ముత్యముచే నలంకరింప బడినదియు, శ్రీశైల క్షేత్రమునందు నివసించు షడ్గుణైశ్వర్య సంపన్నయు నగు శ్రీమాతను తలంచెదను.

2. **కస్తూరీ తిలకాంచి తేందు విలస త్ప్రోద్భాసి భాలస్థలీం**
**కర్పూరద్రవ మిశ్ర చూర్ణ ఖదిరా మేదోల్లస ద్వీటికామ్**
**లోలాపాంగ తరంగిత్తై రధికృపా సారై ర్నతానందినీం**
**శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

కస్తూరీ తిలకముతో కూడినదై చంద్రునివలె మిక్కిలి ప్రకాశించు ఫాల (నుదురు) ప్రదేశము గలదియు, కర్పూర రసముతో చేరిన సున్నము కవ్విరియొక్క సువాసనతో ప్రకాశించు తాంబూలము గలదియు, చంచలమైన క్రీగంటి చూపులచే నతిశయించిన గొప్ప దయావర్షములచే భక్తులను సంతోష పెట్టుచున్నదియు, శ్రీశైలక్షేత్ర నివాసినియు, షడ్గుణైశ్వర్య సంపన్నయు నగు శ్రీమాతను తలంచెదను.

**3. రాజన్మత్త మరాల మందగమనాం రాజీవ పత్రేక్షణాం**
**రాజీవప్రభవాది దేవ మకుటై రాజత్పదాంభోరుహమ్**
**రాజీవాయత మంద మండిత కుచాం రాజాధిరాజేశ్వరీం**
**శ్రీశైల స్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

ప్రకాశించుచున్న మదించిన హంసవలె మెల్లని నడకగలదియు, తామర రేకులవంటి నేత్రములు గలదియు, బ్రహ్మ మొదలగు దేవతల కిరీటములచే ప్రకాశించుచున్న పాదపద్మములు గలదియు, అనేక పద్మములచే దట్టముగ నలంకరింపబడిన స్తనములు గలదియు, రాజరాజేశ్వరియు అనగా చక్రవర్తులకు కూడ చక్రవర్తినియు, శ్రీ శైలక్షేత్ర నివాసినియు, షడ్గుణైశ్వర్య సంపన్నయునగు శ్రీమాతను తలంచెదను.

**4. షట్తారాంగణ దీపికాం శివసతీం షడ్వైరి వర్గాపహాం**
**షట్ చక్రాంతర సంస్థితాం వరసుధాం షడ్యోగినీ వేష్టితామ్**
**షట్ చక్రాంచిత పాదుకాంచిత పదాం షడ్భావగాం షోడశీం**
**శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

షట్తారలు ముంగిట దీపములుగ గలదియు, శివుని భార్యయు, కామ క్రోధాది అంతశ్శత్రు సముదాయమును నశింప జేయునదియు, మూలాధారాది చక్రముల నారింటియందు నుండునదియు, శ్రేష్ఠమైన అమృతరూపిణియు, ఆరుగురైన డాకిని మున్నగు యోగినీ గణముతో కూడినదియు, షట్చక్రములచే నలంకరింపబడిన పాదుకలతోగూడిన పాదములు గలదియు, షడ్భావములతో నొప్పు నదియు, షోడశీమంత్ర రూపిణియునై శ్రీశైలక్షేత్రము నధివసించు షడ్గుణైశ్వర్య సంపన్నయగు శ్రీమాతను స్మరింతును.

**5. శ్రీనాథాదృత పాలిత త్రిభువనాం శ్రీచక్ర సంచారిణీం**
**జ్ఞానాసక్త మనోజ యౌవన లస ద్గంధర్వ కన్యా దృతామ్**
**దీనానా మతివేల భాగ్య జననీం దివ్యాంబరాలంకృతాం**
**శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

శ్రీనాథునిచే నాదరింపబడి ముల్లోకములను పాలించునదియు, శ్రీచక్రసంచారము చేయునదియు, జ్ఞానమునం దాసక్తిగల కామునిచేతను, జవ్వనముతో నొప్పారు గంధర్వకన్యల చేతను ఆదరింపబడునదియు, దీనులకు మితిలేని భాగ్యమును కలిగించునదియు, దివ్యములైన వస్త్రములచే నలంకరింప బడినదియునై శ్రీ శైల క్షేత్ర నివాసినియైన షడ్గుణైశ్వర్య సంపన్నయగు శ్రీమాతను భావింతును.

**6. లావణ్యాధిక భూషితాంగ లతికాం లాక్షాలస ద్రాగిణీం**
**సేవాయాత సమస్త దేవ వనితాం సీమన్త భూషాన్వితామ్**
**భావోల్లాస వశీకృత ప్రియతమాం భండాసుర చ్ఛేదినీం**
**శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

తళతళతో సొంపునింపు మేని తీగ గలదియు, లత్తుకవలె నెఱుపు ఛాయగలదియు, సేవించుటకై యేతెంచిన సర్వదేవతా స్త్రీలు గలదియు, పాపట మణి భూషణములతో నొప్పునదియు, భావోద్రేకమున నాథుని (పరమశివుని) వశము చేసికొనినదియు, భండాసురుని కూల్చినదియు, శ్రీశైల క్షేత్రనివాసియు, షడ్గుణైశ్వర్య సంపన్నయు నగు శ్రీమాతను భావింతును.

**7. ధన్యాం సోమ విభావనీయ చరితాం ధారాధర శ్యామలాం**
**మున్యారాధన మేధినీం సుమవతాం ముక్తి ప్రదాన వ్రతామ్**
**కన్యాపూజన సుప్రసన్న హృదయాం కాంచీలస న్మధ్యమాం**
**శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

ధన్యురాలును, సాంబమూర్తిచే మిక్కిలి యెన్నదగిన చరిత్ర గలదియు, మేఘమువలె శ్యామలమైనదియు, మునులచే నిత్యము ఆరాదింప బడుపుష్పములతో వికసించుచున్న భూమాతవంటి దియు, మోక్షము ననుగ్రహించుట దీక్షగాగలదియు, కన్యలను పూజించుటయందు ప్రసన్నమైన హృదయము గలదియు, మొలనూలుతో నొప్పుచున్న నడుముగలదియు, శ్రీశైల క్షేత్ర నివాసినియు, షడ్గుణైశ్వర్య సంపన్నురాలును అగు శ్రీమాతను భావింతును.

**8. కర్పూరాగరు కుంకుమాంకిత కుచాం కర్పూర వర్ణస్థితాం**
**కృష్టోత్కృష్ట సుకృష్ట కర్మదహనాం కామేశ్వరీం కామినీమ్**
**కామాక్షీం కరుణారసార్ద్ర హృదయాం కల్పాంతర స్థాయినీం**
**శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

కర్పూరము, అగరు, కుంకుమలచే పూయబడిన స్తనములుగలదియు, కర్పూర వర్ణముతో నుండునదియు, మిక్కిలి పెకలింపబడిన కర్మయ నెడి అగ్ని గలదియు, కోరికలకధీశ్వరియు, స్త్రీ రూపిణియు, కామాక్షియు అనగా కంటిచే మన్మథుల

సృజించునదియు, దయారసముతో మెత్తనైన హృదయము గలదియు, ప్రళయ కాలమునందు గూడ నాశము లేనిదియు, శ్రీశైల క్షేత్ర నివాసినియు, షడ్గుణైశ్వర్య సంపన్నయు నగు శ్రీమాతను భావింతును.

**9. గాయత్రీం గరుడధ్వజాం గగనగాం గాంధర్వ గానప్రియామ్**
**గంభీరాం గజగామినీం గిరిసుతాం గంధాక్షతాలంకృతామ్**
**గంగా గౌతమ గర్గ సన్నుత పదాం గాం గౌతమీం గోమతీమ్**
**శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే.**

గాయత్రీ రూపిణియు అనగా కీర్తించువారిని రక్షించునదియు, గరుడ ధ్వజయు, ఆకాశ సంచారిణియు, గంధర్వుల గానమునందు ప్రీతి గలదియు, గంభీరురాలును, గజముయొక్క నడకవలె విలాస గమనము గలదియు, పర్వతపుత్త్రియు, గంధముతోను అక్షతలతో నలంకరింపబడినదియు, గంగ, గౌతముడు, గర్గుడు వీరిచే పొగడబడిన పాదములు గలదియు, గోరూపిణియు, గౌతమీ నదీ రూపిణియు, గోమతీ నదీ రూపిణియు, శ్రీశైల క్షేత్ర నివాసినియు షడ్గుణైశ్వర్య సంపన్నయు నగు శ్రీమాతను భావింతును.

*ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం భ్రమరాంబాష్టకం సంపూర్ణమ్.*



## శారదా భుజంగప్రయాతాష్టకమ్

**1. సువక్షోజ కుంభాం సుధా పూర్ణ కుంభాం**
**ప్రసాదావలంబాం ప్రపుణ్యావలంబామ్**
**సదాస్యేందుబింబాం సదానోష్ఠబింబాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

శోభన కుచకుంభ భాసురయై, అమృతపూర్ణ కలశధారిణియై, పుణ్యాత్ముల కవలంబమై, అనుగ్రహమున కాశ్రయమై, చంద్రునివంటి నెమ్మోము, దొండపండు వంటి యధరము నొప్పు మాయమ్మను శారదాంబను భజించెదను.

**2. కటాక్షే దయార్ద్రాం కరే జ్ఞానముద్రాం**
**కలాభి ర్వినిద్రాం కలాపై స్సుభద్రామ్**
**పురస్త్రీం వినిద్రాం పుర స్తుంగభద్రాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

కటాక్షమునందు దయార్ద్రతయు, కరమున జ్ఞానముద్రయు పూని నిర్నిద్రములగు కళలతో మంగళాభరణములతో, తుంగభద్రా తీరమున చైతన్యమూర్తియై యొప్పు మా యమ్మను శారదాంబను సేవించెదను.

3. **లలామాంక ఫాలాం లసద్గాన లోలాం**
**స్వభక్తైకపాలాం యశశ్శ్రీకపోలామ్**
**కరే త్వక్షమాలాం కనత్ప్రత్నలోలామ్**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

నెన్నుదుట తిలకముదాల్చి గానము నాలింపవేడ్కగలదై భక్తుల బాలింప నుబలాట పడునదై కీర్తిగన్న చెక్కిళ్ళుగలదై చేత నక్షమాల దాల్చియుండు మాయమ్మను శారదాంబను భజించెదను.

4. **సుసీమంతవేణీం దృశా నిర్జితైణీం**
**రమత్కీరవాణీం నమ ద్వజ్రపాణీమ్**
**సుధా మంథరాస్యాం ముదాచింత్యవేణీం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

చక్కని పాపట గలది, ఆడులేడిని గెలుచు చూపులు కలది, చిలుక పలుకులకు గుల్కునది, ఇంద్రుని చే నమస్కరింపబడునది, అమృతముచే నిండిన నెమ్మోము గలది, ఊహింపరాని వేణీశోభగలది యగు మా అమ్మను శారదాంబను మ్రొక్కెదను.

5. **సుశాంతాం సుదేహాం దృగంతే కచాంతాం**
**లస త్సల్ల తాంగీ మనంతా మచింత్యామ్**
**స్మరే త్తాపసైః సంగపూర్వ స్థితాం తాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

అత్యంత శాంతమూర్తి, అత్యంత సుందరమూర్తి, కన్నుల తుద ముసిరిన జుట్టుగలది, తీగవంటి మేనుగలది, అనంత, అచింత్యయునై తాపసులతోడి సంగము గల్గియున్న మా అమ్మను శారదాంబను భజించెదను.

6. **కురంగే తురంగే మృగేంద్రే ఖగేంద్రే**
**మరాలే మదేభే మహోక్షేఽ_ధి రూఢామ్**
**మహత్యాం నవమ్యాం సదా సామరూపాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

లేడిమీద, గుఱ్ఱముమీద, సింహముమీద, గరుత్మంతునిమీద, హంసమీద, మదపుటేనుగుమీద, మహావృషభముమీద నధిష్ఠించి మహానవమినాడు సామవేద రూపిణియైయుండు మా అమ్మను శారదాంబను భజించెదను.

7. **జ్వలత్కాంతి వహ్నిం జగన్మోహనాంగీం**
**భజే మానసాంభోజ సుభ్రాంత భృంగీమ్**
**నిజస్తోత్ర సంగీత నృత్య ప్రభాంగీం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

జ్వలించు కాంతిగల యగ్ని రూపిణిని, జగన్మోహినిని, మనస్సనెడి తామర పూవునందు వ్రాలు ఆడు తుమ్మెదను, తన గూర్చిన సంకీర్తన సంగీత నృత్యముల యొక్క శోభయే స్వరూపముగాగల మా అమ్మను శారదాంబను భజించెదను.

**8. భవాంభోజనేత్రాజ సంపూజ్యమానాం**
**లస న్మందహాస ప్రభా వక్త్ర చిహ్నామ్**
**చల చ్చంచలా చారు తాటంక కర్ణాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్.**

శివ, విష్ణు, బ్రహ్మలచే బూజింపబడునది, మందహాసప్రభ లొలుకు నెమ్మోము గలది, చలించు మెఱపుదీగవలె మెఱయు తాటంకముల నింపు గుల్కు చెవులు గలదియు నగు మా అమ్మ శారదాంబను మ్రొక్కెదను.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం శారదాభుజంగ ప్రయాత స్తోత్రమ్ సంపూర్ణమ్.***

## మీనాక్షీపంచరత్నమ్

**1. ఉద్యద్భాను సహస్రకోటి సదృశాం, కేయూర హారోజ్జ్వలాం**
**బింబోష్ఠీం స్మితదన్త పంక్తి రుచిరాం, పీతామ్బరాలంకృతామ్**
**విష్ణు బ్రహ్మ సురేంద్ర సేవితపదాం, తత్త్వ స్వరూపాం శివాం**
**మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం, కారుణ్య వారాం నిధిమ్.**

ఉదయించిన వేయికోట్ల సూర్యులతో సమానమైనది, దండకడియములతో, హారములతో ప్రకాశించునది, దొండపండు వంటి క్రింది పెదవి గలది, మంద హాసముతోఁగూడిన దంతపంక్తిచే అందమయినది, పీతాంబరమును ధరించి అలంకృతయైనది, విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు వీరిచే సేవింపబడిన పాదములు గలది, యథార్థజ్ఞాన స్వరూపిణియైనది, మంగళకరియైనది, దయాసముద్రయైనది యగు మీనాక్షీదేవిని నే నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

**2. ముక్తాహార లసత్కిరీట రుచిరాం, పూర్ణేందు వక్త్రప్రభామ్**
**శింజ న్నూపుర కింకిణీ మణిధరాం, పద్మప్రభా భాసురామ్**
**సర్వాభీష్ట ఫలప్రదాం గిరిసుతామ్, వాణీ రమా సేవితాం**
**మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం, కారుణ్య వారాం నిధిమ్.**

ముత్యాల పేటలతో ప్రకాశించుచున్న కిరీటముచే అందమయినది, పూర్ణ చంద్రుని బోలిన ముఖకాంతిగలది, ధ్వని చేయుచున్న అందెలు, చిఱుగంటలు, మణులు ధరించినది, పద్మరాగమణుల కాంతిచే ప్రకాశించునది, సకలమైన అభీష్టములను ఇచ్చునది, పర్వతసుతయైనది (పార్వతీ స్వరూపిణి), సరస్వతీ, లక్ష్మిలచే సేవింపబడు నదియు యగు మీనాక్షీదేవిని నే నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

**3. శ్రీవిద్యాం శివవామభాగనిలయాం, హ్రీంకారమంత్రోజ్జ్వలాం**
**శ్రీచక్రాంకితబిందుమధ్యవసతిం, శ్రీమత్స భానాయకీమ్**
**శ్రీమ త్షణ్ముఖ విఘ్న రాజ జననీం, శ్రీమజ్జగన్మోహినీం**
**మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం, కారుణ్య వారాం నిధిమ్.**

శ్రీ విద్యా స్వరూపిణి, పరమశివుని వామభాగమునందుండునది, హ్రీంకార మంత్రముచే ప్రకాశించునది, శ్రీ చక్రమందు బిందువునకు మధ్యమునందుండునది, శ్రీ సంపన్నమైన శైవ సంఘ సభకు నాయికయైనది, శ్రీమంతులయిన కుమారస్వామి, విఘ్ననాథులకు తల్లియైనది, శ్రీమతియై జగత్తును మోహింపజేయు దయా సముద్రయైన మీనాక్షీ దేవి నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

**4. శ్రీమత్సుందర నాయకీం భయహరాం, జ్ఞానప్రదాం నిర్మలాం**
**శ్యామాభాం కమలాసనార్చితపదాం, నారాయణ స్యానుజామ్**
**వీణావేణుమృదంగ వాద్య రసికాం, నానావిధాడంబికాం**
**మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం, కారుణ్య వారాం నిధిమ్.**

సకలైశ్వర్య సంపన్నుఁడైన సుందరేశ్వరునకు రాణియైనది, భయమును పోగొట్టునది, జ్ఞానము నిచ్చునది, నిర్మలమైనది, శ్యామలవర్ణము కలది, బ్రహ్మచే పూజితమైన పాదపద్మములు గలది, నారాయణునకు సోదరియయినది, వీణ, పిల్లన గ్రోవి, మద్దెల అను వాద్యము లందు విశేషాస క్తి గలది, బహు విధములయిన హంగు గలదై దయా సముద్రయైన మీనాక్షీ దేవిని నే నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

**5. నానాయోగి మునీంద్ర హృన్నివసతిం, నానార్థ సిద్ధిప్రదాం**
**నానాపుష్ప విరాజితాంఘ్రి యుగళాం, నారాయణే నార్చితామ్**
**నాదబ్రహ్మమయీం పరాత్పరతరాం, నానార్థ తత్త్వాత్మికామ్**
**మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం, కారుణ్య వారాం నిధిమ్.**

సకల యోగుల, మునుల హృదయములందు నివసించునది, వివిధ పురుషార్థసిద్ధి నిచ్చునది, వివిధములయిన పూవులచే అలంకృతమైన పాద ద్వంద్వముగలది, నారాయణునిచే పూజింపఁబడినది, నాద బ్రహ్మ స్వరూపిణి, పరము కంటె పరతరయైనది, సకల పదార్థ తత్త్వ స్వరూపిణి, దయాసముద్రయు నయిన మీనాక్షీ దేవిని నే నెల్లప్పుడును నమస్కరించున్నాను.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం మీనాక్షీ పంచరత్నం సంపూర్ణమ్.***

## మీనాక్షీస్తోత్రమ్

**1. శ్రీవిద్యే! శివవామభాగనిలయే ! శ్రీ రాజరాజార్చి తే !**
**శ్రీనాథాది గురుస్వరూపవిభవే! చింతామణీ పీఠికే !**
**శ్రీవాణీగిరిజానుతాంఘ్రికమలే! శ్రీశాంభవి! శ్రీశివే!**
**మధ్యాహ్నే మలయధ్వజాధిపసుతే! మాం పాహి మీనాంబికే!**

శ్రీ విద్యాస్వరూపిణీ ! పరమశివుని వామభాగమునందుండుదానా! సంపదధిపతియైన కుబేరునిచే పూజింపబడినదానా! లక్ష్మీపతి మొదలయిన గురువుల స్వరూపవైభవము కలదానా! చింతామణి మయమైన పీఠము కలదానా! లక్ష్మి, సరస్వతీ, గౌరీదేవులచే కీర్తింపబడిన పాదపద్మముల కలదానా ! శ్రీ శాంభవీ! మంగళస్వరూపిణీ! మలయధ్వజ మహారాజసుతా! తల్లీ! మీనాక్షీ దేవీ! నన్ను రక్షింపుము.

**2. చక్రస్థే! చపలే! చరాచర జగన్నాథే! జగత్పూజితే!**
**ఆర్తాలీ వరదే! నతాభయకరే! వక్షోజభారాన్వితే!**
**విద్యే! వేదకలాపమౌళివిదితే! విద్యుల్లతా విగ్రహే!**
**మాతః! పూర్ణ సుధారసార్ద్ర హృదయే! మాం పాహి మీనాంబికే!**

శ్రీ చక్రమందుండి కదలనిదానా! చరాచర జగత్తునకు పాలకురాల వైనదానా! లోకములచే పూజింపఁబడినదానా! ఆర్త సంఘమునకు వరము లిచ్చుదానా! శిరసు వంచినవారి కభయమిచ్చుదానా! అమృతమయ పయోధరభారముతోఁగూడిన దానా! జ్ఞానస్వరూపిణీ! వేదాంత వేద్యురాలా! మెఱపుతీఁగవంటి శరీరము కలదానా! తల్లీ! సంపూర్ణమయిన అమృతరసముచే తడిసిన హృదయము గలదానా! మీనాక్షీ దేవీ! నన్ను రక్షింపుము.

**3. కోటీరాంగద రత్నకుండలధరే! కోదండ బాణాంచితే!**

**కోకాకార కుచద్వయోపరి లస! త్ప్రాలంబి హారాంచితే!**

**శింజన్నూపుర పాదసారస మణీ! శ్రీపాదుకాలంకృతే!**

**మద్దారిద్ర్య భుజంగ గారుడ ఖగే! మాం పాహి మీనాంబికే !**

కిరీటము, దండకడియములు, రత్నమయమైన కర్ణాభరణములు ధరించినదానా! ధనుర్బాణములతో గూడినదానా! చక్రవాకాకారము గల కుచద్వంద్వమునందు వ్రేలాడుచున్న ముత్యాల హారములతో గూడినదానా! మోగుచున్న అందెలు గల పాదపద్మమణులందు శ్రీ పాదుకలు తొడిగి అలంకృతయైనదానా! నా దారిద్ర్యమనెడు సర్పమునకు గరుడపక్షియైనదానా! మీనాక్షీ దేవీ! నన్ను రక్షింపుము.

**4. బ్రహ్మేశాచ్యుత గీయమాన చరితే! ప్రేతాసనాంతస్థితే !**

**పాశోదంకుశ చాప బాణ కలితే! బాలేందుచూడాంచితే !**

**బాలే! బాలకురంగ లోలనయనే ! బాలార్క కోట్యుజ్వలే !**

**ముద్రారాధిత దేవతే! మునిసుతే! మాం పాహి మీనాంబికే !**

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులచే కీర్తింపబడుచున్న చరిత్రము గలదానా! పంచప్రేతాసనాగ్రమునందున్న దానా! పాశము, ఎత్తియున్న అంకుశము, ధనుస్సు చేతులం దొప్పుచున్న దానా! బాల చంద్రుని శిరోభూషణముగఁ దాల్చినదానా! బాలా! లేఁడిపిల్ల చూపులవలె బెదరు చూపులు గలదానా! కోటి బాలసూర్యులవలె ప్రకాశించుదానా! ముద్రలచే ఆరాధింపఁబడు దేవతా! మునికన్యా! మీనాక్షీ దేవీ!, నన్ను రక్షింపుము.

**5. గంధర్వామర యక్ష పన్నగ నుతే! గంగాధరాలింగితే !**

**గాయత్రీ గరుడాసనే! కమలజే! సు శ్యామలే! సుస్థితే!**

**ఖాతీతే! ఖలదారు పావకశిఖే! ఖద్యోతకోట్యుజ్జ్వలే !**

**మంత్రారాధిత దైవతే! మునిసుతే! మాం పాహి మీనాంబికే!**

గంధర్వులచే, దేవతలచే, యక్షులచే, నాగులచే స్తుతింపబడుదానా! పరమేశ్వరునిచే ఆలింగనము చేసికొనబడినదానా! గాయత్రీ గరుడాసన స్వరూపిణీ! పద్మోద్భవమైన లక్ష్మీ స్వరూపిణీ! యోగ్యమయిన శ్యామలవర్ణము కలదానా! బాగుగ నుండినదానా! పంచభూతాతీతురాలా! దుష్టులను కట్టెలకు అగ్ని జ్వాలయైనదానా! కోటి మెఱుపులవలె ప్రకాశించుదానా! మంత్రములచే ఆరాధింపఁబడు దేవతా స్వరూపిణీ! మునిపుత్రీ! మీనాక్షీ దేవీ! నన్ను రక్షింపుము.

**6.  నాదే! నారద తుమ్బురాద్యవినుతే! నాదాంత నాదాత్మికే !**
**నిత్యే! నీలలతాత్మికే! నిరుపమే! నీవారశూకోపమే!**
**కాంతే! కామకలే! కదంబనిలయే! కామేశ్వరాంకస్థితే!**
**మద్విద్యే! మదభీష్టకల్పలతికే! మాం పాహి మీనాంబికే!**

నాదస్వరూపిణీ! నారద తుంబురాది దేవగాయకులచే విశేషముగ నుతింపబడినదానా! నాదములన్నిటికి తుదినున్న నాదస్వరూపిణీ! నిత్యురాలా! నీల లతా స్వరూపిణీ! సాటిలేనిదానా! నివ్వరి ధాన్యపు ముల్లునకు సాటియైనదానా (పరమ సూక్ష్మరూపిణి యనుట)! మనోహరమైనదానా! కామకలా స్వరూపిణీ! కదంబవనవాసినీ! కామేశ్వరుని యెడిలో నున్నదానా! నా విద్య (జ్ఞానము లేక మంత్రము) అయినదానా! నా కోరికల నిచ్చుటకు కల్పవృక్షమైనదానా! మీనాక్షీ దేవీ! నన్ను రక్షింపుము.

**7.  వీణానాద నిమీలితార్ధనయనే ! విస్రస్తచూలీభరే !**
**తాంబూలారుణపల్లవాధరయుతే ! తాటంక హారాన్వితే !**
**శ్యామే! చంద్రకలావతంసకలితే ! కస్తూరికాఫాలికే !**
**పూర్ణే! పూర్ణ కళాభిరామవదనే ! మాం పాహి మీనాంబికే !**

వీణానాదముచే మూసికొన్న సగము కన్నులుగలదానా! విడిపోయిన జడముడి కలదానా! తాంబూల సేవనముచే నెఱ్ఱనయిన చిగురువంటి పెదవులు గలదానా! కమ్మలు, హారములు కలదానా! శ్యామలాదేవీ! చంద్రరేఖాభూషణభూషితురాలా! కస్తూరీ తిలకములతోఁ గూడిన ఫాల తలము గలదానా, పరిపూర్ణురాలా! సంపూర్ణ కలలుగల చంద్రునివలె మనోహరమైన ముఖము గలదానా! మీనాక్షీ దేవీ! నన్ను రక్షింపుము.

**8.  శబ్దబ్రహ్మమయీ చరాచరమయీ ! జ్యోతిర్మయీ వాఙ్మయీ**
**నిత్యానందమయీ నిరంజనమయీ ! తత్త్వంమయీ చిన్మయీ**
**తత్త్వాతీతమయీ పరాత్పరమయీ! మాయామయీ శ్రీమయీ**
**సర్వైశ్వర్యమయీ సదాశివమయీ! మాం పాహి మీనాంబికే.**

శబ్దబ్రహ్మ స్వరూపిణీ! చరాచరప్రపంచ స్వరూపిణీ! జ్యోతి స్వరూపిణి! వాగ్రూపిణీ! శాశ్వతానంద స్వరూపిణీ! నిరంజన స్వరూపిణీ! తత్ త్వమ్ పదార్థ స్వరూపిణీ! చిత్స్వరూపిణీ! తత్త్వావృత స్వరూపిణీ! మాయాస్వరూపిణీ! పరాత్పర స్వరూపిణీ! శ్రీవిద్యా స్వరూపిణీ! సకలైశ్వర్య స్వరూపిణీ! సదాశివ స్వరూపిణీ! మీనాక్షీ దేవీ! నన్ను రక్షింపుము.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం మీనాక్షీ స్తోత్రమ్ సంపూర్ణమ్.***



# కనక ధారా స్తోత్రమ్

వందే వందారు మందారం ఇందిరా నందకందలం
అమందానంద సందోహం బంధురం సింధురాననం

1. అంగంహరేః పులక భూషణ మాశ్రయంతీ
భృంగాంగ నేవ ముకులాభరణం తమాలమ్
అంగీకృ తాఖిల విభూతి రపాంగలీలా
మాంగల్య దాస్తు మమ మంగళ దేవతాయాః

పులకాలంకృతమైన శ్రీహరి శరీరమును ఆడు తుమ్మెద మొగ్గలచే అలంకృతమైన తమాలవృక్షమును వలె ఆశ్రయించి యున్నదై, సకలైశ్వర్యములను శరీరముగాఁ జేసికొన్న మంగళ దేవతయైన శ్రీ మహాలక్ష్మి క్రీగఁటిచూపు నాకు మంగళ పరంపర నిచ్చునది యగుగాక!

2. ముగ్ధా ముహు ర్విదధతీ వదనే మురారేః
ప్రేమ త్రపా ప్రణిహితాని గతాగతాని
మాలా దృశో ర్మధుకరీవ మహోత్పలే యా
సామే శ్రియం దిశతు సాగరసంభవాయాః

ముద్దరాలై యెవతె మురారి ముఖమునందు, పద్మమునందు ఆడు తుమ్మెదవలె ప్రేమతో సిగ్గుతో గూడిన మాలాకృతిగల చూపుల రాకపోకలను చేయుచుండునో అట్టి క్షీరసాగర కన్య చూపులమాల నాకు సంపద నిచ్చుఁగాక.

3. విశ్వామరేంద్ర పదవిభ్రమ దానదక్ష
మానద్ధహేతు రధికం మురవిద్విషోఽపి
ఈష న్నిషీదతు మయి క్షణ మీక్షణార్థ
మిందీవరోదర సహోదర మిందిరాయా.

సకల దేవరాజులకు వారివారి పదవీ విలాసముల నిచ్చుటకు సమర్థమైనది, మురారికిని విశేషముగ ఆనందకారణమైన పద్మగర్భ సోదరియైన లక్ష్మీ దేవి సగము చూపు కొంచెముగా నా మీద ప్రసరించుఁగాక.

4. ఆమీలితాక్ష మధిగమ్య ముదా ముకున్ద
మానందకంద మనిమేష మనంగతంత్రమ్
ఆకేకర స్థిత కనీనిక పక్ష్మ నేత్రం
భూత్యై భవేన్మమ భుజంగశయాఙ్గనాయాః.

సంతోషముతో కన్ను మూతపడియున్న శ్రీ మహావిష్ణు మూర్తిని పొంది, ఆనందమునకు మూలమై రెప్పపాటులేక మన్మథ పరవశమైన, కొంచె మోరగ నున్న నల్ల గ్రుడ్లు ఱెప్పలుగల శేషశాయి యిల్లాలి (లక్ష్మీ దేవి) చూపు నాకు సంపద నిచ్చునది యగుగాక.

**5. బాహ్వంతరే మధుజితః శ్రితకౌస్తుభే యా**
**హారావళీవ హరినీలమయీ విభాతి**
**కామప్రదా భగవతోఽపి కటాక్షమాలా**
**కల్యాణమావహతు మే కమలాలయాయాః.**

కౌస్తుభమణి దాల్చిన మధుసూదన దేవుని వక్షస్థలమునందు ఇంద్ర నీల మణిమయ హారముల వరసవలె నెవతె ప్రకాశించుచున్నదో, భగవంతునకును కోరిన కోరికల నిచ్చునట్టి కమలాలయ (లక్ష్మీ దేవి) కటాక్షము నాకు మంగళమును కలిగించుగాక.

**6. కాలాంబుదాలి లలితోరసి కైటభారే**
**ర్ధారాధరే స్ఫురతి యా తటిదంగ నేవ**
**మాతు స్సమస్తజగతాం మహనీయమూర్తి**
**ర్భద్రాణి మే దిశతు భార్గవకన్యకాయాః**

కైటబారి (విష్ణుని) నల్లని మేఘమాలవలె అందమైన వక్షస్థలము నందు నీల మేఘము నందు మెఱుపుతీఁగవలె నెవతె మెఱయుచున్నదో, సకలలోకములకు తల్లి యైన లక్ష్మీ దేవి యొక్క మూర్తి నాకు మంగళముల నిచ్చుఁగాక.

**7. ప్రాప్తం పదం ప్రథమతః ఖలు యత్ప్రభావా**
**న్మాంగల్యభాజి మధుమాథిని మన్మథేన**
**మ య్యాపతే త్తదిహ మంథర మీక్షణార్థం**
**మందాలసం చ మకరాలయ కన్యకాయాః**

ఏ దేవి చూపు ప్రభావమువలన మాంగల్యమును పొందిన మధుసూదను నందు మన్మధునిచే స్థానము పొందబడెనో; మంథరము మందము అలసమును అయిన క్షీరసాగర కన్య యొక్క సగము చూపు ఇక్కడ నా మీఁద ప్రసరించుఁ గాక.

**8. దద్యా ద్దయానుపవనో ద్రవిణాంబు ధారా**
**మస్మి న్నకించన విహంగశిశౌ విషణ్ణే**
**దుష్కర్మ ఘర్మ మపనీయ చిరాయ దూరం**
**నారాయణ ప్రణయినీ నయనాంబువాహః.**

దయయను చల్లని గాలిగల నారాయణ ప్రేయసియైన లక్ష్మీ దేవి చూపను మేఘము దుఃఖించుచున్న ఈ దరిద్రుఁడను పిల్లపక్షికి దుష్కర్మమను ఎండ వేడిమిని చిరకాలము దూరముగా తొలగించి, ధనమను నీటిధారను కురియుఁగాక.

**9. ఇష్టావిశిష్టమతయోఽపి యయా దయార్ద్ర**
**దృష్ట్యా త్రివిష్టపపదం సులభం లభన్తే**
**దృష్టిః ప్రహృష్ట కమలోదర దీప్తి రిష్టాం**
**పుష్టిం కృషీష్ట మమ పుష్కర విష్టరాయాః.**

యాగములచే చిత్తశుద్ధిని పొందనివారును, ఏ దేవి దయార్ద్ర దృష్టిచే స్వర్గ స్థానమును సులభముగ పొందుచున్నారో, వికసించిన పద్మ మధ్యకాంతిగల పద్మాసనయైన లక్ష్మీ దేవి దృష్టి నాకు పుష్టిని చేయుగాక.

**10. గీర్దేవ తేతి గరుడధ్వజ సుందరీతి**
**శాకంభ రీతి శశిశేఖర వల్ల భేతి**
**సృష్టి స్థితి ప్రళయ కేళిషు సంస్థితాయై**
**తస్యై నమ స్త్రిభువనైకగురో స్తరుణ్యై.**

వాగ్దేవతయని, గరుడధ్వజ, సుందరియని, శాకంభరియని, చంద్రశేఖరుని ప్రేయసియని, జగత్ సృష్టి స్థితి ప్రళయ విహారము లందుండిన, త్రిలోక గురువైన శ్రీహరి యిల్లాలికి నమస్కారము.

**11. శ్రుత్యై నమోఽస్తు శుభకర్మ ఫలప్రసూత్యై**
**రత్యై నమోఽస్తు రమణీయ గుణార్థవాయై**
**శక్త్యై నమోఽస్తు శతపత్ర నికేతనాయై**
**పుష్ట్యై నమోఽస్తు పురుషోత్తమ వల్లభాయై.**

శుభమయిన ఫలములు కనునట్టి వేదమాతకు నమస్కారము. మనోహరమయిన గుణములకు సముద్రమైన ప్రీతిదేవతకు నమస్కారము. పద్మవాసిని యయిన శక్తికి నమస్కారము. పురుషోత్తముని ప్రేయసియయిన సంపద్దేవతకు నమస్కారము.

**12. నమోఽస్తు నాళీకనిభాననాయై**
**నమోఽస్తు దుగ్ధోదధి జన్మభూమ్యై**
**నమోఽస్తు సోమామృత సోదరాయై**
**నమోఽస్తు నారాయణ వల్ల భాయై.**

పద్మమువంటి ముఖముగల యామెకు నమస్కారము. పాలసముద్రము నుండి పుట్టిన యామెకు నమస్కారము. చంద్రునకు అమృతమునకు సోదరియైన యామెకు నమస్కారము. నారాయణ ప్రేయసికి నమస్కారము.

**13. సంపత్కరాణి సక లేంద్రియనన్దనాని**
**సామ్రాజ్య దాన విభవాని సరోరుహాక్షి !**
**త్వద్వన్దనాని దురితాహరణోద్యతాని**
**మామేవ మాత రనిశం కలయన్తు నాన్యమ్.**

పద్మలోచనయైన తల్లీ! పూజ్యురాలా! సంపదలు కలిగించునవి, సకలేంద్రియములను సంతసింపజేయునవి, సామ్రాజ్యము నిచ్చు వైభవముగలవి, పాపములను సమూలముగ పోఁగొట్టుటకు దోహద పడు నీ పాదములకు నమస్కారము.

**14. యత్కటాక్ష సముపాసనా విధిః**
**సేవకస్య సకలార్థసంపదః**
**సంతనోతి వచనాంగ మానసై**
**స్త్వాం మురారిహృదయేశ్వరీం భజే.**

ఏ తల్లి క్రీగంటి చూపు నారాధించుట సేవకునకు సకల పురుషార్థ సంపదలను సమృద్ధముగఁ గలిగించునో, అట్టి మూరారి హృదయేశ్వరివైన నిన్ను వాక్కాయ మానసములతో సేవించెదను.

**15. సరసిజ నిలయే! సరోజహ స్తే!**
**ధవళతమాంశుక గంధమాల్యశోభే!**
**భగవతి ! హరివల్లభే! మనోజ్ఞే!**
**త్రిభువనభూతికరి! ప్రసీదమహ్యమ్.**

పద్మాలయా! పద్మహస్తా! తెల్లని వస్త్రముల, గంధముల, పూలమాలల కాంతి గలదానా! మూడు లోకములకు నైశ్వర్యము కలిగించుదానా! భగవతీ! విష్ణుప్రియా ! మనోహారిణీ! నాయెడ ప్రసన్నవగుము.

**16. దిగ్ఘస్తిభిః కనకకుంభ ముఖావసృష్ట**
**స్వర్వాహినీ విమల చారు జలప్లుతాంగీమ్**
**ప్రాత ర్నమామి జగతాం జననీ మశేష**
**లోకాధినాథ గృహిణీ మమృతాబ్ధి పుత్రీమ్.**

దిగ్గజములచే బంగారు కలశముల నుండి వంచబడిన ఆకాశగంగ యందలి విమలజలములచే స్నానము చేయింపబడిన యొడలు గల్గి క్షీరసాగర పుత్రియైన, అశేషలోక ప్రభువైన శ్రీహరి కిల్లాలైన జగజ్జననిని ప్రాత స్సమయమున నమస్కరింతును.

17. **కమలే! కమలాక్ష వల్ల భే! త్వం**
**కరుణా పూర తరంగితై రపాంగైః**
**అవలోకయ మామకించనానాం**
**ప్రథమం పాత్రమకృత్రిమం దయాయాః**

లక్ష్మీదేవీ! పుండరీకాక్షుని ప్రేయసీ! నీవు దయాప్రవాహ తరంగితములైన క్రీగంటిచూపులతో, దరిద్రులలో అగ్రగణ్యుఁడను, నీ దయకు కల్ల కపట మెఱుఁగని ముఖ్య పాత్రమనైన నన్ను చూడుము.

18. **స్తువన్తి యే స్తుతిభిరమీభి రన్వహం**
**త్రయీమయీం త్రిభువనమాతరం రమామ్**
**గుణాధికా గురుతరభాగ్యభాగినో**
**భవన్తి తే భువి బుధ భావితాశయాః.**

వేదత్రయ స్వరూపిణియై, త్రిలోకమాతయైన లక్ష్మీదేవిని అనుదినమును ఎవరీ స్తుతులతో స్తుతించెదరో, వారు సద్గుణాధికులై, విస్తారమయిన భాగ్యమును పొందువారై యీ భూమిమీఁద విద్వాంసులు మననము చేయు ఆశయములు గల వార లగుచున్నారు.

**ఇతి *శ్రీమచ్ఛంకర భగవత్పాద* కృతః కనకధారా స్తోత్రమ్ సంపూర్ణమ్.**

❀ ❀ ❀

## గంగాష్టకమ్

1. **బ్రహ్మాండం ఖండయంతీ హరశిరసి జటావల్లి ముల్లాసయంతీ**
**స్వర్లోకాదాపతంతీ కనక గిరిగుహా గండ శైలాత్ స్ఖలంతీ**
**క్షోణీపృష్ఠే లుఠంతీ దురిత చయచమూ ర్నిర్భరం భర్త్సయంతీ**
**పాథోధిం పూరయంతీ సుర నగరసరిత్ పావనీ నః పునాతు.**

బ్రహ్మాండమును భేదించుచు శివుని జటాజూటమును ప్రకాశింపజేయుచు స్వర్గమునుండి పడుచున్నదై మేరుపర్వతపు చరియనుండి జారుచు భూమియందు దొర్లుచు పాప సముదాయ మనెడి సేనలను మిక్కిలి బెదరించుచు సముద్రమును పూరించుచు నున్న పవిత్రమైన గంగానది మమ్ము పవిత్రముచేయు గాక!

2. **ఆదా వాది పితామహస్య నియమ వ్యాపారమాత్రే జలం**
**పశ్చా త్పన్నగశాయినో భగవతః పాదోదకం పావనం**
**భూయ శ్శంభు జటా విభూషణ మణి ర్జహ్నో ర్మహర్షే రియం**
**కన్యా కల్మషనాశినీ భగవతీ భాగీరథీ దృశ్యతే.**

ఈ గంగానది ప్రారంభమున బ్రహ్మదేవుని సృష్టియం దేర్పడిన జలముగను, పిమ్మట విష్ణు దేవుని పవిత్రమైన పాదోదకముగను, తరువాత శివుని జటాజూట మణిగను, పిదప జహ్ను మహర్షి కన్యకగను, పిమ్మట పాపములు పారద్రోలు భాగీరథీ దేవిగను కనబడుచున్నది.

**3. శైలేంద్రా దవతారిణీ నిజజలే మజ్జ జ్జనోత్తారిణీ**
**పారావారవిహారిణీ భవభయ శ్రేణి సముత్సారిణీ**
**శేషాహేరనుకారిణీ హరశిరో వల్లీ దలాకారిణీ**
**కాశీ ప్రాంతవిహారిణీ విజయతే గంగా మనోహారిణీ.**

మనోహరమైన గంగానది హిమవత్పర్వతము నుండి అవతరించి తన నీటియందు స్నానమాడువారిని తరింపజేయుచు, సముద్రమున విహరించుచు, సంసారభయమును దూరముచేయుచు, శేషసర్పము ననుకరించుచు శివుని శిరోభూషణమై కాశీ ప్రాంతమున విహరించుచు నొప్పుచున్నది.

**4. కుతోఽ వీచి ర్వీచి స్తవ యది గతా లోచనపథం**
**త్వ మాపీతా పీతాం బర పుర నివాసం వితరసి**
**త్వదుత్సంగే గంగే ! పతిత యది కాయ స్తనుభృతాం**
**తదా మాత! శ్శాత క్రతవ పద లాభోఽ ప్యతిలఘుః.**

ఓ తల్లీ! నీ తరంగము చూడబడె నేని వానికి దుఃఖ మెక్కడిది ? నీవు త్రాగ బడినదానవై వైకుంఠ నివాసము నిత్తువు. ఓ గంగా! నీ యందు శరీరముపడిన మనుజులకు ఇంద్రపదవికూడ మిక్కిలి సులభము.

**5. గంగే! త్రైలోక్యసారే! సకల సురవధూ ధౌత విస్తీర్ణ తోయే!**
**పూర్ణ బ్రహ్మ స్వరూపే! హరిచరణ రజో హారిణి! స్వర్గమార్గే !**
**ప్రాయశ్చిత్తం యది స్యా త్తవ జలకణికా బ్రహ్మహత్యాదిపాపే**
**కస్త్వాం స్తోతుం సమర్థ? స్త్రిజగ దఘహరే! దేవీ! గంగే! ప్రసీద.**

ముల్లోకముల సారమైనదానా! సమస్త దేవతా స్త్రీలచే క్షాలితమైన నీరు గలదానా! పరబ్రహ్మ స్వరూపిణీ! విష్ణుపాదములను క్షాలన చేసినదానా! స్వర్గమునకు మార్గమైనదానా! ఓ గంగానదీ! బ్రహ్మహత్య మున్నగు పాపమునకు నీ జలబిందువు ప్రాయశ్చిత్తమన్నచో, నిన్ను స్తుతించుట కెవడు సమర్థుడు ? ముల్లోకముల పాపమును పోగొట్టు ఓ గంగాదేవీ! అనుగ్రహింపుము.

**6. మాత ర్జాహ్నవి! శంభుసంగవలితే ! మౌలౌ నిధా యాంజలిం**
**త్వత్తీరే వపుషోऽవసానసమయే నారాయణాంఘ్రిద్వయమ్**
**సానందం స్మరతో భవిష్యతి మమ ప్రాణ ప్రయాణోత్సవే**
**భూయా ద్భక్తి రవిచ్యుతా హరిహరాద్వైతాత్మికా శాశ్వతీ.**

ఓ తల్లీ! శంభుని సాంగత్యముతో నొప్పు జాహ్నవీ! నీ తీరమునందు శరీరవసాన సమయమునందు శిరస్సున దోసిలొగ్గి శ్రీమన్నారాయణుని పాదపద్మములను ఆనందముతో స్మరించుచున్న నాకు ప్రాణప్రయాణకాలమున ఎడతెగని హరిహరా భేదరూపమగు భక్తి స్థిరమైనదై కలుగుగాక !

**ఇతి శ్రీమచ్ఛంకర *భగవత్పాద* కృతః *గంగాష్టకమ్* సంపూర్ణమ్.**

(అష్టకము అని పేరు గలదు కాని ఆరు శ్లోకములే లబ్ధమైనది.)

## శ్రీమణికర్ణి కాష్టకమ్

**1. త్వత్తీరే మణికర్ణి కే ! హరిహరౌ సాయుజ్య ముక్తి ప్రదౌ**
**వాదం తౌ కురుతః పరస్పర ముభౌ జంతోః ప్రయాణోత్సవే**
**“మద్రూపో మనుజోऽయ మస్తు” హరిణా ప్రోక్త శ్శివ స్తత్ క్షణాత్**
**తన్మధ్యాద్ భృగులాంఛనో గరుడగః పీతాంబరో నిర్గతః.**

ఓ మణికర్ణికా! సహయోగమును, మోక్షమును నిచ్చు హరిహరులు నీ తీరము నందు ప్రాణి యొక్క అవసానదశ విషయమై పరస్పరము వాదము చేయుచున్నారు. “ఈ జనుడు నామరూపము గలవాడగుగాక” అని విష్ణువు పలుకగనే వాని మధ్య నుండి వెంటనే శివునితో మృతడైన ఆమానవుడు స్వలాంఛనములతో గరుడారూఢుడై పీతాంబరధారియై బయలుదేరెను.

**2. ఇంద్రాద్యా స్త్రిదశాః పతంతి నియతం భోగక్షయే తే పున**
**ర్జాయంతే మనుజా స్తతోऽపి పశవః కీటాః పతంగాదయః**
**యే మాత! ర్మణికర్ణి కే! తవ జలే మజ్జంతి నిష్కల్మషాః**
**సాయుజ్యేऽపి కిరీట కౌస్తుభధరాః నారాయణాస్స్యుర్నరాః.**

ఇంద్రాదిదేవతలు పుణ్యఫలానుభవము ముగిసినంతనే మనుజులుగనో, పశువులుగనో, పురుగులుగనో, పక్షులు మొదలగువాని రూపుగనో పుట్టుదురు. “క్షీణే పుణ్యె మర్త్యలోకం విశంతి” – భగవద్గీత. ఓ తల్లీ ! మణికర్ణికా ! నీ నీట మునిగిన మానవులు పాపరహితులై సహయోగమున్నను కిరీట కౌస్తుభధరులై నారాయణులే యగుదురు.

**3. కాశీ ధన్యతమా విముక్తి నగరీ సాలంకృతా గంగయా**
**తత్రేయం మణికర్ణికా సుఖకరీ ముక్తిర్హి తత్కింకరీ**
**స్వర్లోక స్తులిత స్సహైవ విబుధైః కాశ్యా సమం బ్రహ్మణా**
**కాశీ క్షోణితలే స్థితా గురుతరా స్వర్గో లఘుః ఖే గతః**

విముక్తి క్షేత్రమగు కాశి ధన్యమైనది. అది గంగచే నలంకరింపబడినది. అందు ఈ మణికర్ణిక సుఖకరమైనది. ముక్తి దానికి వశమైనది. బ్రహ్మదేవునిచే కాశితో దేవతలతో గూడిన స్వర్గము త్రాసునందుంచబడగా తేలికయై స్వర్గము ఆకాశమునకు పోయెను. మిక్కిలి బరువైనదై కాశి భూమియందుండెను.

**4. గంగాతీర మనుత్తమం హి సకలం తత్రాపి కాశ్యుత్తమా**
**తస్యాం సా మణికర్ణి కోత్తమతమా యత్రేశ్వరో ముక్తిదః**
**దేవానా మపి దుర్లభం స్థల మిదం పాపౌఘ నాశక్షమం**
**పూర్వోపార్జిత పుణ్యపుంజ గమకం పుణ్యై ర్జనైః ప్రాప్యతే.**

గంగాతీర మంతయు నుత్తమమైనది గదా! అందును కాశి శ్రేష్ఠము. అందును మణికర్ణిక శ్రేష్ఠతమము. అచ్చట ఈశ్వరుడు ముక్తి ప్రదుడు. దేవతలకు గూడ దుర్ల భమైనదియు, పాపరాశిని నశింపజేయ గల్గినదియు, పూర్వజన్మమున చేసిన పుణ్య సముదాయమును సూచించునదియు నగు ఈ స్థలము పుణ్యవంతులచే పొందబడును.

**5. దుఃఖాంభోనిధి మగ్న జంతు నివహా స్తేషాం కథం నిష్కృతిః**
**జ్ఞాత్వైతద్ధి విరించినా విరచితా వారాణసీ శర్మదా**
**లోకాః స్వర్గముఖా స్తతోఽ పి లఘవో భోగాంతపాతప్రదాః**
**కాశీ ముక్తి పురీ సదా శివకరీ ధర్మార్థకామోత్తరా.**

దుఃఖసముద్రమున మునింగిన ప్రాణులకు ప్రాయశ్చిత్త మెట్లని బాగుగ ఆలోచించి బ్రహ్మదేవుడు శుభప్రదమైన కాశిని సృష్టించెను. స్వర్గము మున్నగు లోకములన్నియు పుణ్యఫలరూప సుఖానుభవాంతమున పతనము నొసంగు నవగుటచే చులకనైనవి. మోక్షపురియగు కాశి యెల్లప్పుడు ధర్మార్థ కామములచే శ్రేష్ఠమై మంగళప్రదమైనది.

**6. ఏకో వేణుధరో ధరాధరధరః శ్రీవత్స భూషాధరో**
**యోఽ ప్యేకః కిల శంకరో విషధరో గంగాధరోమాధవః**
**యే మాత ర్మణికర్ణి కే! తవ జలే మజ్జంతి తే మానవా**
**రుద్రా వా హరయో భవంతి బహవ స్తేషాం బహుత్వం కథమ్ ?**

వేణుధరుడును, గోవర్ధనధరుడును, శ్రీవత్సలాంచనధరుడును ఒక్కడే, అట్లే గంగను, పార్వతిని ధరించినవాడును, విషధరుడును నగు శంకరుడును ఒక్కడే. ఓ తల్లీ! మణికర్ణికా! నీ జలమున స్నానమాడిన జనులు అనేక రుద్రులుగను, హరులుగను అగుచున్నారు. వారికీ బహుత్వ సంఖ్య యెక్కడిది ?

**7. త్వత్తీరే మరణం తు మంగళకరం దేవై రపి శ్లాఘ్యతే**
**శక్ర స్తం మనుజం సహస్రనయనై ర్ద్రష్టుం సదా తత్పరః**
**ఆయాంతం సవితా సహస్రకిరణైః ప్రత్యుద్గతోఽభూ త్సదా**
**పుణ్యోఽసౌ వృషగోఽథవా గరుడగః కిం మందిరం యాస్యతి?**

నీ తీరమున మరణము మంగళకరమైనది. దేవతలచే గూడ కొనియాడ బడినది. ఇంద్రు డట్టి నరుని తన వెయ్యి నేత్రములతో చూచుటకు ఎప్పుడు ఆసక్తిగలిగి యుండును. అతడు వచ్చుచుండగా సూర్యుడు వెయ్యి కిరణములతో నెప్పుడు నెదురేగును. ఈ పుణ్యాత్ముడు వృషభారూఢుడై లేక గరుడారూఢుడై యే యింటి కేగునో!

**8. మధ్యాహ్నే మణికర్ణికా స్నపనజం పుణ్యం న వక్తుం క్షమః**
**స్వీయై రబ్దశతై శ్చతుర్ముఖసురో వేదార్థదీక్షాగురుః**
**యోగాభ్యాస బలేన చంద్రశిఖర స్తత్పుణ్య పారంగత**
**స్త్వత్తీరే ప్రకరోతి సప్త పురుషం నారాయణం వా శివమ్.**

మణికర్ణిక యందలి మధ్యాహ్న స్నానమువలన కలుగు పుణ్యమును చెప్పుటకు వేదముల యర్థముల చెప్పు దీక్షగల గురువుగల నాలుగు ముఖములుగల బ్రహ్మ తన నాలుగు ముఖములతో నూరు సంవత్సరములలో వర్ణించలేడు. చంద్ర శేఖరుడు (శివుడు) యోగాభ్యాస బలముచేత ఆ పుణ్యము యొక్క అంతము నెఱింగినవాడై నీ యొద్దన నారాయణునిగ గాని, శివునిగా గాని విశ్రాంతి తీసుకొను నట్లు చేయును.

**9. కృచ్ఛ్రైః కోటిశతై స్స్వపాపనిధనం యచ్చాశ్వమేధైః ఫలం**
**తత్సర్వం మణికర్ణికా స్నపనజే పుణ్యే ప్రవిష్టం భవేత్**
**స్నాత్వాస్తోత్ర మిదం నరః పఠతి చే త్సంసార పాథోనిధిం**
**తీర్త్వా పల్వలవ త్ప్రయాతి సదనం తేజోమయం బ్రహ్మణః.**

పాపనాశనముకొరకై చేయు అనేకములగు కృచ్ఛ్రవ్రతముల చేతను, అశ్వమేధ యాగముల చేతను వచ్చుఫలము మణికర్ణికా స్నానమువలన కలుగును. స్నానము చేసి యీ స్తోత్రమును పఠించు మానవుడు సంసార సాగరమును చిన్న సరస్సువలె దాటి తేజోమయమైన బ్రహ్మలోకమును చేరును.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం మణికర్ణి కాష్టకం సంపూర్ణమ్.***



# యమునాష్టకమ్

**1. కృపా పారావారాం తపనతనయాం తాపశమనీం**
**మురారి ప్రేయస్యాం భవ భయ దవాం భక్త వరదామ్**
**వియ జ్జాలా న్ముక్తాం శ్రియమపి సుఖాప్తేః పరిదినం**
**సదా ధీరో నూనం భజతి యమునాం నిత్యఫలదామ్.**

దయాసముద్రయు, సూర్య పుత్రికయు, తాపముల శాంతింప జేయునదియు, విష్ణు దేవునకు ప్రియమైనదియు, సంసారభయమును పోగొట్టునదియు, భక్తుల యభీష్టముల నిచ్చునదియు, సుఖప్రాప్తికై ఆకాశము నుండి విడువబడిన సంపదయు, ఎల్లప్పుడు ఫలప్రదయు నగు యమునా నదిని బుద్ధిమంతుడు ఎల్లప్పుడు సేవించుదురు.

**2. మధువన చారిణి! భాస్కరవాహిని ! జాహ్నవి సంగిని! సింధుసుతే !**
**మధురిపుభూషిణి! మాధవతోషిణి ! గోకులభీతి వినాశకృతే !**
**జగదఘమోచని! మానసదాయిని ! కేశవకేశి నిదానగతే**
**జయ యమునే! జయ భీతినివారిణి ! సంకటనాశని! పావయ మామ్.**

మధువనమునందు సంచరించుదానా! సూర్యునికి సంబంధించినదానా! గంగా నదిలో కలియుదానా! సింధుపుత్రీ! విష్ణుదేవుని నలంకరించుదానా! హరిని సంతోష పెట్టుదానా! గోకులము యొక్క భయమును పారద్రోలుదానా! లోకముయొక్క పాపమును పోగొట్టుదానా! చక్కని మనస్సు నను(గ్రహించుదానా! కృష్ణుని కేళులకు కారణమైనదానా! ఓ యమునా! నీవు సర్వోత్కర్షతో నొప్పుదువు గాక! భయమును ఆపత్తును నశింపజేయుదానా! నన్ను పవిత్రుని జేయము.

**3. అయి! మధురే! మధుమోద విలాసిని! శైలవిహారిణి! వేగభరే !**
**పరిజనపాలిని! దుష్టనిషూదిని ! వాంఛిత కామ విలాస ధరే !**
**వ్రజపురవాసి జనార్జితపాతక హారిణి! విశ్వజనోద్ధరికే!**
**జయ యమునే! జయ భీతినివారిణి ! సంకటనాశని! పావయ మామ్.**

మధురమైనదానా! తేనె యొక్క సువాసనతో నొప్పుదానా! పర్వతమునందు విహరించుదానా! వేగముతో నొప్పుదానా! సేవకులను రక్షించుదానా! దుష్టులను నిర్మూలనము చేయుదానా! సర్వాభీష్టములతో కూడినదానా! వ్రేపల్లెయందు జనుల పాపములను హరించుదానా! సమస్త జనులను ఉద్ధరించుదానా! ఓ యమునా! సర్వోత్కర్షతో నొప్పుము. భయమును, కష్టమును పోగొట్టుదానా! నన్ను పవిత్రుని జేయుము.

**4. అతివిపదంబుధి మగ్న జనం భవ తాప శతాకుల మానసకం**
**గతి మతి హీన మశేష భయాకుల మాగత పాదసరోజయుగం**
**ఋణభయ భీతి మనిష్కృతి పాతక కోటిశతాయుత పుంజరతం**
**జయ యమునే! జయ భీతినివారిణి ! సంకటనాశని! పాలయ మామ్.**

ఓ యమునా! భయమును కష్టమును పోగొట్టుదానా! సర్వోత్కర్షతో నొప్పుము. గొప్ప ఆపత్సముద్రమున మునిగి, అనేకములగు సంసార తాపములతో వ్యాకులచిత్తముగలిగి, గతియు మతియు లేని, సమస్త భయములతో వ్యాకులమై నీ పాదపద్మములను చేరిన, ఋణభయముతో భయపడిన, ప్రతీకారములేని కోట్లకొలది పాతక సముదాయముతో గూడిన నన్ను రక్షింపుము.

**5. నవజలద ద్యుతి కోటి లసత్తను హేమ మయాభర రంజిత కే !**
**తడిదవహేలి పదాంచల చంచల శోభిత పీత సుచేల ధ రే !**
**మణిమయ భూషణ చిత్ర పటాసన రంజిత గంజిత భానుక రే !**
**జయ యమునే! జయ భీతినివారిణి! సంకటనాశని ! పాలయ మామ్ !**

అనేకములగు క్రొక్కారు మబ్బుల కాంతితో నొప్పు శరీరమున సువర్ణాభరణ ములచే నలంకరింపబడినదానా! మెఱుపును తిరస్కరించుచు పాదముల కొనయందు నొప్పు పచ్చని వస్త్రమును ధరించినదానా! మణిమయాలంకారములతోను చిత్రపటములతో నొప్పు సింహాసనము చేతను అలంకరింపబడిన దానా! ఓ యమునా! సర్వోత్కర్షతో నొప్పుము. భయమును, కష్టమును పోగొట్టుదానా! నన్ను రక్షింపుము.

**6. శుభపులినే! మధుమత్త మదూద్భవ రాస మహోత్సవ కేళిభ రే !**
**ఉచ్చ కులాచల రాజిత మౌక్తిక హారమయాభవ రోదసి కే !**
**నవమణి కోటిక భాస్కర కంచుక శోభిత తారక హారయు తే !**
**జయ యమునే ! జయ భీతినివారిణి ! సంకటనాశని! పాలయ మామ్.**

శుభమైన యిసుక తిన్నెలుగలదానా! మద్యముతో మదించిన యాదవుల రాసక్రీడలచే నొప్పుదానా! ఎత్తైన కుచపర్వతములపై ప్రకాశించు ముత్యాల హారముతో నొప్పు భూమ్యాకాశములుగలదానా! నవమణుల కిరీటముతోను, కాంతివంతమైన కంచుకముతోను ముత్యాలహారముతోను కూడిన ఓ యమునా! సర్వోత్కర్షతో నొప్పుము. భయమును, కష్టమును పోగొట్టుదానా! నన్ను రక్షింపుము.

**7. కరివర మౌక్తిక నాసిక భూషణ వాత చమత్కృత చంచల కే !**
**ముఖ కమలామల సౌరభ చంచల మత్త మధువ్రత లోచని కే !**
**మణిగణ కుండల లోల పరిస్ఫురదాకుల గండ యుగామల కే!**
**జయ యమునే! జయ భీతినివారిణీ! సంకటనాశని! పాలయ మామ్.**

గాలిచే మిలమిలలాడెడు మెఱుపువలె మెఱయుచు గజకుంభమునందు పుట్టిన ముత్యాలతోగూడిన అడ్డబాస గలదానా! ముఖ పద్మమునందలి స్వచ్ఛమైన సుగంధముచే చంచలమైన మదించిన తుమ్మెదలవంటి నేత్రములుగలదానా! మణిమయములైన కుండలములచే ప్రకాశించుచున్న చెక్కిళ్ళు గలదానా! యమునా! సర్వోత్కర్షచే ప్రకాశింపుము. భయకష్టములు నివారించుదానా! నన్ను రక్షింపుము.

**8. కలరవ నూపుర హేమమయాంచిత పాదసరోరుహ సారుణికే !**
**ధిమి ధిమి ధిమి ధిమి తాల వినోదిత మానవ మంజుల పాదగతే !**
**తవ పద పంకజ మాశ్రిత మానవ చిత్త సదాఖిల తాప హరే!**
**జయ యమునే! జయ భీతినివారిణి! సంకటనాశని! పాలయ మామ్.**

మధురధ్వనిగల అందెల బంగారముతో నొప్పు పాదపద్మములచే నెఱ్ఱనైన దానా! ధిమిధిమి తాళములచే వినోదింపజేయబడిన మనస్సుగల పాద గమనము గలదానా! నీ పాదపద్మముల నాశ్రయించినవాని మనస్సునందలి తాపముల నెల్ల హరించుదానా! ఓ యమునా! సర్వోత్కర్షతో నొప్పుము. భయమును, కష్టమును వారించుదానా! నన్ను రక్షింపుము.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం యమునాష్టకమ్ సంపూర్ణమ్.***

## నర్మ దాష్టకమ్

**1. సబిందు సింధుర స్థల త్తరంగ భంగ రంజితం**
**ద్విషత్సు పాపజాత జాతకారి వారి సంయుతమ్**
**కృతాంత దూత కాలభూత భీతి హారి వర్మదే!**
**త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే !**

మదపుటేనుగువలె తొట్రుపడు తరంగ రచనలచే నలంకరింపబడినదియు శత్రువులయెడ పాపసముదాయమును కల్గించు నీటితో కూడినదియు నగు నీ పాద పద్మమును ఓ దేవీ! నర్మాదా! యమదూతలు, మృత్యువు, భూతములు వీనివలన కలుగు భయమును హరించు కవచము నిచ్చుదానా! నమస్కరించుచున్నాను.

2. త్వదంబు లీన దీన మీన దివ్యసంప్రదాయకం
కలౌ మలౌఘ భారహారి సర్వతీర్థ నాయకమ్
సుమత్స్య కచ్ఛ నక్ర చక్ర చక్రవాక శర్మదే !
త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే !

మత్స్యములకు, మకర సముదాయమునకు, చక్రవాక పక్షులకును సుఖమును కలుగజేయు ఓ నర్మదాదేవీ! నీ జలమునందు దాగిన దీనములైన మత్స్యములకు దివ్యత ననుగ్రహించునదియు, కలియుగమున పాపసముదాయ భారమును హరించు నదియు, సమస్త తీర్థములలో శ్రేష్ఠమును నగు నీ పాదపద్మమును నమస్కరింతును.

3. మహా గభీర నీరపూర పాప ధూత భూతలం
ధ్వన త్సమస్త పాతకారి దారితా పదాజలం !
జగల్లయే మహాభయే మృకండుసూను హర్మ్యదే !
త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే !

మిక్కిలి భయంకరమైన ప్రళయకాలమున మార్కండేయునకు ఉన్నత స్థానమును ఇచ్చిన నర్మదాదేవీ! మిక్కిలి లోతైన నీటి ప్రవాహముచే పాపముల నుండి ప్రక్షాళనముచేయబడిన భూతలము గలదియు, గర్జించుచున్న సమస్త పాతకములకు విరోధియు, నశింపజేయబడిన ఆపదలు గలదియు నగు జలముగల నీ పాద పద్మమును నమస్కరింతును.

4. గతం తదైవ మే భయం త్వదంబు వీక్షితం యదా
మృకండు సూను శౌన కాసురారి సేవి సర్వదా
పున ర్భవాబ్ధి జన్మజం భవాబ్ధి దుఃఖ వర్మదే !
త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే !

సంసారసాగర దుఃఖమును తొలగించు నర్మదాదేవీ! సంసారసాగరమున పుట్టుటచే కలిగిన నా భయము, మార్కండేయుడు, శౌనకుడు, దేవతలు సేవించు నట్టి నీ జల మెప్పుడు చూడబడెనో, అపుడే పోయెను. నీ పాదపద్మమును నమస్కరింతును.

5. అలక్ష లక్ష కిన్న రామరాసురాది పూజితం
సులక్ష నీరతీర ధీర పక్షిలక్ష కూజితం
వశిష్ఠ శిష్ట విప్పలాద కర్దమాది శర్మదే!
త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే !

వశిష్ఠుడు, వేదవిహిత కర్మాచరణ తత్పరుడగు విప్పలాదుడు, కర్దముడు మున్నగు మునులకు సంతోషమును కలిగించు నర్మదాదేవీ! చూడనలవికాని అనేకులైన కిన్నరులు, అమరులు, అసురులు మున్నగువారిచే పూజింపబడునది, చూడ ఇంపైన నీటిసమీపమున ననేక పక్షుల ధ్వనులు గల నీ పాదపద్మమును నమస్కరింతును.

6. సనత్కుమార నాచికేత కశ్యపాత్రి షట్పదై
ర్ధృతం స్వకీయ మానసేషు నారదాది షట్పదైః
రవీందు రంతిదేవ దేవరాజ కర్మ శర్మదే!
త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే !

సూర్యచంద్రులు, రంతిదేవుడు, దేవరాజు వీరల కర్మలకు సంతోషము నొసంగు నర్మదాదేవీ! సనత్కుమారుడు మున్నగు తుమ్మెదల చేతను తమ మనస్సు లందు ధరింపబడిన నీ పాదపద్మమును నమస్కరింతును.

7. అలక్ష లక్ష లక్ష పాపలక్ష సారసాయుధం
తతస్తు జీవజంతు తంతు భుక్తి ముక్తి దాయకమ్
విరించి విష్ణు శంకర స్వకీయ ధామ వర్మదే !
త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే!

అనేకము లగు పాపములను పోగొట్టునదియు, ప్రాణి సముదాయమునకు భక్తిని ముక్తిని నొసంగునదియు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల స్వస్థానములకు రక్షకమైన దియునగు ఓ నర్మదా దేవి! నీ పాదపద్మమును నమస్కరింతును.

8. అహోఽమృతం స్వనం శ్రుతం మహేశ కేశ జాతటే
కిరాతసూతవాఢ వేషు పండితే శఠే నటే
దురంత పాపతాపహారి సర్వజంతు శర్మదే !
త్వదీయ పాదపంకజం నమామి దేవి! నర్మదే !

సమస్త ప్రాణులకు సుఖము నిచ్చునట్టి, ప్రకాశించునట్టి, ఓ నర్మదానదీ! నీ యొడ్డున, బోయ వారికి, పండితులకు, వంచకులకు, నటులకు, అందరికిని అంతులేని తాపములను పోగొట్టు అమృతాయ మానమగు ధ్వని వినబడినది. ఓ నర్మదా దేవి! నీ పాదపద్మములకు నమస్కారము.

9. ఇదం తు నర్మదాష్టకం త్రికాల మేవ యే సదా
పఠంతి తే నిరంతరం న యాంతి దుర్గతిం కదా
సులభ్య దేహ దుర్లభం మహేశధామ గౌరవం
పునర్భవా నరా న వై విలోకయంతి రౌరవమ్.

ఈ నర్మదాష్టకమును మూడు పూటలందు నిరంతరము పఠించువారు ఎప్పుడును దుర్గతిని పొందరు. దేహధారులకు దుర్లభమైన కైలాసమును చేరి రౌరవ నరకమును చూడరు.

*ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం నర్మదాష్టకమ్ సంపూర్ణమ్.*

# శ్రీ రాజరాజేశ్వర్యష్టకమ్

**1. అంబా శాంభవి చంద్రమౌళి రబలాஉ పర్ణా ఉమాపార్వతీ**
**కాళీ హైమవతీ శివా త్రినయనీ । కాత్యాయనీ భైరవీ**
**సావిత్రీ నవయౌవనా శుభకరీ సామ్రాజ్య లక్ష్మీప్రదా**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

అమ్మా శాంభవీ! అత్యంత సౌందర్యవంతురాలైన నీవు, తలపైనున్న పున్నమి చంద్రుని వల్ల మరింత శోభాయమానంగా ఉన్నావు. శివుని కోసం నీవు తపస్సు చేసే సందర్భంలో ఏ పర్ణములు (ఆకులు) కూడా భుజించకపోవటం వల్ల నీకు 'అపర్ణ' అనే పేరు వచ్చింది. నిన్నే పార్వతీ, కాళీ, హైమవతి, శివ అనే అనంతకోటి నామాలతో భక్తులు పిలుస్తుంటారు. మూడు లోకాలను వీక్షించటానికి మూడు కళ్ళున్న నిన్ను కాత్యాయనీ భైరవీ, సావిత్రీ అనే పేర్లతో కూడా పిలుస్తుంటారు. నీవు నిత్య నవయవ్వనవంతురాలవు. సకల శుభాలనూ. ఐశ్వర్య, సామ్రాజ్యాలను (అధికారాలను) ఒనగూర్చి, తరిగిపోని నిరంతర నిత్యానందాన్ని ప్రసాదించే నీవు సర్వాధిక్యురాలవు. నీకు మరే శక్తీ సాటి రాదు, లేదు. నీవే దైవ స్వరూపిణివి. సర్వజగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

**2. అంబా మోహిని దేవతా త్రిభువనీ । ఆనందసంధాయినీ**
**వాణీ పల్లవపాణి వేణు మురళీ గాన । ప్రియా లోలినీ**
**కల్యాణీ ఉడురాజబింబవదనా । ధూమ్రాక్ష సంహారిణీ**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

అమ్మా మోహినీ! మూడులోకాలను పరమానంద పరుస్తున్నావు. నీవే వాక్కువి (వాణివి) శ్రీకృష్ణుడి మురళీగానం అంటే నీకు అమిత ఇష్టం. నీవు శుభంకరివి. చంద్రబింబం లాంటి నీ మోము, నీ సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తుంది. లోకకంటకుడైన ధూమ్రాక్షుడనే రాక్షసుని సంహరించి సకల జగత్తును రక్షించినావు. నీవే దైవ స్వరూపిణివి. సర్వజగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

**3. అంబా నూపురరత్న కంకణధరీ । కేయూరహారావళీ**
**జాజీచంపక వైజయంతిలహరీ । గ్రైవేయవైరాజితా**
**వీణా వేణు వినోద మండితకరా । వీరాసనే సంస్థితా**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

తల్లీ లోకపావనీ! రత్నాలు, వజ్రాలు పొదిగిన కంకణాలు (గాజులు) ధరించి నీవు భక్తులకు అమితానందం కలిగిస్తున్నావు. కేయూరాలనబడే దివ్యపుష్పమాలచేత అలంకరించబడి కనులకు విందు చేస్తుంది. నీ దివ్య మంగళ స్వరూపం సుగంధభరితమైన జాజిపూలతో, ముత్యాలతో నీవు అలంకృతవై ఉన్నావు. వీణా, వేణువులు ధరించి సంగీతం పట్ల నీ అనురక్తిని తెలియచేస్తున్నావు. మా రక్షణ కోసమే నీవు యోగముద్రలో, వీరాసనంలో కూర్చున్నావు. నీవే దైవ స్వరూపిణివి. సర్వజగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

**4. అంబారౌద్రిణి భద్రకాళి బగళా । జ్వాలాముఖీ వైష్ణవీ**
**బ్రహ్మాణీ త్రిపురాంతకీ సురనుతా । దేదీప్యమానోజ్జ్వలా**
**చాముండా శ్రితరక్షపోష జననీ । దాక్షాయణీ పల్లవి**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

తల్లీ భద్రకాళీ! రౌద్ర రూపంలో దుర్మార్గులకు భయం కలిగిస్తావు. నీవే బగళవు, నీవే జ్వాలాముఖివి, నీవే బ్రహ్మాణివి, నీవే వైష్ణవివి సకలదేవతల చేత పూజించబడే నీవు దివ్యకాంతులతోటి తేజరిల్లుతున్నావు నీవే చాముండివి. సృష్టి, స్థితి, లయలను పరిపాలించే సర్వ జగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

**5. అంబాశూలధనుఃకుశాంకుశధరీ । అర్ధేందు బింబాధరీ**
**వారాహీ మధుకైటభ ప్రశమనీ । వాణీరమా సేవితా**
**మల్లా ద్యాసుర మూక దైత్యదమనీ । మాహేశ్వరీ అంబికా**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

అమ్మా! శూలం, ధనుస్సు, అంకుశాలు ధరించి, చంద్రరేఖను తలపై ధరించి భక్తులకు నీ దివ్యరూపాన్ని చూపిస్తున్నావు. నీవే వారాహివి నీవే మధుకైటభులనే లోకకంటకులైన రాక్షసులను సంహరించావు. లక్ష్మీ సరస్వతులు ఎల్ల వేళలా నీ కీర్తిని స్తుతిస్తూ గానం చేస్తుంటారు. మల్ల, మూక అనే రాక్షసులను కూడా నీవే సంహరించావు. నీవే మహేశ్వరివి. నీవే తల్లివి. సర్వజగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

**6. అంబా సృష్టి వినాశపాలనకరీ । ఆర్యా విసంశోభితా**
**గాయత్రీ ప్రణవాక్షరామృత రసః పూర్ణాను సంధీకృతా**
**ఓంకారీ వినుతాఽసురార్చితపదా । ఉద్దండదైత్యాపహా**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

అమ్మా! సృష్టి, స్థితి, లయ కారకురాలవైన నీవు ఆర్యాణివి, గాయత్రివి. నీవు సర్వాలంకార శోభితవు. 'ఓం' అనబడే ప్రణవాక్షరంలోని అమృత రసధారవు నీవు భూమిని, స్వర్గాన్ని సృష్టించింది నీవే. నీవే ఓంకారిణివి. వినతాసుతుడైన గరుత్మంతుడు నీకు సదా సన్నుతులు సమర్పించుకుంటున్నాడు. భయంకరులైన రాక్షసులను సంహరించి సమస్తలోకాలను కాపాడిన తల్లివి నీవు. సర్వజగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

**7. అంబాశాంకరి ఆగమాదివినుతా । ఆర్యామహాదేవతా**
**యా బ్రహ్మాది పిపీలి కాంత జననీ । యావై జగన్మోహినీ**
**యాపంచప్రణవ ద్విరేఫ జననీ । యాచిత్కళామాలినీ**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

తల్లీ! సమస్తలోకాలూ నీకు ప్రణమిల్లుతున్నాయి. సహజ శక్తివంతురాలైన ఆర్యాణివి నీవు. బ్రహ్మను మొదలుకొని చిన్న చీమ వరకూ సకలసృష్టీ నీచేతనే చేయబడింది. ఓంకారం లాంటి పంచప్రణవములకు నీవే ఆధారం, మూలం. నిన్ను సద్బుద్ధితో ఆరాధించే జ్ఞానవంతులే నీకు పూలమాల సమర్పించటానికి అర్హులు, సర్వజగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

**8. అంబా పాలిత భక్తరాజ రనిశం । అంబాష్టకం యః పఠేత్**
**అంబా లోకకటాక్షవీక్షలలితా । ఐశ్వర్యమవ్యాహతా**
**అంబాపావనమంత్రరాజపఠనా । దంత్యేన మోక్షప్రదా**
**చిద్రూపీ పరదేవతా భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ.**

అమ్మను భక్తితో కొలిచే వారు శ్రద్ధతో ఈ అష్టకాన్ని పఠించే వారు అమ్మ కటాక్ష వీక్షణములతో పాటుగా అష్టైశ్వర్యాలనూ పొందగలరు. పరమపావని అయిన అమ్మను సద్బుద్ధితో స్తుతించేవారికి, అమ్మ మోక్షాన్ని ప్రసాదిస్తుంది. సర్వజగత్తును, దేవతలనూ, పాలించి, రక్షించే రాజరాజేశ్వరీ దేవివి. నీకు భక్తితో ప్రణమిల్లుతున్నాను.

## శ్రీ రాజరాజేశ్వరీ స్తుతిః

**వందేమాతర మంబికాం భగవతీం వాణీరమా సేవితాం**
**కల్యాణీం కమనీయ కల్పలతికాం కైలాస నాథప్రియాం**
**వేదాంత ప్రతిపాద్యమాన విభవాం విద్వన్మనో రంజనీం**
**శ్రీ చక్రాంకిత రత్న పీఠనిలయాం శ్రీ రాజరాజేశ్వరీమ్ ॥**

షడ్గుణ సంపన్నురాలగు, సకల జగత్తుకు తల్లివైన, సరస్వతీ లక్ష్మీదేవిలచే సేవింపబడుచున్న, శుభప్రదమైన కమనీయమగు కల్పలతవంటి, పరమేశ్వరునకు

ప్రియమైన దానివి అగు, వేదాంతముల యందు సుసంపన్నముగా స్తుతింపబడుచున్న, విద్వాంసుల మనమును రంజింప జేయు 'శ్రీచక్ర' చిహ్నముగల రత్నమయ పీఠమున విరాజిల్లుచున్న శ్రీరాజరాజేశ్వరీ దేవిని నమస్కరించు చున్నాను.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం రాజరాజేశ్వరీ స్తోత్రం / సుత్తిః సంపూర్ణమ్.***

❀ ❀ ❀

## శ్రీ మంత్ర మాతృకా పుష్పమాలా స్తవము

ధర్మార్ధ కామమోక్షములగు నాల్గు పురుషార్థములలో మోక్షము నిత్య పురుషార్థమని ప్రమాణములు చెప్పుచున్నవి. అట్టి మోక్షమునకు పరమాత్మ సాక్షాత్కారమే సాధనము. అట్టి జ్ఞానమునకు పరాశక్తి ఆరాధన సాధనము. సత్వ రజ స్తమో గుణ సామ్యావస్థతోనున్న మాయా శబళిత చైతన్య స్వరూపిణి లలితా త్రిపురసుందరీ. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు మహా కాళీ మహాలక్ష్మి మహా సరస్వతులకును కారణభూతురాలగు పరదేవీ మాతృకా పంచదశీ స్తోత్రమును పారాయణ చేసిన వారికి, ఇహపర సౌఖ్యములు గలిగి పరమ మోక్షముకూడా కలుగు ననుటలో సందేహములేదు. కనుక ఈ స్తోత్రమును, అర్థమును తెలిసికొని పారాయణచేయుట సర్వక్షేమకరము.

**1. కల్లోలోల్లసితామృతాబ్ధి లహరీ । మధ్యే విరాజన్మణి ॥**
**ద్వీపే కల్పక వాటికా పరివృతే । కాదంబ వాట్యుజ్వలే ॥**
**రత్న స్తంభ సహస్ర నిర్మిత । సభామధ్యేవిమానోత్తమే ॥**
**చింతారత్న వినిర్మితం జననితే । సింహాసనం భావయే ॥**

***(ఆసనం సమర్పయామి)***

ఎత్తైన అమృత సముద్ర తరంగములమధ్య ప్రకాశించుచున్న మణిద్వీపమందు కల్పవృక్షములు, కడిమిచెట్లచే విలసిల్లునట్టి, రత్నములచే నిండిన వేలకొలది స్తంభములచే తయారైన సభా మధ్యములో విమాన స్థానములో చింతామణిచే నిర్మింపబడిన నీ సింహాసనమును, ఓ తల్లీ! స్మరించుచున్నాను.

**2. ఏణాంకానల భానుమండల లసత్ శ్రీ చక్ర మద్యేస్థితాం ।**
**బాలార్క ద్యుతిభాసురాం । కరతలైః పాశాంకుశౌ బిభ్రతీం ॥**
**చాపం బాణమపి ప్రసన్న వదనాం । కౌసుంభ వస్త్రాన్వితాం ॥**
**తాం త్వాం చంద్రకళావతంసమకుటాం । చారుస్మితాంభావయే ॥**

***(ధ్యానం సమర్పయామి)***

శ్రీ చక్రమందున్న మూడు కోణములు చంద్ర, సూర్య, అగ్ని మండలముల మధ్య బిందు స్థానమున ఉదయించు సూర్యుని వంటి కాంతిగల్గి, నాల్గు చేతులయందు పాశ, అంకుశ, ధనుర్బాణములను ధరించి, పట్టువస్త్రమును ధరించి, బాలచంద్రుని శిరస్సునందు భూషణముగ ధరించి, చిరునవ్వు, చిందించు ప్రసన్నమైన నీ ముఖమును తలంచుచున్నాను.

**3. ఈశానాది పదం శివైక ఫలకం । రత్నా సనం తేశుభం ॥**
**పాద్యం కుంకుమ చందనాది భరితై రర్ఘ్యం సరత్నాక్షతైః ॥**
**శుద్ధైరాచమనీయకం తవజలై । భక్త్యామయా కల్పితం ॥**
**కారుణ్యామృతవారిధే । తదఖిలం సంతుష్టయే కల్ప్యతామ్ ॥**
***(పాదయోపిపాద్యం, హస్తయోరర్ఘ్యం ముఖే ఆచమనీయం సమర్పయామి)***

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశానులు నాలుగు కోళ్ళుగా, సదా శివుడు ఫలకముగా నున్న నీకిది ఆసనము. అట్లే పాద్యము కుంకుమ చందనాది పరిమళ ద్రవ్యములు కల రత్నాక్షతలతో కూడిన అర్ఘ్యము, మరియు శుద్ధమైన నీరును ఆచమనీయముగను భక్తిచే నేనిచ్చు ఈ యుపచారములను దయగల తల్లీ ! నా తృప్తి కొరకు స్వీకరింపుము.

**4. లక్ష్యేయోగి జనస్యలక్షిత। జగజ్జాలే విశాలేక్షణే ।**
**ప్రాలేయాంబు పటీర కుంకుమ । లసత్ కర్పూరమిశ్రోదకైః ॥**
**గోక్షీరై రపినారికేళసలిలై । శుద్ధోదకై ర్మంత్రితై ॥**
**స్నానం దేవిధియామయై తదఖిలం సంతుష్టయే కల్ప్యతామ్ ॥**
***(పంచామృత, శుద్ధోదకముల స్నానము సమర్పయామి.)***

మహాయోగులచే చూడబడు ఓ తల్లీ! ప్రపంచమును సృష్టించిన, విశాలమైన కన్నులుగల ఓ దేవీ! హిమవత్పర్వతము నుండి వచ్చు గంగా జలమునందు, చందన కర్పూర, కుంకుమాది సుగంధములను కలిపి, ఆవు పాలతో, నారికేళ జలముతో, శుద్ధ జలముతో, మంత్ర పూర్వకముగా నాచే (భావనచే) నీకు స్నానము ఏర్పాటు చేయబడినది. స్వీకరింపుము.

**5. హ్రీంకారాంకిత మంత్ర లక్షితతనో । హేమాచలాత్సంచితై**
**రత్నైరుజ్వల ముత్తరీయ సహితం । కౌసుంభ వర్ణాంసుకమ్**
**ముక్తా సంతతి యజ్ఞ సూత్రమమలం సౌవర్ణ తంతూద్భవం ॥**
**దత్తందే విధియామయై తదఖిలం । సంతుష్టయే కల్ప్యతామ్ ॥**
***(వస్త్ర యుగ్మం, యజ్ఞోపవీతం, సమర్పయామి.)***

మాయా బీజమైన హ్రీంకారము గల మంత్రము తెలియదగిన ఓ తల్లీ! మేరు పర్వతము నుండి తీసికొని వచ్చిన రత్నములు కూర్చిన వస్త్రములు, ముత్యాల హారము, బంగారు యజ్ఞోపవీతము ఇవి నా బుద్ధిచే నీచ్చుచున్నట్లు భావన చేయుచున్నాను. అనుగ్రహముతో స్వీకరింపుము.

**6. హంసైరప్యతి లోభనీయగమనే హారావళీముజ్వలాం ।**
**హిందోళద్యుతి హీరపూరిత తరే । హేమాంగదే కంకణే ॥**
**మంజీరౌ మణి కుండలే మకుటమప్యర్ధేందు చూడామణిం ।**
**నాసా మౌక్తిక మంగుళీయకటకౌ । కాంచీమపిస్వీకురు ॥**

***(సర్వాభరణాని సమర్పయామి.)***

హంసలకు కూడ ఈర్ష్య కల్గునట్టి అందమైన నడక గల ఓ త్రిపురసుందరీ! వజ్రాల హారము మిక్కిలి కాంతిగల రవ్వల గాజులు, కాళ్ళ గజ్జెలు, చెవులకు మణి కుండలములు శిరస్సునందు అర్ధ చంద్రుని ఆభరణముగను, ముక్కున ముత్యాల ముక్కెర, నడుమునకు ముమ్వలత్రాడు (వడ్డాణము వంటిది) సమర్పించుచున్నాను.

**7. సర్వాంగే ఘన సారకుంకుమ ఘన-శ్రీగంధ పంకాంకితం**
**కస్తూరీ తిలకంచ ఫాలఫలకే గోరోచనా పత్రకమ్ ।**
**గండాదర్శన మండలే । నయన యోర్దివ్యాం జనం తేంజితమ్ ।**
**కంఠాబ్జేమృగనాభిపంకమమలం । త్వ త్ప్రీతయేకల్ప్యతామ్ ॥**

***(శ్రీ గంధాం ధారయామి.)***

నీ శరీరమును, శ్రీగంధము, పచ్చకర్పూరము, కుంకుమలచే నలది నుదురు భాగమున కస్తూరీ తిలకమునుదిద్ది అద్దమువంటి చెక్కెళ్ళ యందు గోరోచనములచే అలంకారమును చేసి। కన్నులకు అందమైన కాటుక, కంఠమందు కస్తూరీ పరిమళమును అద్దుచున్నాను. ప్రేమతో స్వీకరింపుము.

**8. కల్హారోత్పల మల్లి కామరువకై । స్సౌవర్ణ పంకేరుహై ॥**
**జాచీ చంపక మాలతీ వకుళకైః । మందార కుందాదిభిః ॥**
**కేతక్యాకర వీరకైః బహువిధైః । క్లుప్తాస్స్ర జోమాలికాః ॥**
**సంకల్పేన సమర్పయామి వరదే । సంతుష్టయే కల్ప్యతామ్ ॥**

***(పుష్పమాలికా సమర్పయామి)***

ఎఱ్ఱకలువలు, మల్లె, మరువము, బంగారు పద్మములు, సంపెంగ, మాలతి, మందార, మొగలి, మొదలగు అనేక విధములైన పుష్పములచే మాలలుగట్టి నా భావనచే నీకర్పించుచున్నాను.

9. హంతారం మదనస్యనందయసియైరంగై రనంగో జ్వలై
యైర్భృంగావళి నీలకుంతల భరైః బధ్నాసి తస్యాశయమ్ ।
తానీమానితవాంబ కోమలతరాణ్యా మోదలీలాగృహా ।
ణ్యామోదాయదశాంగగుగ్గులు ఘృతైఃధూపైరహంధూపయే ॥

*(ధూపమా ఘ్రాపయామి)*

మన్మథుని దహించిన పరమేశ్వరుని నీ శరీర సౌందర్యముచే ఆనందింప జేయుచున్నావు. తుమ్మెదల సముదాయమువలె దట్టమైన కేశ పాశములచే పరమేశ్వర హృదయమును ఆకర్షించిన సహజ సౌందర్యముతో గూడిన కోమలమైన కేశములకు మరింత సువాసనకై దశాంగ గుగ్గలు నేతి ధూపములచే ఉపచారమును కల్పించుచున్నాను. స్వీకరింపుము.

10. లక్ష్మీముజ్జ్వలయామిరత్న నివహో। ధ్వాసాంతరేమందిరే ।
మాలారూప నిలంబితైర్మణిమయ స్తంభేషు సంభావితే ॥
చిత్రైర్హాటక పుత్రికా కరధృతైః । గవ్యైఘృతైర్వర్ధితై
ర్దివ్యైర్దీప గణైర్ధియాగిరిసుతే । సంతుష్టయే కల్పాతామ్ ॥

*(దీపం దర్శయామి)*

మిక్కిలి కాంతిగల రత్నములచే కూర్చబడిన మందిరమందు మణిమయ స్తంభములందు మాలారూపముగా వ్రేలాడుచున్న దీపములు బంగారు ప్రతిమలుకల్గి ఆవు నేయితో చేసిన దీపమును (నా భావనచే) తృప్తి కొరకు దీపమును చూపుచున్నాను. స్వీకరింపుము.

11. హ్రీంకారేశ్వరి తప్తహాటకకృతైః । స్థాలీ సహస్రైర్భృతం ।
దివ్యాన్నం ఘృతసూపశాక భరితం । చిత్రాన్న భేదం తథా।
దుగ్ధాన్నం మధుశర్కరా దధియుతం । మాణిక్యపాత్రే స్థితం ।
మాషాపూపతః సహస్రమంబ సఫలం। నై వేద్యమావేదయే ॥

*(నై వేద్యం సమర్పయామి)*

మహామాయా స్వరూపిణి! స్వచ్ఛమైన బంగారముతో చేసిన అనేక పాత్రల యందు వండిన వివిధములైన సూప, శాక, భక్ష్య, భోజ్య మధుర పదార్థములతో కూడిన వరి అన్నమును నైవేద్యముగా సమర్పించుచున్నాను.

12. సచ్ఛాయై ర్వరకేతకీ దళరుచా। తాంబూలవల్లీ దళైః ।
పూగైర్భూరిగుణైస్సుగంధి మధురైః । కర్పూర ఖండోజ్జ్వలైః ।
ముక్తాచూర్ణ విరాజితైర్భహు విధై ర్వక్త్రాంబుజామోదితైః ।
పూర్ణారత్న కళాచికా తవముదేన్యస్తా పురస్తాదుమే ॥

(తాంబూలం సమర్పయామి)

ఓ పార్వతీ! మంచి కాంతిగల లేత తమలపాకులతో సుగంధ ద్రవ్యములతో కర్పూరముతోకూడి ముఖమునకు మిక్కిలి సువాసనను కలిగించు తాంబూలమును నీకు సమర్పించుచున్నాను.

13. కన్యాభిః కమనీయకాంతి భిరలంకారామలారార్తికా ।
పాత్రేమౌ క్తిక చిత్రపఙ్క్తి విలసత్కర్పూర దీపాళిభిః ।
తత్తత్తాళ మృదంగగీత సహితం నృత్యత్పదాంభోరూహం ।
మంత్రారాధనపూర్వ కంసునిహితం – నీరాజనం గృహ్యతామ్ ॥

(నీరాజనం దర్శయామి)

మనోహరమైన కాంతిగల దివ్యస్త్రీలు అలంకరింపబడిన చిత్రమైన ముత్యములవలె ప్రకాశించు కాంతిగల హారతులనిచ్చు చుండగా, మంగళ వాద్యములు మ్రోగుచుండగా అప్సరసలు నాట్యమాడుచున్నారు. అప్పుడు మంత్ర పూర్వకముగా నీ కర్పించుహారతిని నా యందు దయతో స్వీకరింపుము.

14. లక్ష్మీర్మౌత్తిక లక్ష కల్పిత సిత। ఛ్ఛత్రం తు ధత్తేరసా ॥
ఇంద్రాణీ చరతిశ్చ చామరవరే ధత్తే స్వయం భారతీ ॥
వీణామేణవిలోచనాస్సుమనసాం నృత్యంతి తద్రాగవః
భావై రాంగిక సాత్త్వికై స్ఫుటరసం మాత స్తృయాకర్ణ్యతామ్ ॥

(గీతం శ్రావయామి నృత్యం దర్శయామి)

అనేక ముత్యములచే కూర్చబడిన తెల్లని గొడుగును లక్ష్మీదేవి పట్టుకొని యున్నది. శచీదేవి, రతి వీరిద్దరూ వింజామరలు పట్టుకొని వీచు చున్నారు. సరస్వతీదేవి స్వయముగా నీకు సంతోషము కల్గుటకు వీణను వాయించుచున్నది. అప్సర స్త్రీలు గానము చేయుచుండగా తగు విధముగా నాట్యము చేయుచున్నారు. పరికించుము

**15.** హ్రీంకార త్రయసంపుటేనమనునోపాస్యే త్రయీమౌళిభిః ।
**వాచ్యైర్లక్ష్యతనో తవస్తుతి విధౌ కో వాక్షమేతాంబికే ।**
**స్సల్లాపాస్తుతయః ప్రదక్షిణ శతం సంచార ఏవాస్తుతే ।**
**సంవేశో మనస స్సహస్ర మఖిలం తత్ప్రీతయే కల్ప్యతామ్ ॥**

***(తల్లీ ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి)***

మూడు హ్రీంకారములు గల పంచదశీ మహామంత్రముచే ఉపాసించదగిన ఓ జననీ! ఉపనిషత్తులయొక్క వాచ్యార్థ, లక్ష్యార్థములే స్వరూపముగా గలదానా! నిన్ను స్తుతించుట ఎవరికి శక్యమగును? నా సంభాషణమంతయు నీ స్తుతియే. నేను సంచరించుట నీకు ప్రదక్షిణ మొనర్చుటయే, నా ఆలోచన నీ ధ్యానమే అని గ్రహింపుము.

**16. శ్రీమంత్రాక్షరమాలయాగిరిసుతాం యః పూజయేచ్చే తసా**
**సంధ్యాసు ప్రతివాసరం సునియతస్త స్యామలంస్యాన్మనః**
**చిత్తాంభోరుహ మంటపేగిరి సుతానృత్తం విధత్తేరసా ।ః**
**ద్వాణీవక్త్ర సరోరుహే జలధిజా గేహే జగన్మంగళా ॥**

శ్రీ పంచదశీ మాలా స్తోత్రమును ఎవరు ప్రతిరోజు సంధ్యా సమయమునందు విడువక మానసిక పూజను చేయుదురో అట్టి మహాత్ముని యొక్క మనస్సు అనెడి పద్మ మంటపమునందు లలితాదేవి నృత్యము చేయును. ఈ మానసిక పూజ చేయువాని ముఖమునందు ఎల్లప్పుడు సరస్వతీ దేవి, ఇంటి యందు లక్ష్మీదేవి విడువక యుందురు.

**17. ఇతి గిరివర పుత్రీ పాదరాజీవభూషా ।**
**భువన మమలయంతీ । సూక్తి సౌరభ్య సారైః ।**
**శివ పదమకరంద స్యంది నీ యన్ని బద్ధా ।**
**మదయతు కవి భృంగాన్ మాతృకాపుష్పమాలా ॥**

పార్వతీదేవి పాదపద్మములకు అలంకారమైన ఈ స్తోత్రము లోకమును పవిత్రముచేయుచు, అమృతమనే మకరందమును ఇచ్చుచూ కవులు, ఉపాసకులు, పండితులు, అనుతుమ్మెదలకు ఆనందమును చేకూర్చు గాక.

***ఇతి శ్రీమచ్ఛంకర భగవత్పాద కృతం శ్రీ మంత్ర మాతృకా పుష్పమాలా స్తవము సంపూర్ణమ్.***



# 1. శ్రీ కంచి కామకోటి పీఠము



**"అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ
అవంతికా పురీ
ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకా":**

అని భారతావనిలో 7 మోక్షదాయకమైన క్షేత్రాలు ఉన్నాయి. ప్రతి యింటిలో దేవుని గది ఉన్నట్లే ప్రపంచానికి దేవాలయ సదృశమైనది భారతదేశం. ఈ పుణ్యభూమిలోని ప్రతి అంగుళం పవిత్రమైనదే. అయినప్పటికీ ఈ 7 క్షేత్రాలను మోక్షదాయిక పట్టణాలుగా చెపుతారు. ఇందులో కాశీ, అవంతిక (ఉజ్జయిని) అన్న రెండూ శివక్షేత్రాలు. అయోధ్య, మథుర, పురీ విష్ణు క్షేత్రాలు. మాయా (హరిద్వార్) శక్తి క్షేత్రం. ఇక మిగిలినది కంచి. ఇది శివ, విష్ణు, శక్తి క్షేత్రాలకు నిలయమై భక్తి, ముక్తి ప్రదమై విరాజిల్లుచున్నది. దక్షిణాదిలో ఉన్న ఏకైక మోక్షపురి కంచి.

**"నాస్తి కాంచీసమం క్షేత్రం సర్వసిద్ధిప్రదం భువి
సర్వతీర్థ సమం తీర్థం నాస్తి పాపనిబర్హణం"... అని కీర్తించబడినది.**

క్రీ॥శ॥ 600 – 750 ప్రాంతంలో పల్లవ రాజులు తమ సువిశాల సామ్రాజ్యానికి కంచి రాజధానిగా చేసుకున్నారు. ఈ నగరం చుట్టూ పెద్ద పెద్ద కందకాలు, ప్రాకారాలు నిర్మించి శత్రుదుర్భేద్యం చేశారు. అంతేకాక అనేక దేవాలయాలను స్థాపించేరు. ఒక గొప్ప పట్టణంగా, ఆధ్యాత్మిక కేంద్రంగా, శిల్ప, నృత్య, శాస్త్ర, సంగీతాది కళలకు కాణాచిగా ప్రఖ్యాతమవటానికి విశేషంగా కృషి చేశారు పల్లవ రాజులు. భరతమాతకు నాభిస్థానమైనది కంచి. ఆమెకు కాంచీ (మొలనూలు, వడ్డాణం) గా ఆభరణంగా అలరారినది. "నాభిస్థానం ఓఢ్యాణ పీఠం" అని "కాంచీస్థానమితి ప్రోక్తా మస్మాత్కాంచీపురీత్వియం" అని పెద్దల మాట.

పల్లవరాజులకు ముందు క్రీ॥శ॥ 2వ శతాబ్ది వాడైన కరికాళచోళుడు కంచి ముఖ్యపట్టణంగా పాలన సాగించినట్లు చారిత్రికాధారాలు లభించాయి. ఈ మహారాజు కాలంలోనే కంచి పట్టణానికి నూతన రూపు కల్పించి, పాలనలో ఒక క్రమ పద్ధతి యేర్పాటు చేసి, తంజావూరు, తిరుచిరాపల్లి వంటి సమీప ప్రాంతాల నుంచి వేలాది కుటుంబాలు కంచిలో స్థిరపడేటట్టు ప్రోత్సహించాడు.

పల్లవ రాజుల అనంతరం చోళులు, ఆ తర్వాత కొంతకాలం ముస్లింలు, వారి తర్వాత సాళువ తుళు వంశీయులు అంటే విజయనగర రాజులు పాలించారు. విజయనగర పతనానంతరం మరాఠీ, మొగలాయి రాజులపాలన, వారి నుండి బ్రిటిష్ వారి వశమయింది.

**"నగరేషు కంచి, నారీషు రంభ**

**పురుషేషు విష్ణు, పుష్పేషు జాజి"**

అని జన శృతిలో అనుశృతంగా వినవస్తున్న ప్రఖ్యాత శ్లోకం. దీన్నిబట్టి నారీమణుల లో రంభ, పురుషులలో విష్ణువు, పుష్పాలలో జాజి ఎట్లు ప్రశస్తమైనవో అట్లే నగరాలలో కాంచీపురం అంత ప్రముఖమైనదని అర్థమవుతోంది.

**కంచి – ప్రాచీనత:** రామాయణ, భారత, భాగవతాది ఇతిహాసాలు, శివరహస్యం, మార్కండేయ, స్కాంద, బ్రహ్మాండాది పలు పురాణములలో కంచి ప్రసక్తి, ప్రశస్తి కానవస్తుంది. కాశీ కంచి క్షేత్రాలు పరమశివుని రెండు నేత్రాలుగా బ్రహ్మాండపురాణంలో వర్ణింపబడింది. పతంజలి మహాభాష్యం (క్రీ॥పూ॥ 2వ శతాబ్ది) లోను, మూకపంచశతి (క్రీ॥శ॥5వ శతాబ్ది) లోను కంచి గురించి వివరాలున్నాయి. ప్రాచీన సాహిత్యంలో, శాసనాలలో ఈ నగర వర్ణన ఉంది. శ్రీహర్షుని నైషథంలో దమయంతి స్వయంవర సందర్భంలో కంచిలోని విశాలతటాకాలు, వీధులు దేవాలయాలు గురించి వర్ణన ఉంది. చైనా యాత్రికుడు హుయాన్త్సాంగ్ ఈ ప్రాచీన క్షేత్రాన్ని దర్శించి దాని వివరాలు గ్రంథస్థం చేశాడు. శాతవాహనుల కాలం నాటి నాణాలు కాంచీపురంలో లభించాయి. శాతవాహనులు క్రీ॥శ॥ 200 ప్రాంతంలో పరిపాలన చేశారు. ప్రఖ్యాత తమిళ ప్రబంధం మణిమేఖలై కంచి వైభవాన్ని వర్ణించింది.

హయగ్రీవ, అగస్త్య, దూర్వాస, వ్యాసాది మహర్షులు, శ్రీరామ, బలరామాది పురాణపురుషులు సంచరించిన పుణ్యస్థలి ఇది. బ్రహ్మాండ పురాణాంతర్గత లలితోపాఖ్యానం హయగ్రీవ – అగస్త్య సంవాద రూపంలో ఉంది. ఈ సంవాదం కంచిలో జరిగిందని జనశ్రుతి. రామానుజులు వరదరాజ స్వామిసేవ చేస్తూ కొంతకాలం కంచిలోనే గడిపారు. వందల వేల దేవాలయాలతో విలసిల్లుతున్న ఈ పుణ్య క్షేత్రం మోక్షదాయకం కాకపోవుటేమిటి. కంచిలో యేదో ఒక దేవుని గుడి లేని వీధిలేదు అంటే అతిశయోక్తి కాదు. అందుకే కాబోలు "కాంచ్యాం సంచరణాన్ముక్తి": అని కంచిలో సంచరిస్తేనే చాలు ముక్తి కలుగుతుంది అని చెపుతారు.

కంచిలో నివసించిన ప్రముఖులలో వేదాంత దేశికులొకరు. వీరి అసలు పేరు వేంకటనాథులు. సకల శాస్త్రాలు అభ్యసించిన వీరు శ్రీ రంగం, కంచి మున్నగు పట్టణాలలో కొంతకాలం గడిపారు. స్వయంగా శ్రీరంగనాథులచే వేదాంతాచార్య బిరుదును

శ్రీ రంగనాయకి అమ్మవారిచే సర్వతంత్రస్వతంత్ర బిరుదును పొందిన వీరు శతాధిక గ్రంథ రచన చేశారు. అందులో గరుడ దండకం చాలా ప్రసిద్ధి పొందింది. ఈ దండక రచన వెనుక ఆసక్తికర గాధ ఒకటి ఉంది. వీరు కంచిలో కాపురముంటున్న రోజులలో వీరి పేరు ప్రఖ్యాతులు చూసి అసూయచెందిన కొందరు ఒక పాములవాడిని దేశికులపైకి పంపారు. వాడు తన వద్ద గల విషసర్పాలను దేశికుల పై ప్రయోగించాడు. అప్పుడు వేదాంత దేశికులు గరుడుని ధ్యానించి ఒక దండకంతో గరుడస్తుతి చేశారు. అంతట గరుడుడు ప్రత్యక్షమై విషసర్పాలను, పాములవాడిని తరిమి వేశారు. అప్పటి నుంచి గరుడ దండకం లోకంలో ప్రసిద్ధి చెందింది. వీరిని కంచిలో మాయా (అద్వైత) వాదులు ఎదుర్కొన్నారు. వీరికి తమిళ ప్రబంధాలను వేద సమానంగా భావించి అధ్యయన పఠన పాఠనాదులు చెయ్యటం నచ్చక దేశికులను అడ్డుకొన్నారు. విశిష్టాద్వైతులగు వీరు ఆ వాదనలను ఖండించి మాయా వాదులను జయించినారట. ఈ వాదోపవాదములు 'శతదూషిణి' అను పేరున గ్రంథస్తమయ్యింది.

కాంచీక్షేత్రంలో వసంతోత్సవాలు ఆ తర్వాత ఇంద్రోత్సవాలు వైభవంగా జరుగుతూ ఉండేవి. ఈ ఉత్సవాలు ప్రజలలో భక్తిని పెంపొందింపచేసి ఆధ్యాత్మికోన్నతికి తోడ్పడే విధంగా నిర్వహించబడేవి. ఒక సంవత్సరం ఈ ఇంద్ర సభలు వణిక్ ప్రముఖుడు అవచి తిప్పయశెట్టి అండదండలతో కవిసార్వభౌముడు శ్రీనాథుని ఆధ్వర్యంలో జరిగాయి. సభలు కామాక్షి ఆశీర్బలంతో విజయవంతంగా ముగిసాయి. చివర గా

**అమ్మహాదేవి కామాక్షి అఖిల వంద్య**
**దేవతాదిమ శక్తి సందీప్త మూర్తి**
**కొంగుబంగారమై భక్తకోటికొసగు**
**భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు.**

అని కామాక్షీ కటాక్ష ప్రశంస చేశాడు శ్రీనాథుడు.

సంస్కృత మహాకవులు దండి. కిరాతార్జునీయం రాసిన భారవి ఇచటి వారేనని చెపుతారు. బౌద్ధ పండితులు దిఙ్నాగుడు, బుద్ధఘోషుడు, ధర్మపాలుడు ఇచట నివసించిన వారని బౌద్ధ వాఙ్మయం తెలుపుతోంది.

సంస్కృతాంధ్ర, వేద, జ్యోతిష, సంగీత శాస్త్రములలో నిష్ణాతులగు ఆంధ్రులు శ్రీ త్యాగరాజ స్వామి పుణ్యక్షేత్రములను దర్శించు నపుడు ఆయా దేవతలపై భక్తిరస భరితమైన కీర్తనలను రచించి గానం చేసేవారు. అట్టితరి కంచి దర్శించినపుడు వినాయకుని వలె......, వరదరాజ నిన్నేకోరి వచ్చితిరా .... వంటి అద్భుత కీర్తనలలో కామాక్షిదేవిని స్తుతించారు.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారు పిన్న వయసుననే క్రమాంత, కావ్యనాటక, వ్యాకరణ, సంగీతములను అభ్యసించి నవావరణ కృతులు, నవగ్రహ కృతులు, పంచలింగస్థల కృతులు రాసిన ప్రసిద్ధ వాగ్గేయకారులు. వీరును కాంచీపురాన్ని దర్శించి కామాక్షి అమ్మ వారిపై 'కంజదళాయతాక్షీ' ... వంటి కృతులతో స్వరార్చన చేశారు.

సంగీత త్రిమూర్తులలో ఒకరగు శ్యామశాస్త్రి చిన్నతనమునందే సంస్కృతము నభ్యసించారు. వీరి తల్లిదండ్రులు కాంచీపుర కామాక్షీ ఉపాసకులు. శ్యామశాస్త్రులు కామాక్షీ దేవి అనుగ్రహముచే అనేక కృతులు, వర్ణములు, నవరత్న మాలికలు రచించి గానము చేసి మహా గాయకుడుగా పేరుపొందిరి. కల్యాణీ కంచికామాక్షి నీపాదమె దిక్కు..., కామితార్థఫలదాయకి కామాక్షీ సకలలోక సాక్షి అని, కామపీఠ నివాసిని శాంభవీ మృడానీ అని సంబోధిస్తూ సుమారు 300 కీర్తనలు దేవిపై రచించారు.

**కంచి-కాశ్మీరు:-** భారతదేశానికి దక్షిణ ఉత్తర కొసలలో ఉన్న ఈ నగరాలమధ్య 3000 మైళ్ళ దూరం ఉన్నది. అయినా తాత్త్విక, సాహిత్య, సాంస్కృతిక విషయాలలో భావవ్యాప్తి వేగంగానే జరిగేది. రెండుచోట్లా సర్వజ్ఞ పీఠాలున్నాయి. రెండూ శైవానికి వేదశాస్త్రాల అధ్యయనానికి కేంద్రాలుగా విరాజిల్లిన నగరాలు. విద్యా సాంస్కృతిక వైదిక సంబంధాలు అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ ఉండేవి. ఆదిశంకరులవలెనే కంచి పీఠాధీశులు అనేకులు కాశ్మీరు సందర్శించారు. కంచి పీఠ 16వ ఆచార్యులు ఉజ్వలశంకర అనువారు జైనబౌద్ధాది వేద విరుద్ధ మతఖండనలో పేరెన్నిక గన్నవారు. వీరు ఆఖరు రోజులలో కాశ్మీర్‌లో కొన్నాళ్ళు గడిపి అచటనే సిద్ధిపొందేరు. వీరున్న ప్రాంతం ఉజ్వలయతిపురం అని పేరు పొందినది. కాశ్మీర సంస్థానంలో దేవమిశ్రుడు అనే ఆయన బ్రాహ్మణ మంత్రిగా ఉండేవారు. వీరి కుమారుడు గౌడసదాశివ. ఈయన ఉజ్వలశంకరుల శిష్యుడై కంచి మఠానికి 17వ పీఠాధిపతిగా నియుక్తులయ్యారు. కాశ్మీర ప్రభువు లలితాదిత్యుడు కంచి పీఠ 31వ ఆచార్యులు శ్రీ బ్రహ్మానందఘనాచార్యులను, వీరిశిష్యులు 32వ ఆచార్యులు అగు శ్రీ చిదానందఘనేంద్ర సరస్వతులను దర్శించుకొని ఆశీస్సులు పొందినట్లు, ఈ గురువుల పేరున కాశ్మీరులో ఒక అన్నదాన శాలను నెలకొల్పినట్లూ తెలియుచున్నది.

మూకపంచశతి అను 500ల శ్లోకాలతో అమ్మవారి స్తోత్రం రచించి ప్రసిద్ధుడైన శ్రీమూకశంకరులు గురుపరంపరలో 20వ వారు. వీరు జన్మచే మూగవారు. శ్రీ విద్యాఘనస్వాముల అనుగ్రహంతో వాక్సిద్ధి పొంది, అనంతర కాలంలో సన్యసించారు. పంచ - శతి ఆర్యాశతకం, పాదారవిందశతకం, స్తుతి శతకం, కటాక్ష శతకం, మందస్మిత శతకం అనే 5శతకాల సంకలనమైన 500 అద్భుత స్తోత్రాల మాలిక మూకపంచశతి. కాశ్మీర ప్రభువైన ప్రవరసేనుడు వీరిని సేవించుకున్నాడు. కంచికామకోటి పీఠంవారు

జమ్మూకాశ్మీర్‌లో సరస్వతి మందిరాన్ని, బారాముల్లాలో శైలపుత్రి మందిరాన్ని నిర్మించారు. కాశ్మీరులోని శంకరాచార్య పర్వతం మీద ఉన్న శంకరాచార్య ఆలయం కాశ్మీర రాజు గోపాదిత్యునిచే నిర్మించబడినది. ఈ విధంగా చరిత్రకందిన, చరిత్రకు అందని ఎందరో మహనీయులు, మహారాజులు కంచి – కాశ్మీరుల మధ్య తాత్త్విక, సాహిత్య, సాంస్కృతిక వారధులై నిలిచారు. భిన్నత్వంలో ఏకత్వం, జాతీయసమైక్యత ఆనాడే సిద్ధించినట్లు కంచి – కాశ్మీర్ సంబంధాల వంటి చారిత్రిక సంఘటనలు రుజువు చేస్తున్నాయి.

కంచిలోని ప్రసిద్ధ ఆలయాలలో ముందుగా చెప్పు కోవలసినది కామాక్షీదేవి ఆలయమేకదా. కంచి అనగానే అమ్మ కామాక్షి, ఆదిశంకరులు, పరమాచార్యులు – వాక్కువెంట అర్థంలా పూవువెంట తావిలా స్మృతిపథంలో మెదులుతారు. కామాక్షి తల్లి లేని కంచిని ఊహించగలమా? కామాక్షి పదానికి పలువురు కవిపండితులు పలు అర్థాలు అన్వయాలు చేశారు. కాంచీపురమున శ్రీదేవి అష్టాదశ శక్తి పీఠములలో ఒక పీఠ శక్తిగా నున్నది. లలితాత్రిశతిలో ఒక నామము 'కామకోటినిలయా'. షణ్ణవతీపీఠేషు మధ్యే కామకోటి: శ్రీచక్రమిత్యర్థ :– శక్తి పీఠములు తొంబదియారు. వానిలో నొకటి కామకోటి పీఠము. కోటికామములను తీర్చునది శ్రీచక్రమని అర్థము అని లలితాత్రిశతి వ్యాఖ్య. అటులనే లలితా సహస్రనామములలో 'కామాక్షీ' అనునదొకటి. కాంచీపుర అధిష్ఠాత్రి అయిన దేవికి ఇది ఒక అపూర్వ నామం. కమనీయమైన నేత్రములు కలది అని, కామేశ్వరుడే నేత్రములుగా కలది అనగా ఎల్లప్పుడు కామేశ్వరుని యందే దృష్టి కలది అని, జగత్ సృష్టి కామనయే నేత్రములుగా కలది అని వ్యాఖ్యానములున్నవి. అసలు లలితాత్రిపురసుందరియే కామాక్షి.

**భండాసుర వధ్యాయైషా ప్రాదుర్భూత చిదగ్నిత:**
**మహా త్రిపురసుందర్యా మూర్తిస్తేజో విజృంభితా**
**కామాక్షీతి విధాత్రాతు ప్రస్తుతా లలితేశ్వరీ ......**

తన కరుణాపూరమైన చూపులతో భక్తుల కోర్కెలను తీర్చునది అని ఒక అర్థం. క+అ+మ = కామ. క – బ్రహ్మను, అ – విష్ణువును, మ – రుద్రుని సూచించునని ఈ మూడుశక్తులు సృష్టి, స్థితి, లయములకు సంకేతాలని ఈ మూడిటిని తన కంటి (అక్షి) కదలికల మాత్రమున నిర్వహించు జగజ్జనని కామాక్షి అనియు వివరణ కలదు.

'క' కారం సరస్వతిని, 'మ' కారం లక్ష్మిని సూచించునని, లక్ష్మీసరస్వతులు రెండు కన్నులుగా కల దేవి కామాక్షి (కా – మా అక్షులుగా కలది కామాక్షి) అని ఒక అర్థం చెపుతారు. లలితా సహస్ర నామాల్లోని "సచామర రమావాణీ సవ్య దక్షిణ సేవితా" అనే నామం పై అన్వయానికి అనుగుణంగానే ఉన్నది.

ఈ శక్తి పీఠాన్ని 'కామకోటి' అంటారు. ఇక్కడ కోటి అంటే అంచు, హద్దు, పరిధి అనే అర్థాలున్నాయి. కోరికలన్నీ ఎక్కడ (ఏ హద్దు దగ్గర) ఆగి పోతాయో – ఆ నిష్కామ స్థితిలోనే ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. ఆదిశంకరులు భక్తి ప్రపత్తులతో ఆరాధించి శ్రీ చక్ర ప్రతిష్ఠ చేసిన దివ్య ఆలయం యిది. "కాంచ్యాం శ్రీచక్రరాజాఖ్య యంత్ర స్థాపన దీక్షితాయ" అని శ్రీ శంకరాచార్య అష్టోత్తర శతనామావళిలో కీర్తించబడినారు.

శ్రీచక్ర సహితంగా అమ్మవారికే ఒక ఆలయం ప్రత్యేకంగా ఉండటం ఒక అరుదైన విషయం. సాధారణంగా శివాలయాలలో గర్భగుడికి వామభాగంలో కాస్త చిన్నదిగా అమ్మవారి ఆలయమో అధిష్టానమో ఉండటం సంప్రదాయం. కాని కంచిలోని శివాలయాలలో అమ్మవారికి ప్రత్యేక ఆలయం ఉండదు. ఇదీ ఒక అరుదైన విషయమే. కాంచీపురం శ్రీచక్రాకృతిలో నిర్మింపబడినది. శ్రీచక్రంలోని బిందుస్థానం వలె కంచి నగరానికి మధ్య కామాక్షి ఆలయం ఉన్నది. సాధారణంగా ఆలయగోపురాలు తూర్పు పడమరలకు అభిముఖంగా ఉంటాయి. కాని కంచిలో మాత్రం కామాక్షి ఆలయానికి అభిముఖంగా ఉంటాయి.

**కామాక్షీం కుటిలాలకాం ఘనకృపాం కాంచీపురీ దేవతామ్**
**ఏకామ్రేశ్వర వామభాగ నిలయాం మృష్టాన్నదాం పార్వతీం**
**భక్తానా మభయప్రదాంబుజ కరాం మంబా పూర్ణేందు బింబాననాం**
**కంఠే కాంచనమాలికాం శివసతీ మంబా మజస్రం భజే.**

అని శంకరులవారు కామాక్షీదేవిని స్తుతించారు. అంతేకాదు, కలిమల ప్రధ్వంసని అని, గౌరిగా, శర్వాణీగా, బాలగా, వాగ్దేవిగా, ఐం క్లీం సౌ అను బీజాక్షర రూపిణీ అని, త్రిభువన క్షేమంకరిగా, కాంచీపట్టణ పంజరాంతర శుకిఅని, పంపాతీర రసాలమూల నిలయాం అని పలు విధాల స్తుతించారీ కాంచీపురాధీశ్వరిని.

ఇచ్చట కామాక్షిగా వెలసిన బాలాత్రిపురసుందరితో పాటుగ చంద్రమౌళీశ్వర స్పటిక లింగము కూడా శ్రీ శంకరుల కాలం నుండి అర్చించబడుచున్నది. ఇచ్చట చంద్రమౌళీశ్వరుడు యోగలింగ రూపమున అర్చింపబడుచున్నాడు. శ్రీ శంకరులవారు కైలాసము నుండి 5 స్పటిక లింగములను తెచ్చిరనియు, బదరిలో 'ముక్తి' లింగమును, నేపాల్ నీలకంఠ క్షేత్రంలో 'వర' లింగమును, చిదంబరములో 'మోక్ష' లింగమును, శృంగేరిలో 'భోగ' లింగమును, కంచిలో 'యోగ' లింగమును ఉంచి నిత్యార్చన జరుగవలెనని శాసనము చేశారు. ఈ విషయము మార్కండేయ సంహితలో వివరింపబడియున్నది.

కామాక్షీదేవి చతుర్భుజ. పుష్పబాణాలు, పాశము, అంకుశము, ఇక్షు ధనుస్సు నాలుగు చేతులలో ధరించి ఉంటుంది. ఈమె వరద అభయ ముద్రలను ధరించి యుండలేదు. శంకరులు సౌందర్యలహరిలో 'తవహి చరణావేవ నిపుణౌ' అన్నట్లు ఆ తల్లి చరణాలే వరాలను ప్రసాదించి అభయాన్ని ఇవ్వ గలవు.

కంచిలో యేదేవునికి యే ఉత్సవం జరిగినా ఆ ఉత్సవం అమ్మవారి ఆలయం చుట్టూ గల నాలుగు వీధులగుండా ప్రదక్షిణ రూపంగా వెళ్ళటం ఆచారం. ఈ సంప్రదాయం ఇప్పటికీ పాటించబడుతోంది. ముస్లిం సోదరులు కూడా ఈ ఆచారం పాటిస్తారు. కాని వారి ఉత్సవం వ్యతిరేక దిశలో అప్రదక్షిణంగా సాగుతుంది.

కామాక్షి దేవాలయం 5 ఎకరాల సువిశాల స్థలంలో నాలుగు ద్వారాలతో నిర్మించబడినది. ప్రధాన ద్వారానికిరువైపులా కాలభైరవ, మహిషాసురమర్దని విగ్రహాలు కనిపిస్తాయి. కామాక్షి గాయత్రి మండపంలో కొలువై ఉన్నది. మూలవిరాట్ చుట్టూ వారాహి, అరూప, రూపలక్ష్ములు, అర్ధనారీశ్వరుడు, మున్నగు దేవతలు పరివేష్టించి ఉన్నారు. బహిః ప్రాకారంలో సరస్వతి, అన్నపూర్ణ, అయ్యప్ప, ఆదిశంకరుల శిల్పాలు దర్శనమిస్తాయి. కాలగతిలో కంచిపట్టణం, అందలి ఆలయాలు ఎన్నోమార్పులకు లోనయ్యాయి. నేడు మనం చూస్తున్న రూపంలో ఉన్న ఆలయం 14వ శతాబ్దిలో చోళులు మార్పులు చేర్పులతో నిర్మించినట్లు తెలుస్తోంది.

అష్టోత్తర శత (108) దివ్య తిరుపతులలో కంచి ఒకటి. శ్రీమన్నారాయణుడు లోక కల్యాణార్థమై పర – విభవ – వ్యూహ – అంతర్యామ – అర్చావతార ములను అయిదు స్థానములలో నివాసముంటాడు. ఇందులో మొదటి 4 స్థానములను దేవతలు, ఋషులు, యోగులు వంటివారు మాత్రమే దర్శించగలరు. సామాన్య జనులనుద్ధరించి తరింపచేయుటకు శ్రీమన్నారాయణుడు అనేక క్షేత్రాలలో అర్చారూపంలో (విగ్రహ రూపం) వెలసి అనుగ్రహిస్తూ ఉంటాడు. అట్లు అర్చారూపాన్ని దాల్చిన క్షేత్రాలను శ్రీవైష్ణవ వాఙ్మయంలో దివ్యతిరుపతులుగా (దివ్యదేశములుగా) వర్ణింపబడినవి. ఆళ్వారులు తమ పాశురాలలో ఆయా క్షేత్రస్వాములను కీర్తించారు. ఇట్టి దివ్య తిరుపతులు 108 ఉన్నాయి. అందులో కంచి ఒకటి. ఇంకొక విశేష మేమంటే అష్టభుజం, తిరుత్తణ్ణి, పాడగం, నీరగం, ఊరగం, కారగం, కార్వానం, పవళవణ్ణం, పరమేశ్వర విణ్ణగం వంటి పలు దివ్య తిరుపతి క్షేత్రాలు కంచిలోనే నెలకొని ఉన్నాయి. వరదరాజస్వామి సన్నిధి చేత ఇది పవిత్ర వైష్ణవ క్షేత్రంగానూ ప్రసిద్ధి చెందింది. స్వామి వరదరాజ పెరుమాళ్, పేరుందేవి అమ్మవారి సమేతంగా పశ్చిమాభి ముఖుడై వెలసి యున్నారు. బ్రహ్మోత్సవాలలో గరుడసేవ అతి వైభవంగా జరుగుతుంది.

ఈ క్షేత్రమునందు ఏకామ్రేశ్వరుడు పృథ్వీ లింగ రూపంలో ఉంటాడు. పంచభూత క్షేత్రాలలో కంచి ఒకటి. మిగిలినవి – తిరుచురాపల్లిలో జలలింగం, తిరువణ్ణామలైలో అగ్ని లింగం, చిదంబరంలో ఆకాశలింగం, కాళహస్తిలో వాయులింగంగా వెలసి యున్నవి. కంచికి పశ్చిమదిశలో సర్వతీర్థం అనే సరస్సు ఒకటి ఉన్నది. ఇందు సర్వ తీర్థాలు సంగమించి, సార్థకమైన పేరు కలిగి ఉన్నది. ఈ తీర్థాన్ని రామలక్ష్మణ, ప్రహ్లాద, విభీషణాది పురాణపురుషులు సేవించుకున్నట్లు కాంచీ మహత్యం తెలుపుతోంది.

**పట్టు పరిశ్రమ:** పట్టుచీర కట్టని పడతులుండరు గదా. ఆ పట్టుపరిశ్రమకూ కేంద్రం కంచి. నాటి ప్రభువులు సాహిత్య శిల్పకళలనే కాదు పట్టుపరిశ్రమనూ ఆదరించారు. రాజరాజు చోళుడు గుజరాత్ నుంచి నేతపని వారిని రప్పించాడని, శ్రీకృష్ణ దేవరాయల కాలంలో ఆంధ్రదేశం నుంచి వచ్చారని భిన్న కథనాలున్నాయి వీరి గురించి. ప్రస్తుతం ఈ పరిశ్రమ స్థితిగతులు శోచనీయంగా ఉన్నాయి.

**కామకోటి పీఠం:** కాంచీపురము వలెనే కంచికామకోటి పీఠము కూడా ప్రాచీనమైనది. ఈ విషయము శివరహస్యము, మార్కండేయపురాణము వంటి ప్రసిద్ధ గ్రంథములలో ప్రసక్తమై యున్నది. కామాక్షీ ఏకామ్రనాథుల దివ్య సన్నిధిలో శ్రీ శంకర భగవత్పాదులచే కంచికామకోటి పీఠం స్థాపించబడి, అవిచ్ఛిన్న గురుపరంపరతో ఆర్షధర్మ, అద్వైత తత్త్వ, వేదవిద్యా ప్రచారాలతో అగ్రగామి కేంద్రంగా నేటికీ కొనసాగుతోంది. ఈ పీఠానికి ప్రథమాచార్యులు శ్రీ శంకరభగత్పాదులే అని వాడుక. శ్రీ శంకరులు కంచిమఠము నందే విదేహముక్తులై నట్లునూ, కామాక్షి ఆలయప్రాంగణములో శంకరుల విగ్రహమున్న చోటే శంకరుల సమాధిస్థలమని జనశృతి. ఇంతవరకు 70 మంది ఆచార్యులు ఈ పీఠమునలంకరించిరి. పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి తరువాత శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి, శ్రీ శంకరవిజయేంద్ర సరస్వతి స్వామి ప్రస్తుత పీఠాధిపతులుగా వ్యవహరించుచున్నారు.

# 2. శ్రీ శంకరభగవత్పాదులు



శ్రీ శంకర భగవత్పాదులు భారత దేశంలో అవతరించిన తత్త్వవేత్తలలో అగ్రగణ్యులు, దార్శనికులలో కైలాస శిఖర సన్నిభులు. భారతీయ తత్త్వ జిజ్ఞాసా పరిణతకు దర్పణం శంకరుల రచనలు. పరమేశ్వరుడు మానవ జాతికి జ్ఞాన భిక్ష పెట్టుటకై కృతయుగమున దక్షిణామూర్తి రూపమున, ద్వాపర యుగమున వేదవ్యాస రూపమున, కలియుగమున శ్రీ శంకర భగవత్పాద రూపమున అవతరించెనని భారతీయుల విశ్వాసము. శంకరులు ఎనిమిదవ యేటికే వేదాధ్యయనంపూర్తి చేశారు. పదహారు సంవత్సరాలు వచ్చు నప్పటికే గొప్ప తత్త్వ వేత్తగా ఆచార్యునిగా ప్రసిద్ధి పొందేరు. ఆ నాడు దేశ ప్రజలలో అధర్మం పెరిగిపోయింది. వేదవిహిత కర్మాచరణం కనుమరగు కాజొచ్చినది. బౌద్ధుల వేదవిరుద్ధ సిద్ధాంత ప్రచారము ప్రచండంగా సాగుతోంది. శాక్తేయుల వామాచారము, జంతు బలులుమితిమీరినవి. ఐహిక సుఖములే ముఖ్యమను చార్వాకుల ప్రచారం ప్రజలను తప్పు దోవ పట్టిస్తున్నాయి. సౌర, అగ్ని, హిరణ్య గర్భ, వీరశైవ, శూన్య మతము వంటి 72 మతములు బయలు దేరి అవైదిక ఆచారాలను వ్యాప్తి చేస్తున్నాయి. మొత్తము మీద సంఘమంతా నీతి బాహ్యమై అల్లకల్లోలంగా ఉంది. భౌగోళికముగా కూడా దేశం చిన్న చిన్న రాజ్యాలుగా విడి పోయి ఛిన్నా భిన్నమయ్యే దశకు చేరుకుంటోంది. అటు రాజ్య విస్తరణ ఆధిపత్యముల కొరకు యుద్ధాలు జరుగు చున్నట్లే, మా మతము గొప్పదంటే మా మతము గొప్పదని తాత్త్విక ఆధిపత్యము కొరకు కూడా నిరంతర పోరాటం జరుగుతున్నది. దేశ సంక్షేమ, సమైక్యతలు సాధించుటకు, ప్రజానీకమును ఏకోన్ముఖులు గావించ గల శక్తి ఒక్క అద్వైతానికే ఉన్నదని భావించారు శంకరులు. సనాతన ధర్మము సమాజమున సుప్రతిష్ఠిత మగుటయే పరమ లక్ష్యమైనది. అద్వైత ప్రచారం, ఆర్ష సంస్కృతీ పరిరక్షణ భారతీయ జీవన ప్రవంతిలో కలకాలం కొనసాగాలని సంకల్పించి, నాలుగు మఠామ్నాయ పీఠాలను శృంగేరి, ద్వారక, పూరీ, బదరీ క్షేత్రాలలో స్థాపించారు. పాశ్చాత్య పాలనానంతరమే రాజకీయ, సాంస్కృతిక, సామాజిక ఐక్యత సంభవించినదనుకొనుట ఒక అపప్రద అని నిరూపించుటకా అన్నట్లు 8వ శతాబ్దముననే భారత దేశమున ధార్మిక సాంస్కృతిక ఐక్యతను పునరుద్ధరించారు. ఉత్తరాది మహిష్మతీ నగర విద్వాంసుడగు సురేశ్వరులు దక్షిణాది శృంగేరి మఠ ఆచార్యుడైనాడు. దక్షిణాది బ్రాహ్మణోత్తముడగు తోటకాచార్యుడు ఉత్తరాది జ్యోతిర్పీఠాధి పతిగా నియుక్తుడైనాడు. కేరళ నంబూద్రి బ్రాహ్మణులు బదరిలో పూజారులుగా, కర్ణాటక దేశీయులు నేపాల్‌లోను, మహారాష్ట్ర విప్రులు రామేశ్వరంలోను

అర్చకులుగా ఉండవలెనని నియమం చేశారు. ఇంత కన్న మహోదాత్తమైన జాతీయ సమైక్యతా సంఘటన మరొకటి కలదా అని ఆశ్చర్యం కలుగుతుంది.

వేద ధర్మం నేటికీ నిలచి ఉన్నదంటే దానికి కారణం శంకరుల కృషియే. ఆర్ష ధర్మాన్ని వ్యతిరేకించే శక్తులు వక్రీకరించే శక్తులు ఆనాడు కూడా ప్రబలంగా ఉన్నాయి. శ్రీ శంకరులు ఒక్క చేతి మీదుగా ఆ శక్తులను ఎదుర్కొని వేద ధర్మాన్ని అద్వైత సిద్ధాంతాన్ని పునః ప్రతిష్టించారు. దీనికి వారుపయోగించిన సాధనం కేవలం జ్ఞాన మార్గమే! అంతకు పూర్వం రామ కృష్ణాది అవతారములలో ధర్మానికి భౌతిక అవరోధములే ఎక్కువగా ఉన్నందున క్షాత్రధర్మమే పనికి వచ్చింది. కాని కలియుగంలో ధర్మచ్యుతి మానసికమైన, ఆంతరంగికమైన అవరోధాల వల్ల యేర్పడింది. అందువల్ల వీటి నిర్మూలనకు జ్ఞాన ఖడ్గాన్ని ఉపయోగించ వలసి వచ్చింది. తదనుగుణం గానే వేదవేదాంగ వేత్తలైన సద్బ్రాహ్మణ వంశంలో జన్మించటం సంభవించింది. మతసహనం మృగ్యమై, వేదధర్మాన్ని భ్రష్టు పట్టించి, కులమతవ్యాప్తికి దోహదం చేసిన దురాక్రమణలను ఎదిరించి నిలచి ఈనాటి స్థితిలో ఆర్ష ధర్మం విలసిల్లుతోందంటే – అది శంకరుల భిక్షయే నని చెప్పవచ్చును. ప్రపంచ ఆధ్యాత్మిక చరిత్రలో శంకరుల ధార్మిక విజయాలు అత్యంత విలక్షణమైనవి. భారతదేశమంతటా విజయయాత్రలు సలిపి, వైదిక ధర్మాన్ని, అద్వైత సిద్ధాంత వైశిష్ట్యాన్ని ప్రపంచానికి చాటేరు. దండి భట్ట భాస్కరుడు, అభినవగుప్తుడు, మురారి, ఉదయనాచార్యుడు, కుమారిల భట్టు, మండనమిశ్రుడు వంటి ఉద్దండ పండితులను తన వాద పటిమతో ఎదుర్కొని, అద్వైత మార్గాన్ని అనుసరింపచేశారు శంకరులు.

బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు అసదృశమైన వ్యాఖ్యానాలు రచించారు. తర్క వేదాంతాలలో జ్ఞానానికి శంకరుల భాష్యాలు, భక్తిప్రపత్తులు, ఆచరణ జ్ఞానము పెంపొందించుకోవటానికి వివేకచూడామణి, ఆత్మ బోధ, అపరోక్షానుభూతి, ఆత్మానాత్మ వివేకం, ఉపదేశసాహస్రి వంటి శంకరుల ప్రకరణ గ్రంథాలు అధ్యయనం చెయ్యాలని అంటారు. తాను నమ్మిన అద్వైత సిద్ధాంతం పట్ల సమగ్ర అవగాహన మాత్రమే కాదు సంపూర్ణముగా అనుభూతి చెందిన పరిణత వారిది. అందుచేతనే శంకరుల రచనలలో ఎక్కడా వైరుధ్యం గాని అసహజత గాని అస్పష్టత గాని గోచరించదు.

**“అల్పాక్షర మస్టందిగ్ధం సారవద్విశ్వతోముఖం**
**అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదోవిదుః”**

అన్న శ్లోకానికి భాష్యం అనదగ్గవి శ్రీ శంకరుల రచనలు.

32 సంవత్సరాలు మాత్రమే జీవించిన అల్పాయుష్కులు శ్రీ శంకరులు. అయితేనేం శతాయుష్కులు అనేక మంది చేయదగు మహత్కార్యాలు చేసి మార్గ దర్శనం చేసిన

మహనీయులు. సర్వ జనులకు ఉపయోగ పడునట్లు వారి వారి యోగ్యతానుసారము ఆచరింప వీలగు సర్వ సాధనా మార్గములను వివిధ గ్రంథముల ద్వారా విశద పరచారు. అత్యల్ప జీవిత కాలంలో వారు 24 భాష్య గ్రంథాలు, 85 ప్రకరణ గ్రంథాలు, 91 స్తోత్ర గ్రంథాలు రచించారు. ఈ బృహత్ గ్రంథ రాసికి తోడు శిష్యులకు శిక్షణ, అన్యమత, అన్య సిద్ధాంత కర్తలతో శాస్త్ర వాదములు, చతురామ్నాయ మఠ స్థాపనం వంటి బృహత్కార్య భారాన్ని నిర్వహించిన ప్రజ్ఞాధురీణులు శంకరులు.

"ఏకం సత్ విప్రా బహుధావదంతి" అని నమ్మిన ఆచార్యులు ప్రధానంగా ప్రజలలో మత ఐక్యతకు, ధర్మాచరణకు పాటుపడ్డారు గాని ఒకే మతం ఉండాలని అనలేదు. అందు వల్లనే పంచాయతన పూజాది ఆరాధనా విధానములను ప్రవేశపెట్టేరు. సర్వ దేవతారాధనలను సవరించి, సమన్వయ పరచి షణ్మత స్థాపనాచార్యులుగా ప్రసిద్ధి చెందేరు. పాదచారులై భారతావని నంతనూ ముమ్మారు సంచరించి – పరివ్రాజకులై, ప్రవక్తలై, సంఘ సంస్కర్తలై, కవీశ్వరులై ఆర్షధర్మ వైభవానికి పునర్జన్మ నిచ్చిన కారణ జన్ములు. వారి కృషి, వారి ఉపదేశాలు, ప్రతి క్షణం ప్రతిదినం స్మరించ దగినవి.



# 3. పరమాచార్యులు

**రక్తాంత స్పృహణీయ దీర్ఘనయనం స్వాకుంచిత భ్రూతలం**
**హస స్మేర ముదార ఫాల ఫలకం స్ఫూర్జత్కపోలారుణం**
**శ్రీ కర్ణం మననం సుచారు రదనం పూర్ణేందు బింబాననమ్**
**వందే శ్రీగురుమూర్తి మిందుమకుటం శ్రీకామ పీఠాధిపమ్.**



స్వస్తి శ్రీ జయనామ సంవత్సర వైశాఖ బహుళ పాడ్యమి ఆదివారం (20-5-1894) ఒక శుభదినం. ఆ శుభదినానికో ప్రత్యేకత ఉన్నది. తమిళనాడు దక్షిణ ఆర్కాట్ జిల్లా విల్లుపురంలో నివాసముంటున్న శ్రీమహాలక్ష్మి, సుబ్రహ్మణ్యశాస్త్రి దంపతులకు ద్వితీయ పుత్ర జననం అయిన రోజు అది. స్వామిమలైలో వేంచేసియున్న స్వామినాథుడు వీరి యిలవేల్పు. ఆ పేరే పెట్టుకున్నారు ఈ పుత్రునికి. స్వామినాథన్ పితామహులు శ్రీ గణపతిశాస్త్రి గారు, మాతామహులు శ్రీ నాగేశ్వరశాస్త్రి గారు ఇరువురూ ఋగ్వేదాధ్యయన పరులు. తండ్రి విద్యాశాఖలో ఉద్యోగి.

పదమూడవ శతాబ్దంలో చోళరాజుల సహాయార్థం కర్ణాటక హోయసల రాజులు తమిళదేశానికి వలస వచ్చారు. వీరితోపాటు హోయసల బ్రాహ్మణ కుటుంబాలు 16 వ శతాబ్దం ప్రథమార్ధంలో వలస వచ్చి తమిళదేశంలో స్థిరపడ్డాయి. ఈ విధంగా వలస వచ్చిన వారిలో శ్రీ గణపతిశాస్త్రి గారొకరు. వీరు ఋగ్వేదీయ స్మార్త బ్రాహ్మణులు. సాంగఋగ్వేదాధ్యయన పరులు. కంచి పీఠానికి 64 వ ఆచార్యులైన శ్రీ చంద్రశేఖరుల కాలంలో కంచి కామకోటి మఠ సర్వాధికారిగా పని చేశారు. వీరి పెద్ద కుమారుడు సుబ్రహ్మణ్యశాస్త్రి వీరి భార్య మహాలక్ష్మి. వీరు మద్రాసుకి 100 మైళ్ళ దూరంలో గల విల్లుపురంలో నివాసముండేవారు. ఉద్యోగరీత్యా తండ్రికి చిదంబరం బదిలీ అయింది. అక్కడే స్వామినాథాన్ని 1వ తరగతిలో చేర్చారు. ఒకనాడు పాఠశాల తనిఖీకి వచ్చిన ఇన్స్పెక్టర్ ఈ బాలుని ప్రతిభా పాటవాలు గమనించి 3వ తరగతికి పంపమని సిఫారసు చేశాడు.

**గిని :** తల్లిదండ్రులు ఎంతో అపురూపంగా చూసుకోసాగేరు స్వామినాథన్ని. దీనికి రెండు కారణాలున్నాయి. ఒకటి ప్రథమ సంతానం తరువాత ఇక బిడ్డలు కలగరేమో అనుకున్న తరుణంలో 9సం. ల తర్వాత పుట్టినవాడు కావటం. రెండవది - చక్కని నడవడి, చురుకుదనం, విద్యార్జనలో ఆసక్తి, క్రమశిక్షణ చూపిన బుద్ధిశాలి కావటం. ఇటు వంటి సుగుణాలు చూసి అమితానందం చెందేరు. పంచవన్నెల రామచిలుకను

కన్నడంలో గిని అంటారు. రామ చిలుకకు అనేక రంగులున్నట్లే, ఈ పిల్లవానికి అనేక సుగుణాలున్నయనో ఏమో 'గిని' అని ముద్దు పేరుతో పిలుచుకునేవారు.

కొడుకు పెద్ద ఆఫీసరు కావాలని ఆశించాడు తండ్రి. కాని దైవ నిర్ణయం మరొకలా ఉంది. 1905లో స్వామినాథన్‌కి ఉపనయనం జరిగింది. ఆ సమయంలో దక్షిణ ఆర్కాట్ జిల్లాలో పర్యటిస్తున్న కామకోటి పీఠ 66వ ఆచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతిస్వామి వారి ఆశీస్సులు లభించాయి వటువుకి. ఆ మరుసటి సంవత్సరం గిని చాతుర్మాస్యం చేస్తున్న గురువుల దర్శనం చేసుకున్నాడు తండ్రితోపాటు. ఆ కాలంలోనే తన తర్వాత ఈ బాలుడు పీఠాధిపత్యం వహిస్తే బాగుండును అని అనుకున్నారు గురువర్యులు. 1907 ఫిబ్రవరి 13 నాడు స్వామినాథన్‌కి సన్యాసదీక్ష ఇవ్వబడింది. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి అన్న యోగపట్ట నామం తో 68వ ఆచార్యులుగా కంచికామకోటి పీఠాధిపతులయ్యారు. అనంతరం 2 సంవత్సరాల పాటు కుంభకోణం, తిండివనం, జంబుకేశ్వరం, తంజావూరు మున్నగు ప్రాంతాలు పర్యటించి విజయయాత్ర చేశారు. ఆ రోజుల్లో మఠం కంచిలో కాక కుంభకోణంలో ఉండేది. 1911-14 మధ్య కాలంలో కావేరీ నదీతీరాన గల మహేంద్రమంగళంలో వేద శాస్త్రాధ్యయనం చేశారు. వివిధ బాధ్యతలతో కూడుకున్న మఠాధిపత్యం నిర్వహించటానికవసరమైన సర్వ శాస్త్ర పరిజ్ఞానాన్ని సముపార్జించారు. శ్రీ చరణులు మేజరు కానందున 1915 వరకు మఠవ్యవహారాలు కోర్టాఫ్ వార్డ్స్ పర్యవేక్షణలో సాగుతూ ఉండేవి.

21 సంవత్సరాలు నిండిన స్వామి 1915 మే నెలలో శంకర జయంతి పుణ్యదినాన మఠ పరిపాలనా బాధ్యతలు స్వీకరించారు. ఆ నాటి నుండి మఠానికి స్వర్ణ యుగం ప్రారంభమయ్యిందని చెపుతారు. స్వామి వారు పీఠాధిపతులైన తర్వాత ఆర్షధర్మ రక్షణకు, వేదోద్ధరణకు, ప్రజలలో ఆస్థిక్య భావ వ్యాప్తికి, పండిత సన్మానాలకు ఎన్నో ప్రణాళికలు చేపట్టేరు. గురుకుల పద్ధతిలో వేదాధ్యయనం వారి అభిమాన విషయం. ఎన్నో గురుకుల సంస్థలు ఏర్పాటు చేసి, ఆర్థికంగా లోటు లేకుండా చూసేవారు. 17 భాషలలో నిష్ణాతులైన శ్రీ చరణులు నిగర్వులు, నిర్మలాంతః కరణులు, నిష్ఠాగరిష్ఠులు. అయా భాషలలో ఎంతో సునాయాసంగా మనోహరంగా అది తమ మాతృభాషే అన్నంత మృదు మధురంగా సంభాషించే వారు. తేజస్సుతో తొణికిస లాడే ముఖ వర్చస్సు, ప్రశాంతత నిండిన నయన శోభ, పెదవులపై మెరిసే మందహాసం కరుణార్ద్ర హృదయం, వాగ్వైభవం భక్తులను ఇట్టే ఆకట్టుకునేవి. మనసు మల్లె పువ్వు వలె సున్నితం సుకుమారం. నియమ పాలనలో పాషాణ సదృశ కాఠిన్యం. 90 యేళ్ళు పైబడినా వారి జ్ఞాపక శక్తి అద్భుతం ఆశ్చర్యకరం !

**ఆసేతు హిమాచల యాత్ర :**

1919లో ఆరంభమై 20 సంవత్సరాలపాటు సాగినదీ సుదీర్ఘ విజయయాత్ర. అఖిలభారత ఆస్తిక జనులకు శ్రీవారి దర్శనం, ఆశీస్సులు లభించాయి. ఇంత సుదూర, సుదీర్ఘ యాత్రలో శ్రీ వారు ఆధునిక ప్రయాణ సాధనాలు వేటినీ వినియోగించక పోవటం విశేషం. ఎక్కువగా పాదచారులై పర్యటన సాగించారు. మరీ అవసరమనిపిస్తే పల్లకి అనుమతించేవారు.

ప్రతి నిత్యం త్రికాల పీఠదేవతార్చనం, అనుష్ఠానాలు, భక్తులతో సంభాషణలు, మఠవ్యవహారాలతో గడిచిపోయి, శ్రీచరణుల విశ్రాంతికి 2-3 గంటలు మాత్రమే మిగిలేది. యాత్రలో ఎందరో వేదవేత్తలు, పండిత ప్రకాండులు, మేధావులు, నాయకులు శ్రీవారిని దర్శించుకుని ధన్యులయ్యేరు. అట్టివారిలో – మోక్ష గుండం విశ్వేశ్వరయ్య, సి.ఆర్.దాస్, సి.రాజగోపాలాచారి, జమునాలాల్ బజాజ్, వంటి జాతీయనాయకులు, మదన మోహనమాలవ్యా, వినోబాభావే ప్రభృతులు, వివిధ మతాలవారు, మహరాజులు, జమిందార్లు, దేశవిదేశ ప్రభుత్వాధికారులు, స్వామివారి పల్లకి మోసిన ముస్లిం సోదరులు, సంస్కృతంలో శ్లోకాలు రాసి సమర్పించిన ముస్లిం భక్తులు ఇలా ఎందరో ఉన్నారు. 1927 ఉత్తరార్థంలో గాంధీమహాత్ముడు దక్షిణ భారతంలో పర్యటిస్తున్నారు. స్వామి వారిని తప్పక కలుసుకోవాలనే కోరికతో ఉన్నారు. పాల్ ఘాట్ సమీపంలోని 'నల్లిచెరి' లో వారిద్దరి సమావేశం జరిగింది. శ్రీవారు సంస్కృతం లోను, గాంధీగారు హిందీ లోను సంభాషించారట. సాయంకాలం 5.30 అయినది. గాంధీగారి సాయంకాల భోజనానికి కాలాతీతమవుతున్నదని రాజగోపాలాచారి గారు వెళ్ళి జ్ఞాపకం చేశారు. "ఆచార్యులతో నేను జరుపుచున్న సంభాషణమే నాకు ఈ సాయంకాలపు భోజనం" అన్నారట గాంధీజీ.

ఈయాత్ర సందర్భంలోనే ప్రముఖ రచయిత, ఆధ్యాత్మిక అన్వేషకుడు పాల్ బ్రంటన్ శ్రీ చరణులను దర్శించటం జరిగింది. బ్రంటన్ కె.ఎస్.రమణి అను రచయిత సహాయమున చెంగల్పట్టులో స్వామి దర్శనము చేసుకొనెను. ప్రథమ దర్శనములోనే ఒక దివ్యానుభూతికి లోనైనాడు. ప్రపంచ రాజకీయ ఆర్థిక పరిస్థితులు, యుద్ధ కారణములు మున్నగు విషయములపై స్వామి అభిప్రాయములు తెలుసుకొనెను. చివరకు తాను దేనిని అన్వేషించుచు భారత దేశమునకు వచ్చినది తెలిపి తనకు తాత్త్విక గురువుగా ఎవరినైన సూచింతురా లేక స్వయముగా తమరే మార్గదర్శకులుగా నుండు అవకాశమున్నదా యని విన్నవించెను. అంతట స్వామి – కామకోటి పీఠమను ప్రజా సంస్థకు అధిపతిగా నున్నవాడను. క్షణమైన తీరక లేని జీవనము నాది. నా కార్యక్రమములకే కాలము సరిపోవుటలేదు. ఈ పరిస్థితులలో స్వయముగ శిష్య శిక్షణ చేయజాలను, అని చెప్పి నీ ఆధ్యాత్మిక సాధనలో దారి చూపగలవారు రమణమహర్షులు. వారేనీకు తగిన గురువు. వారిని తప్పక దర్శించ వలసినదిగా సూచించారు. మహర్షి దర్శనము చేయకుండా దక్షణ భారతదేశము విడచి పోవద్దని చెప్పారు. తర్వాత బ్రంటన్

మద్రాసు తన బసకు చేరుకున్నాడు. ఆ రాత్రి స్వామి అతని కలలో కనపడి వినయవతుడవై ఉండుము. నీ అన్వేషణ ఫలించును అని చెప్పి అదృశ్యమైనారు. అలాగే స్వామి వారి కాశీ సందర్శనం ఆ పట్టణ చరిత్రలో ఒక గొప్ప సంఘటనగా నిలచింది. తర్వాత పాట్నా, గయ, కలకత్తా, మిద్నపూర్, టాటానగర్, ఒరిస్సా, ఆంధ్రదేశం మీదుగా తమిళనాడు చేరి 1939 జూలై 29న కుంభకోణం చేరుకున్నారు. ఆనాడు కుంభకోణం పురజనుల ఆనందోత్సాహాలకు అంతులేదు. 1944 ఫిబ్రవరి 7న కామాక్షి అమ్మవారి ఆలయ కుంభాభిషేకం జరిగింది శ్రీ చరణుల చేతులమీదుగా, 104 సం.ల అనంతరం మరలా ఈ కుంభాభిషేకం జరగటం గమనార్హం. 1959లో మైలాపూర్ సంస్కృత కళాశాలలో జరిగిన సభలో స్వామి వారికి 14 భాషలలో సన్మాన పత్రాలు సమర్పించిన అపూర్వ సంఘటన చోటు చేసుకుంది.

84 యేండ్ల వయసులో స్వామి 6 సం.ల పాటు తమిళనాడు, ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్రలలో పర్యటించారు. భక్తజన వాత్సల్యంతో 1000 దినాలు 3860 కి.మీ. కాలినడకన, సంచరించి విజయ యాత్ర సలిపిన ఆచార్యులు “నడయాడే దేవం” కాక మరెవరు ? మహాస్వామి వారి యాత్ర రోజుకి 10 నుంచి 20 కి.మీ. సాగేది. దారిలో కనిపించిన ఏ చెరువుగట్టునో ఆలయం వద్దనో మజిలీ. ఊరివారికి తెలిసి తండోపతండాలుగా వచ్చి దర్శనం చేసుకునేవారు. ఆహార పదార్థాలు ఇతర అవసర సామగ్రి తెచ్చి ఇచ్చేవారు. రేపటి మజిలీ ఎక్కడో తెలిసేదికాదు. మిగిలిపోయిన సంభారాలు ఆ ఊరి ఆలయానికో, పేదలకో ఇచ్చేసేవారు. రేపటి అవసరానికి యేదీ ఉంచుకోరాదు. అది నియమం.

ఎందరెందరో విదేశీయులు స్వామి దర్శనం చేసుకొని సందేహ నివృత్తి అయి, సఫలమనోరథులై వెళుతూ ఉండేవారు. అట్టి వారిలో స్పెయిన్ రాజమాత ఫ్రెడరికా, రాకుమారి వెరీజా, థాయ్ లాండ్ రాజగురువు నామ్‌దేవ్‌ముని, ప్రఖ్యాత రచయిత ఆర్థర్ కోయిస్లర్. అర్జెంటినా దేశస్తురాలు యూగినా బోర్లిన్, నేపాలు రాజ దంపతులు ఉన్నారు. పాల్ బ్రంటన్ ఉదంతం ఇది వరకే చెప్పుకున్నాం గద.

పరమాచార్యుల పావన స్పర్శతో, ఆధ్యాత్మిక శక్తి సంపన్నతతో, లౌకిక వ్యవహార దక్షతతో 7 దశాబ్దాలు వైభవోపేతంగా వెలిగిపోయింది కంచి పీఠం. 1984 మే నెల నుండి సంచారం మాని కంచిలోనే ఉండి పోయారు స్వామి. 1993, అక్టోబరు మధ్య కాలం నుండి స్వామి జలుబు, దగ్గు దానివల్ల శ్వాస సంబంధమైన ఇబ్బందితో బాధ పడసాగేరు. స్థానికంగా మఠంలోనే ఉన్న వైద్యులు, అడపాదడపా మద్రాసు నుండి వచ్చే వైద్యులు స్వామి వారిని పరీక్షించేవారు. నీరసం, వృద్ధాప్య లక్షణాలు తప్ప మరేదీ లేదని నిర్ధారణకొచ్చేవారు.

ఒకనాడు మద్రాసు వెళ్ళివస్తామన్న ఉత్తరాధికారికి, వారి పరివారానికి చేతి సంజ్ఞతో అనుమతి దయచేశారు. మిగిలిన పరివారం భోజనానికి వెళ్ళారు. వారితో పాటు

మఠంలోనే ఉన్న డా.భాస్కర్, వారి సహాయకులు కూడా భోజనానికి వెళ్ళేరు. ఇక మిగిలింది ఒకేఒక పరిచారకుడు. అతడిని నీళ్ళు తెమ్మని పంపారు. తిరిగి వచ్చి చూసేసరికి స్వామి లేరు. ఎవరూ లేని యేకాంతంలో 1994 జనవరి 8 మధ్యాహ్నం 2.58 ని.లకు మోక్షపురి అయిన కంచిలో బ్రాహ్మీభూతులయ్యారు స్వామి. అవాక్యయిన కాలపురుషుడు అచేతనుడయ్యారు. సర్వప్రకృతి చింతాజడమై నిలిచి పోయింది. కాలం స్థంభించింది. సరిగ్గా 2-58 ని॥లకు స్వామి గదిలోని గోడ గడియారం ఆగిపోయింది. మరితిరగలేదు.

ఆ రోజు ఉదయం తల్లి మహలక్ష్మమ్మ గారి జన్మస్థలమైన ఇచ్చంగుడి లోని వేదపాఠశాలలో పెట్టాలని సిద్ధం చేసిన ఆమె చిత్రపటం శ్రీ చరణుల వద్ద ఉంచేరు. వారు ఆ పటాన్ని ప్రేమానురాగాలతో స్పర్శిస్తూ చాలాసేపు ఉండి పోయారు. ఉదయం 10 గంటల ప్రాంతంలో హటాత్తుగా కనులు తెరచి కలవై వైపు తిరిగి నమస్కరించి, కలవై అని తనలోతాను అనుకున్నారు. కలవైలో గురువుల, పరమగురువుల అధిష్టానాలున్నాయి. స్వామి వారు ప్రతిదినం సంధ్యావందనాది అనుష్ఠానాలు పూర్తయిన పిదప కలవై వైపు తిరిగి నమస్కరించటం అలవాటు. ఈ విధంగా మాతృ మూర్తిని, గురుదేవులను స్మరించుకున్నా రేమో ఆఖరుసారిగా. స్వామి వారు దర్శనం ఇచ్చేచోట ఒక ఆసనంపై స్వామి పార్థివశరీరం ఉంచేరు. వేలాది మంది భక్తులు అశ్రుతప్త నయనాలతో అంతిమ దర్శనం చేసుకున్నారు.

ఈ జగత్తే, ఈ ప్రపంచ మే తన గురువని, దాని నుంచి తానెంతో నెర్చుకుంటూ ఉంటానని ఈ జగద్గురువు చెప్పేవారు! సనాతన ఋషిపరంపరకు చెందిన ఆధునిక ఋషి, యుగపురుషులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతులు. విశ్వజనీనతో కూడిన వారి సందేశాలు మానవాళికి మార్గ దర్శనం చేసే కరదీపికలు. ఆర్ష విజ్ఞాన జ్యోతి, బ్రాహ్మీమయ మూర్తి, సాక్షాత్ దక్షిణామూర్తి స్వరూపులు, పరతత్త్వ ప్రకాశ జ్యోతి - పరమా చార్యులు.

**కాంచీ కాంచన ఘంటికా చయనదత్ కారుణ్య పాథోధియౌ**
**కాంచీపట్టణ నాయికా మణికి శ్రీ కామాక్షికిం గూర్చు మా**
**కంచిస్వాముల గాంచి హైందవమత గ్లానిన్ నివారించు తత్**
**ప్రాంచద్భూషణ దివ్య శక్తికిని సాష్టాంగంబుగా మ్రొక్కెదన్.**

❧ ❧ ❧

ఈ విధంగా పురాణ ప్రసిద్ధము, చారిత్రిక ప్రాముఖ్యము గల పవిత్ర కాంచీపట్టణం అందు వెలసిన తల్లి కామాక్షి, కామకోటి పీఠం, నడయాడిన పురాణపురుషులు, ఋషివరులు, యతిశ్రేష్ఠులు, పాలించిన మహారాజులు, పండిత, కవి, గాయక ప్రముఖులు, శిల్ప, నృత్యాది లలిత కళా ఉపాసకులు, పోషకులు, భక్తాగ్ర గణ్యులు.... యిలా ఈ విశేషాలు ఎప్పుడూ సశేషాలే!

కథలన్నీ కంచికి చేరుతాయో లేదో చెప్పలేం గాని, కంచి కథ మాత్రం భక్త హృదయాలను చేరి ముక్తి ప్రదమౌ తుందనటం అతిశయోక్తి కాదు.

ఇతి శివం

*****

**ఆధార గ్రంథాలు :-**

ఈ వ్యాస రచనకు ఎన్నో గ్రంథాలు పరిశీలించటం జరిగింది. అందులో నీలంరాజు వెంకటశేషయ్య గారి 'నడిచే దేవుడు', రావినూతల శ్రీరాములు గారి 'కంచిపరమాచార్య', చల్లా విశ్వనాథశాస్త్రి గారి 'ధర్మాకృతి', మదురుమాటి వేంకటరమణ శర్మ గారి 'జగద్గురు దివ్య చరిత్ర', పి.వి.ఎల్. నరసింహ రావు గారి 'నగరేషుకంచి' మరియు 'దేవర కొండ శేషగిరిరావు గారి రచనలు పేర్కొనదగినవి ఇవిగాక ఋషిపీఠం వంటి ఆధ్యాత్మిక పత్రికలు, కామకోటి పరమాచార్య మెమోరియల్ ట్రస్ట్, హైదరాబాదు వారి ప్రత్యేక సంచిక - శ్రీ శైలంలో శ్రీ కాంచి శంకరులు, ఇంటర్నెట్‌లో లభించిన సమాచారం కూడా ఉపయోగపడినది. చెట్టుకో పుష్పం సేకరించి మాల అల్లి నట్లుగా సాగిన రచన నా కర్తృత్వం నామ మాత్రమే అని మనవి చేస్తూ ఆయా రచయితలందరికి కృతజ్ఞతాంజలి సమర్పిస్తున్నాను.

ఈ వ్యాస రచనకు బీజం వేసి, ప్రోత్సహించిన ఆప్తమిత్రులు, పరమాచార్య భక్తులు శ్రీ చల్లపల్లి వెంకట రత్నప్రసాద్ గారికి తల్లి కామాక్షి ఆయురారోగ్య ఐశ్వర్యములనేగాక, ఆధ్యాత్మికోన్నతిని ప్రసాదించుగాక.

**- ప్రసాదవర్మ కామఋషి**



**రచయిత పరిచయం**

వృత్తిరీత్యా రైల్వే వైద్యవిభాగంలో ఫార్మసీ చీఫ్‌గా పదవీవిరమణ పొందిన వీరు, ప్రవృత్తిరీత్యా సాహితీ పిపాసకులు. కవి, రచయిత, విమర్శకుడిగా గత పాతికేళ్లుగా, దాదాపు అన్ని తెలుగు పత్రికలలో ఆధ్యాత్మిక, సాహిత్య వ్యాసాలు, సమీక్షలు, కవితలు, కథలు వ్రాసి ప్రచురించారు. శృంగేరి జగద్గురు శ్రీ భారతీ తీర్థ మహాస్వామి వీరి దీక్షా గురువు.

# శ్రీ శంకరభగవత్ పూజ్య పాద పూజా విధానము



"ఇంకా మనలో మిగిలి ఉన్న ఈ మాత్రపు మత క్రమశిక్షణకు కారణము ఆచార్యులవారేనని ఎప్పుడూ మరచిపోరాదు. గోకులాష్టమి, నవరాత్రులవలే ఆచార్యులవారి జయంతి జరుపుకోవాలి. వారి పాదుకలు ప్రతి నిత్యం పూజించాలి. వారి అనుగ్రహాన శుభపరంపర కలుగుతుంది."

అనే మహాస్వామివారి అదేశమును ఆచరణలో ఉంచుకొనుటకు ఆసక్తి కలిగిన భక్తకోటి ప్రయోజనార్థమై "శ్రీ శంకరభగవత్ పూజ్యపాద పూజా విధానము" కామకోటి మాసపత్రిక మే 1968 నుండి గ్రహింపబడి పునః ప్రకటించడమైనది."

## పూజా కల్పము

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥
అస్మచ్ఛ్రీ గురుచరణారవిందాభ్యాం నమః ।

*(ఇట్లు గురువందనము చేసి - అటుపిమ్మట ఆచమనము చేసి సంకల్ప చేయవలయును.)*

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥

శ్లో॥ దీపస్త్వం బ్రహ్మ రూపోసి జ్యోతిషాం ప్రభు రవ్యయ ।
సౌభాగ్యం దేహిపుత్రాంశ్చ సర్వాన్కామాంశ్చ దేహిమే ॥

*(దీపమూలే పుష్పాక్షతాన్ని న్నిక్షిప్య, దీపము వద్ద పుష్పాక్షతలను ఉంచవలెను.)*

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శుభతిథౌ.... మమసంభావిత సకల దురిత నివారణార్థం ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం శ్రీశంకర జయన్తీ ..... పుణ్యకాలే శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్యపాద ప్రసాద సిద్ధ్యర్థం శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాద పూజాం కరిష్యే! (ఇట్లు సంకల్పము చేసి.)

తదంగ కలశారాధనం కరిష్యే ।
కలశే గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య ॥

శ్లో॥ కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః ।
మూలే తత్ర స్థితో బ్రహ్మా । మధ్యేమాతృగణాస్మృతాః ॥
కుక్షౌతు సాగరాస్సర్వే॥ సప్తద్వీపావసుంధరా ।
ఋగ్వేదోఽథయజుర్వేదః స్సామవేదోహ్యథర్వణః ॥
అంగైశ్చసహితాస్సర్వే॥ కలశాంబు సమాశ్రితాః ॥
కలశపూజను కావింపవలయును.

*(ఆ తరువాత... ముందుగా మహా గణాధిపతి పూజ నాచరించవలయును.)*

సకల కార్య నిర్విఘ్న తా సిద్ధ్యర్థం
మహా గణాధిపతి పూజాం కరిష్యే.
వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।
అవిఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥

*(ఇట్లు విఘ్నేశ్వర ప్రార్థనము గావించి శ్రీ శంకరాచార్య పూజను చేయవలయును).*

## ధ్యానము

అజ్ఞానాంతర్గహన పతితా నాత్మవిద్యోపదేశైః
స్త్రాతుం లోకాన్ భవదవశిఖాతాప పాపచ్యమానాన్
ముక్త్వా మౌనం వటవిటపినో మూలతో నిస్సర న్తీ
శంభోర్మూర్తి శ్చరతి భువనే శంకరాచార్య రూపా॥
శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః ధ్యానం సమర్పయామి.

## ఆవాహనము

వేదాన్తార్థ తదాభాస క్షీర నీర వివేకినం ।
నమామి భగవత్పాదం పరమహంస ధురంధరం ॥

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః ఆవాహనం సమర్పయామి.*

## ఆసనము

సర్వజ్ఞ పీఠాధిష్ఠాత్రే నమః శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః నవరత్న ఖచిత సువర్ణ సింహాసనం సమర్పయామి.

## పాద్యమునకు ఉదకము

పద్మపాదార్చి తాంఘ్రికాయ నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః పాద్యం సమర్పయామి.*

## అర్ఘ్యమునకు ఉదకము

జగత్పూజ్యాయ నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః అర్ఘ్యం సమర్పయామి.*

## అచమనమునకు ఉదకము

చిదానందయ నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః అచమనీయం సమర్పయామి.*

## స్నానం

నిర్మలాయనమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః స్నానం సమర్పయామి.*

## వస్త్రము

కాషాయ వసనో పేతాయనమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః వస్త్రం సమర్పయామి.*

## యజ్ఞోపవీతము

బ్రహ్మజ్ఞాన ప్రదాయ కాయనమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః యజ్ఞోపవీతం సమర్పయామి.*

## చందనము

భస్మద్ధూళిత విగ్రహాయనమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః గంధం సమర్పయామి.*

## అక్షతలు

అక్షరాయనమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః అక్షతాన్ సమర్పయామి.*

## అభరణములు

విశాల వక్షసే నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః ఆభరణాని సమర్పయామి.*

## పుష్పములు

సునాసాయ నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః పుష్పాణి సమర్పయామి.*

## శ్రీశంకర భగవత్పాద చతుర్వింశతి నామావళిః

| | |
|---|---|
| 1. అష్టవర్షచతుర్వేదినే నమః | 13. సర్వలోకానుగ్రహకృతే నమః |
| 2. ద్వాదశాశిల శాస్త్ర విదేనమః | 14. సర్వజ్ఞత్వాది భూషణాయ నమః |
| 3. సర్వలోక ఖ్యాతశీలాయనమః | 15. శ్రుతి స్మృతి పురాణార్థాయ నమః |
| 4. ప్రస్థానత్రయ భాష్యకృతేనమః | 16. శ్రుత్యేక శరణ ప్రియాయ నమః |
| 5. పద్మపాదాది సచ్ఛిష్యాయ నమః | 17. సకృత్స్మరణ సంతుష్టాయ నమః |
| 6. పాషండధ్వాన్తభాస్కరాయ నమః | 18. శరణాగత వత్సలాయ నమః |
| 7. అద్వైతస్థాపనాచార్యాయ నమః | 19. నిర్వ్యాజకరుణామూర్తయే నమః |
| 8. ద్వైతాది ద్విపకేసరిణే నమః | 20. నిరహంభావ గోచరాయ నమః |
| 9. వ్యాసవన్దిత సిద్ధాన్తాయ నమః | 21. సంశాన్తభక్త హృత్తాపాయ నమః |
| 10. వాదనిర్జితమండనాయ నమః | 22. స్వరజ్ఞానఫలప్రదాయ నమః |
| 11. షణ్మతస్థాపనాచార్యాయ నమః | 23. సదసద్వస్తువిముఖాయ నమః |
| 12. షడ్గుణైశ్వర్య మండితాయ నమః | 24. సత్తాసామాన్య విగ్రహాయ నమః |

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః నానావిధపరిమళ పత్రపుష్పాణి సమర్పయామి.*

### ధూపము

వనస్పతి రసోద్భూతో గంధాఢ్యో గంధ ఉత్తమః
ఆఘ్రేయస్సర్వ దేవానాం ధూపోయం ప్రతిగృహ్య తాం॥
సుజ్ఞానాబ్ధి చంద్రమసే నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః ధూప మాఘ్రాపయామి.*

### దీపము

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా
గృహాణ మంగళం దీపం త్రై లోక్యతిమిరాపహ ॥
అజ్ఞాన తిమిరాదిత్యాయ నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః దీపం దర్శయామి.*

### నైవేద్యము

అన్నంచతుర్విధం స్వాదుపయోదధి ఘృతం తథా ॥
నానావ్యంజన శోభాఢ్యం నైవేద్యం ప్రతిగృహ్యతాం॥
నిత్య తృప్తాయ నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః నైవేద్యం సమర్పయామి.*

## తాంబూలము

పూగీఫల సమాయుక్తం నాగవల్లీదళైర్యుతం
కర్పూరచూర్ణసంయుక్త తాంబూలం ప్రతిగృహ్యతాం ॥

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః తాంబూలం సమర్పయామి.*

## నీరాజనము

చంద్రాదిత్యౌ చ ధరణీ విద్యుదగ్ని స్త్వమేవచ ।
త్వమేవ సర్వజ్యోతీంషి భజనీరాజనం ప్రభో ॥ మహాతేజసే నమః

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః నీరాజనం సమర్పయామి.*

## మంత్ర పుష్పము

వేదాంతార్థ విభాసకాయ గురవే శాంతాయ సన్న్యాసినే ।
నానావాది నగేంద్ర సంఘపవయే యోగీంద్రవన్ద్యాయ చ।
మోహధ్వాంత దివాకరాయ భగవత్పాదాభిజాం విభ్రతే ।
తస్మై భాష్యకృతే నమోస్తు సతతం పూర్ణాయ బోధాత్మనే ॥

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః మంత్రపుష్పం సమర్పయామి.*

## ప్రదక్షిణము

యాని కాని చ పాపాని జన్మాంతర కృతానిచ ।
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే ॥

*శ్రీమచ్ఛంకర భగవత్పూజ్య పాదేభ్యో నమః ప్రదక్షిణం సమర్పయామి.*

## నమస్కారము

శ్రుతిస్మృతి పురాణానాం మాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాద శంకరం లోక శంకరం ॥

సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్ ॥

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మతస్మై శ్రీ గురువే నమః

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః

